# ఉత్తరాలు

## కథలు

శ్రీరంగం రాజేశ్వరరావుగారి "ప్రేమ" వంటి కథ ఈ లోకంలో లేదు. నిజానికి చాలా బావుంది. కథ, ప్రారంభము నుంచి, చివరివరకూ సౌందర్య భరితమై ఉన్నది. స్పష్టంగా చెప్పాలంటే ఈ సంచికకు ఇది హైలైట్. రచయితకు మా అభినందనలు తెలియజేస్తారని ఆశిస్తున్నాము.

డి. ఎస్. ప్రసాద్, బి. యస్. యస్. రెడ్డి, వి. వి. నాగిరెడ్డి, కె. లక్ష్మిరెడ్డి (తిరుపతి)

* * *

3—3—1967 పత్రికలో ప్రచురితమైన శ్రీరంగం రాజేశ్వరరావుగారి "ప్రేమ" కథ చదివాను. మంచి పటుత్వంతో సాగి కథ కడుపుబ్బ నవ్వించింది. కథలో "మిల్కాసింగ్ కు క్రికెట్ కు సంబంధము లేదని ప్రేమలో అనిపించారు." రచయిత. కాని మిల్కాసింగ్ మద్రాసు మేటి క్రికెటర్లలో ఒకరనియు, మరియు టెస్ట్ ఆటగాడని తెలియక పోవడం శోచనీయం. ఈ తప్పు మినహా కథ మంచి శైలిలో సాగింది.

ఆర్. విశ్వనాథరావు (పిడ్డిపేట)

* * *

"ప్రేమకు నిర్వచనం" అనే కథ చాలాబాగుంది. అది చదువుచున్నంతసేపు ఏదో ఒక బాధ కల్గించింది. ప్రేమ అనేది అమూల్యమైనది. దానికి హద్దులుగాని, అవధులుగాని లేవు. అందులో జీవిత భాగస్వామి విషయంలో అది చాలా గొప్పది. నిజంగా యిందులోని రాధపాత్ర చాలా బాగుంది. నన్ను ఎంతో ఆకర్షించింది. దేశంలో అంతటి త్యాగమూర్తులకే స్థానం గలదు. స్త్రీకి కావలసింది భర్త అందం ఐశ్వర్యంకాదు. కురూపి అయినా, అంగవిహీనుడుఅయినా కావలసింది పవిత్రమైనది ప్రేమ. యీ కథ ఆనాటి పతివ్రత సుమతి కథ గుర్తుకు తెస్తుంది. యీ కథతో నన్ను కదిలించివేసిన రచయితకు నా అనేక ధన్యవాదాలు.

తంగెళ్ళ వెంకట సూర్యనారాయణశర్మ (విజయవాడ)

* * *

"గజరాజు" కథ బాగుంది. ఇందులో మోహన్ గారిపాత్ర మెప్పుగా యున్నది. "జాహ్నవి సైసోదరులు" సీరియల్ చదువుతుంటే ఉమాపతివంటి అమాయకులున్నారా అని అనిపిస్తుంది. చదువుతున్నంతసేపు పరిసరాల్ని మరిచిపోయాము. ఇలాంటి సీరియల్ను పాఠకులకు అందచేసిన శ్రీ పి. ఆనందారామంగారికి నా కృతజ్ఞతాభివందనములు. పద్మనాభంగారి "ఎందుకు" శీర్షిక చదువుతుంటే భలేగా ఉంది.

పొవాల భీమాచారి (అంబర్ పేట)

* * *

"తెల్లగులాబి" చాలా బావుంది. నా ప్రియ స్నేహితురాలు కూడా ఇలాంటి సమస్యనే ఎదుర్కొంటూ ఉంది. కనుక నా మనస్సును ఎంతో ఆకర్షించినది. రచయితకు నా కృతజ్ఞతాభివందనములు.

ఆషాలత (విశాఖపట్నం)

* * *

# ఉత్తరాలు

వేదుల కామేశ్వరరావుగారి "విజయవాడ విశ్వరూపమ్" బాగావేఉంది. కాని అది విశ్వరూపం కాదు. విషయానుక్రమణికలో పేర్కొన్నట్లు "విజయవాడ స్వరూపం" మాత్రమే.

'సుమోగా' (విజయవాడ)

* * *

పి. పుల్లారావుగారి చివరకు మిగిలేవి జ్ఞాపకాలు కథ చాలాబాగుంది. చక్కని కథను ప్రచురించిన మీకు ధన్యవాదాలు.

కె. సీతారామస్వామి, (మామిడికుదురు.)

* * *

3—3—67 తేదీగల పత్రికలో 'వల' కథ కొత్త రకంగా నడిచింది. తను తమ పిల్లల్ని అంత బాహాటంగా వదిలే తలిదండ్రులకు ఒక పాఠాన్ని బోధిస్తుంది. రచనలోను కథాగమనంలోను కొత్తదనం వుంది. రచయిత్రి డి. కామేశ్వరిగారికి నా అభినందనాలు తెలియజేయండి.

పి. ఆనందరావు, (రాజమండ్రి.)

* * *

శుక్రవారము (3—3—67) ఆంధ్రసచిత్ర వార పత్రికలోని డి. కామేశ్వరిగారి వ్రాసిన "వల" చదివిన నేను యిలా వ్రాయకుండా వుండలేక పోతున్నాను.

తల్లి జానకమ్మ అమాయకురాలైన తన కూతుర్ని అలా (దమ్మిడీకట్నం లేకుండా పోతుందని) విచ్చల విడిగా (అంటే గోపాల్ తో) తిరగమని ప్రోత్సహించుట చాలా అన్యాయం.

జానకమ్మలాటి తల్లులు నేటి యువకులంతా గోపాల్‌వంటి వారనుకొనుట శుద్ధ పొరపాటు. ఏమైనా బరితెగించిన జానకమ్మలాటి తల్లులు తమకుమార్తెల్ని అటువంటి "వల" వంటి విషవలయం లోనికి దింపి, వారి అమాయక జీవితాలతో చెలగాట మాడేవారికి చేతులుకాలిన తర్వాత ఆకులు పట్టుకొన్న సూక్తి నిజమయితీరుతుంది.

పి. పుల్లారావుగారు వ్రాసిన "చివరకు మిగిలేవి జ్ఞాపకాలు" కథ వాస్తవికతకు చాలా దగ్గిరలో నున్నది.

ఉప్పలపాటి సిస్టర్స్— స్వర్ణ, లలిత, విజయ, (హైదరాబాద్).

## సీరియల్

'జాహ్నవి హైమవతులు' పి. ఆనందరామం గారి సీరియల్ ప్రారంభములోనే పాఠకుల మనస్సును ఆకర్షించినదనుటలో సందేహము లేదు. ముందు, ముందు ఏమి జరుగుతుందో నన్న ఉత్కంఠతతో ప్రతివారం ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్నాము.

బి. హైమవతి (కావలి)

* * *

రామ్‌శాస్త్రి సీరియల్ మహారాష్ట్రుల చరిత్రకు ప్రతిబింబితంగాను, చదవడానికి ఉత్సాహంగాను ఉంది. తక్కిన సీరియల్స్ సుప్రభాతం, జాహ్నవి, హైమవతులు కూడా ఎంతో బాగుంటున్నాయి.

ఆర్. చంద్రశేఖర్, (నిజామాబాద్.)

## వ్యాసాలు

కుమారి హేమమాలిని 1948 అక్టోబరు 16 న జన్మించినట్లయితే ఆమెకు పందొమ్మిదో ఏడు వెళ్లి ఇరవయ్యో ఏడు వచ్చినట్లు కాదు. పదునెనిమిది వెళ్లి పందొమ్మిది వచ్చినట్లు. 3—2-67 పత్రికలో కొత్తనటి కుమారి హేమమాలిని గురించి వ్రాసిన వ్యాసంలో పై పొరపాటు దొర్లింది. ఆ పొరపాటును సవరించగలరు.

—విమ్మగడ్డ లలిత ప్రసాద్ (విజయవాడ)

## ముఖచిత్రం

శుక్రవారం ముఖచిత్ర రచన చాలా బాగున్నది. శ్రీ కె. శేషగిరిరావుగార్కి మా అభినందనలు.

ఎ. వి. రంగయ్య, ఎ. అన్నపూర్ణ (గుంతకల్లు)

## కార్టూన్లు

గొల్లప్రోలు నుంచి ఆంధ్రపత్రిక పాఠకు లిద్దరు 27—1—67 పత్రికలోని 'జయదేవ్' గారి కార్టూనును విమర్శించారు. వారు దానిని సరిగా అర్థము చేసుకోనట్లు దీనివలన స్పష్టమవుతుంది. ఆ వ్యక్తి చేతిలోనిది 'హాకీస్టిక్' కాదనియు అది 'చేతికర్ర' మాత్రమేనని మనం గ్రహించాలి. ఆ వ్యక్తి క్రికెట్ కామెంటరీ వింటూ ఉద్రేకం (అసలు మాచ్‌లో బౌండరీలు కొట్టినపుడల్లా) పట్టలేక అందుబాటులో నున్న చేతికర్రతో 'గ్లాసు' ను కొట్టారు (క్రికెట్ బాల్ వలె). ఇదే రకమైన ఉద్రేకం కొన్ని సందర్భములలో రేడియోలు, టెలివిజన్‌సెట్లు పగలగొట్టుటకు కారణమైనవి.

చక్రపాణి (హైదరాబాదు)

## న్యూఢిల్లీ లేఖ

శ్రీ కృష్ణగారి "న్యూఢిల్లీలేఖ" చాలపక్షపాతంగా వ్రాస్తున్నారు. ఢిల్లీలో నవంబరు 7 సంఘటనలకు జనసంఘమే కారణమన్నారు. కాని న్యాయమూర్తి విచారణ సంఘము ఈసంఘటనలతో ఏరాజకీయ పార్టీకి సంబంధములేదన్నారు. దీనికి శ్రీకృష్ణగారి సమాధాన మేమిటి? అదీగాక 10.3 67 ఆంధ్ర పత్రికలో "ఢిల్లీ కాంగ్రెసు చెరిగి పోవటానికికారణం —జనసంఘం ఉద్దేశాలచేత, ఆదర్శాలచేత ఆకర్షింపబడి ప్రజలు వోటు చేశారనుకుంటే అదిసరికాదు" అన్నారు. కాంగ్రెసును అసహ్యించుకుంటే కేరళలోలాగ కమ్యూనిస్టులకు వోటు చేయవచ్చుగా. మరి జనసంఘానికే ఎందుకు వోటు చేయాలి? అని శ్రీకృష్ణగార్ని అడిగితే ఏమి సమాధానమిస్తారు?

ఇకనుండైనా విదేశీ వ్యామోహాన్ని కొంచెం తగ్గించి స్వదేశాభిమానుల్ని గౌరవించటము మంచిదని వారికి మా విన్నపము.

జబ్బి కృష్ణవేణి (అనకాపల్లి)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 17—3—'67
పరాభవనామ సం॥ ఫాల్గుణమాసం శుద్ధ షష్ఠి
సంపుటము : 59 సంచిక : 27

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1


చందా వివరాలు : 10-2-1967 మొదలు

భారతదేశం

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22 40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5 60 |
| విడిప్రతి | 0.40 |

ఇతరదేశాలకు

ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |

## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన: శ్రీ కె. శేషగిరిరావు





# మంత్రివర్గం నిర్వాహణలో ఎదురవుతున్న సమస్యలు

కాంగ్రెసు పనిటకలకు ఒక కొనకి వచ్చాయి. కలలు ఎక్కడ అసంపూర్తిగా మిగిలి పోయినవో గుర్తుతెచ్చుకొని, అలా మిగిలి పోడానికి కారణాల్ని తెలుసుకుని, ఇంకొని భద్రపరచు కోవడం ఇప్పటి ప్రభుత్వాల యొక్క ముఖ్య కర్తవ్యం. రాష్ట్రాల్లో చాలవరకు కాంగ్రెసు పలుకుబడి జారి పోయింది. ఇప్పుడు అధికారాన్ని చేజిక్కించుకున్న పార్టీలు మరీ అధ్వాన్నంగా పరిపాలిస్తే తప్ప, మళ్లీ కాంగ్రెసు తలెత్తి చూసే అవకాశం లేదు. ఇక్కడ సమాచారాన్ని బట్టి లోక్ సభను పూర్తిగా కాంగ్రెసువారితో నింపడమనేది అసంభవంగా తోస్తూ వుంది. ఇప్పుడిప్పుడే న్యూఢిల్లీలో అధికారాన్ని గురించిన అంతర్యుద్ధాలు మొదలవుతున్నాయి.

భారతదేశానికి మళ్లీ ప్రధానమంత్రిగా ఉండ డాన్ని శ్రీమతి ఇందిరా గాంధి ఎంతగానో వాంఛి స్తున్నారు. కాంగ్రెసు పరిపాలనలో ఉన్న ఆంధ్ర ప్రదేశ్, మైసూరు, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాలు కూడా శ్రీమతి ఇందిరాగాంధియే ప్రధానమంత్రిగా రావాలని కోరుకుంటున్నారు. అతివా వారికంటే శ్రీమతి గాంధి ఎన్నో రెట్లు నయమని వారి ఉద్దేశం. శ్రీ మొరార్జీదేశాయ్ గుప్పిట్లో రహస్యాన్ని బయట పెట్టకుండా, తాము ప్రధాని నాయకత్వానికి పోటీ చేసినంత మాత్రాన కాంగ్రెసు పార్టీ బలహీనం అయిపోదు, అన్నారు. బాబూ జగ్‌జీవన్‌రాం గార్ని విడిచిపెట్ట డానికి వీల్లేదు. ప్రధాని మంత్రి అవాలనో, రాష్ట్రపతిగా కాలుమీద కాలేసుకు కూర్చోవాలనో ఆయన ఆశిస్తున్నారు! క్రిందటి సంవత్సరం శ్రీమతి ఇందిరా గాంధిని ఒత్తిడి పెట్టి ఆయన్ని మంత్రి వర్గంలో ఒకరుగా చేర్పించి, ఉపాయంగా అపాయం తప్పించిన శ్రీ కామరాజ్ గారికి మనం కృతజ్ఞత చెప్పుకోవలసి వుంటుంది. బాబు జగ్‌జీవన్‌రామ్ ఇప్పుడు ఎంతో మెజారిటీతో వచ్చారు. ఈ ఎన్నికల సరంజామాలో శ్రీమతి గాంధి ఒక ఉద్దేశాన్ని వెలిబుచ్చారు. బీహారులో వోటు చేసిన ప్రజలందరూ జ్ఞానరహితులు, బొత్తిగా తెలివి తక్కువవారు, అన్నారామె. మళ్లీ వారే మరొక అభిప్రాయం వెలిబుచ్చారు. ఈ సార్వత్రిక ఎన్నికల పర్యవసానంగా దేశంలో ప్రజలందరూ తెలివి మీరిపోయినట్టు కనబడుతున్నారని ఆమె ఆశ్చర్య పోయారు. మరో విధంగా చెప్పాలంటే వారి తండ్రి తెలివి తక్కువ వాళ్ల వోట్లతోనే అధికారానికి వచ్చారు. కాంగ్రెసు తిరిగి ఎక్కడెక్కడ నిలద్రొక్కుకున్నదో, అక్కడల్లా తెలివి తక్కువ వాళ్ల మయమే. అందుకే కాంగ్రెసుకు వోటు చేశారు!

ఆర్థిక మంత్రి పదవి మరొకటి వుంది. దాని గురించి ఎంత రభసన్నా జరుగుతుంది. పాపం శ్రీయుత శచీంద్ర చౌదరి గారు ఎక్కడున్నారో ఏమో! ఆపదవిని నిర్వహించిన శ్రీ శచీంద్రచౌదరి గారికి నామరూపాలులేకుండా చేసేశారు ప్రజలు. మరి ఇప్పుడు ఆ పదవిని తీసుకోడానికి ఎవర్తైనా వెనకంజ వేస్తారో? లేకపోతే ఇదివరకటి లానే ముందుకొస్తారో? చెప్పలేము. ఇక్కడ శక్తి సామర్థ్యాలు ప్రధానం. శ్రీ అశోక్‌మెహతాగారు ప్రణాళికా సంఘంలో ఉన్నారు. ఆయన కోరిక ఏదో వుంటుందిగా మరి? డా. వి. కె. ఆర్. వి. రావుగారున్నారు. ఆయన కూడా తన కోరికకు గుర్తింపు కావాలి అనడంలో పొరపాటు లేదు. ఆర్థిక మంత్రి పదవి గురించి ప్రస్తావన వచ్చినప్పుడు చూచాయిగా వీరిద్దరూ కనిపిస్తున్నారు. మరి శ్రీ బార్వే గారు మూల కూర్చునే మనిషి కాదుగా? ఆయన, వీరిద్దరి మీదా తమ చాయను నడయాడిస్తున్నారు!

విజంభాభివు లైన లాలాగుల్జారిలాల్ నందా హార్యానా సూర్యుడి వేడిమిలో చలి కాచుకుంటున్నారు. రెండుసార్లు ప్రధాని పదవి కెగిరి, మంత్రివర్గంలో ప్రధాన స్థానం వహించిన శ్రీవారు ప్రభుత్వం మీద దుమ్మెత్తి పోశారు! ముఖ్యంగా ప్రజల మత విధానాన్ని ప్రభుత్వం మన్నించడం లేదని ఆడి పోశారు.

ఈ సార్వత్రిక ఎన్నికల్లో కాంగ్రెసు పూర్తిగా దెబ్బతిని పోయింది. అయినా, ఏపార్టీ సహాయ సహకారాలు మాకు అక్కర్లేదని త్రోసిపారేసింది కాంగ్రెసు హైకమాండ్. ఒకవిధంగా




1967 లో ఎన్నికల తర్వాత ముఖ్యరాష్ట్రాలలో ఏర్పడ్డ పరిస్థితిని పై పటం స్థూలంగా సూచిస్తుంది.


నే న్నింత చిన్న వాడి నయి పోయానా!
విరుధునగర్
నేను విద్యార్థుల్ని ఝుడిపించాను, వాళ్ళు నన్ను ఝుడిపించారు
ఇప్పుడు మనం ఎకడికి వెళ్ళాలి?
ఓటమికి నేను అలవాటు పడిపోయాను
పట్నాయక్
నేను ఓడిపోయినా నేను నెగుకొస్తాను. ఓటమిని ఉల్లాసంగా స్వీకరిస్తాను!
ఇతరుల పాపానికి నేను బలైపోయాను.
హృదయపూర్వక సంతాపాన్ని అందుకోండి!
సారీ నేను దెబ్బతిన్నాను ఇందిరాజీ కాని తిరిగి రావడానికి ప్రయత్నిస్తాను.

## సర్వాధికారి లేఖ

చెప్పాలంటే, ఈ హైకమాండ్, రాష్ట్ర ప్రభుత్వాల్ని, అవకాశమున్నంత మేరకు రాజకీయ కుతంత్రాలకు పాల్పడండి అని ఆదేశమిచ్చింది! స్వాతంత్ర్యం రాకముందు భారత దేశ పరిస్థితిని గుర్తు తెచ్చుకుని అలా వ్యవహరించ మన్నదన్న మాట! శ్రీ సుఖాడియా ఒకమార్గాన్ని ఏర్పరచి వుంచారు. ఆయన నలుగురు ఇండిపెండెంట్లని కాంగ్రెసు పార్టీలోకి చేర్చుకున్నారు. అత్యవసర పరిస్థితుల్లో ఇండిపెండెంట్లు ఆదుకునేందుకు ఎప్పుడూ సిద్ధంగానే ఉంటారు. కాంగ్రెసు కోరికను మన్నించని వారంటూ ఉండనే వుండరు.

వారికి మంత్రి పదవి నివ్వడం తప్పితే వేరే గత్యంతరం లేదు. ఒక కాంగ్రెసు ముఖ్యమంత్రి ఒక ఇండిపెండెంట్ నాయకునికి మంత్రి పదవి ఇచ్చి సత్కరించినట్లయితే ఆపార్టీ అంతతో సంతృప్తి పడవలసి వుంటుంది. విశాలమైన, సువిశాలమైన, మహావిశాలమైన మంత్రి వర్గాలు లున్నాయంటే, ఇటువంటి విషయాన్ని వారు అసలు విస్మరించ కూడదు. గత పదిహేడు సంవత్సరాలనుంచి కాంగ్రెసు నాయకత్వానికి రావాలని, కాంగ్రెసు కావాలని ఓటు చేస్తున్నది పన్ను కట్టే నాథుడు! ఆ నాథులే ఇండిపెండెంట్లను స్వీకరించమని, కాంగ్రెసు కార్యాలయాల్ని అధివసించేట్టు చేయమని గోల పెడుతున్నారు!

ఇటువంటి దేశభక్తి నినాదాల్ని ప్రతిపక్షాల్లోని నిశిత పరిశీలకులు ఇట్టే కనిపెట్టేస్తారు! అంతరార్థం గ్రహించి, అందుకు అనుగుణంగా ప్రయత్నిస్తారు. సోషలిస్టులు ఎస్. ఎస్. పి., పి. యస్. పి. లుగా మారిపోయారు. కమ్యూనిస్టులు వామ పక్షంగాను, అతివాదులుగాను విడిపోయి, 'రష్యాయుకరించబడిన' 'చైనీకరించబడిన' కమ్యూనిస్టులుగా తయారవడానికి యత్నిస్తున్నారు. కొందరు రిపబ్లికన్ మైదానాల్లో స్వైరవిహారం చేస్తున్నారు. ఇదిభారత దేశ నానాజాతి సమ్మేళనానికి మచ్చుతునక! కొన్ని రాష్ట్రాల్లో కాంగ్రెసు మరీ పలచబడిపోయింది. ఏఒక్క ప్రతిపక్షానికీ ప్రభుత్వాన్ని నిర్వహించగల బలమున్నట్లు కనిపించదు. కొన్ని, మిశ్రమ వర్గాలతో అంత అస్తవ్యస్తంగా వుంటున్నా, ఇండిపెండెంట్లను కలుపుకోడానికి వెనకాడుతున్నాయి. ఇండిపెండెంట్లకు సంబంధించినంత వరకు, వారు ఆశించిన మేరకు ఎటువంటి నిర్ణయం తీసుకోడానికయినా సర్వస్వతంత్రులు.

1920వ సంవత్సరంలో శ్రీయుత అస్క్విత్ మాట్లాడుతూ ఒక విషయం చెప్పారు. "ఉదారంగా ఉన్నట్లయితే ఏకార్యమూ సఫలీకృతం కాదు. లాభదాయకం అవదు. దానికి తగిన ప్రతిఫలం అంతకంటే ముట్టదు." అన్నారాయన. కాంగ్రెసు అవలంబించే విధానాన్ని లాభదాయకమైన దానిగాను, ప్రతిఫలం ఇచ్చేది గాను చేయడానికి ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. ఫిబ్రవరి 27వ తేదీగల 'స్టేట్స్‌మెన్' పత్రికలో, ఇటువంటి పద్ధతిని కరుస్తున్నట్లున్న ఒక వ్యాసం ప్రచురింపబడింది: నిగూఢమైన విధినిక్షేపరాయుళ్ళు



గుంటూరు నియోజకవర్గంనుంచి లోక్‌సభకు ఎన్నికయిన శ్రీ కొత్త రఘురామయ్య.

తమ ఆంతరంగిక మిత్రుడు వైదొలగి పోతున్నందుకు విచారిస్తున్నారు: ఇప్పుడు ధరలు తగ్గి పోవడం నిశ్చయం గనక నిక్షేపాన్ని నెమ్మదిగా బజార్లోకి తెస్తున్నారు, అని ఆ వ్యాస సారాంశం.

ఇక 'కాంగ్రెసు మార్కు' తర్కం మరో రకంగా ఉంది. గ్వాలియర్ మహారాణి కాంగ్రెసు పక్షంలో ఉన్నంత కాలం ఆమె పక్కా ప్రజాస్వామ్యవాది. కాంగ్రెసును విడిచిపెట్టి వేయగానే ఆమె అహంకారంతో నిండిన భూస్వామిగాను, ప్రతి ఘాతకురాలు గాను మారిపోయింది! పాటియాలా మహారాణి కాంగ్రెసు టిక్కెట్టు మీదనే తిరిగి ఎన్నికయారు గనక ఆమె ఎప్పుడూ ప్రజల తరపు మనిషే! కాని, భరత్‌పూర్ మహారాజాగారి కంటే మరో ఘాతకుడు వేరే వుండరు. ఎందుకూ అంటే ఆయన కాంగ్రెసు నాయకుడయిన, శ్రీ రాజబహదూర్‌ను ఓడించారుగా మరి, అందుకు!

బిర్లావారు లక్షల కొద్దీ ధనాన్ని కాంగ్రెసు పోషణంలో గుమ్మరిస్తున్నారు గనక, భారత దేశంలో వారికంటే దేశభక్తి పరాయణులు వేరే ఎవరూ లేరు! ఈసందర్భంలో ఒక విషయం చురుక్కుమనిపిస్తుంది. మహాత్మా గాంధీగారు బిర్లాభవనంలోనే హత్యగావింప బడ్డారు! శ్రీయుత మొరార్కా గానే కాంగ్రెసు వర్తకుడు ఓడిపోవడంతో బిర్లావారు సంఘ విద్రోహులుగా తయారైనారని శ్రీ సుఖాడియా బిర్లా వారి అవినీతి పనులన్నిటినీ గుదిగుచ్చి కాంగ్రెసు వర్కింగ్ కమిటీకి ఫిర్యాదు చేశారు.!

## మద్రాసులో కాంగ్రెసు పతనం

మద్రాసులో కాంగ్రెసు అంతర్థానమైపోయింది అంటే, అది చరిత్రలో ఒక గొప్ప విశేషం. ఒక ప్రజల మనిషి, ఒక చెవిని ప్రజల్లో పారేసి వ్యవహారాలను చక్కదిద్దుకునే ఒక వ్యవహార దక్షుడు, ప్రజల్లో ప్రబలుతున్న కాంగ్రెసు వ్యతిరేకోద్యమాన్ని పసిగట్ట లేక పోవడం కంటె

భిన్నతవేముంటుంది? ఈ కట్టూ ఆదిగా 'సెంట్రల్ ఇంటెలిజెన్స్ ఆర్గనైజేషన్' పూర్తిగా ధ్వంసమై పోయినందుకు కేంద్ర దేశీయాంగ మంత్రిత్వ శాఖకు మనం కృతజ్ఞత తెలపుకో వలసి వుంటుంది! బ్రిటిషువారి హయాములో కాంగ్రెసు వర్కింగ్ కమిటీ మధ్యలో గూఢ చారుల్ని చొనిపి రహస్యాల్ని ఛేదిస్తూ వుండేవారు బ్రిటిషువారు అలాంటి కొన్ని మార్గాల్ని ఇది వరలో మనకు చూపించి ఉన్నారు

కాంగ్రెసు దేశీయాంగ శాఖ ఒక ఆర్డరు జారీ చేసింది కాంగ్రెసు వారిమీద ఫిర్యాదుల్ని తమ మంత్రిత్వ శాఖ ఆమోదించదు, అన్నారు! ఈరోజున కమ్యూనిస్టులకు, జన సంఘం వారికి మన ప్రభుత్వానికంటే చక్కని ఇంటెలిజెన్స్ సర్వీస్ ఉంది ఉదాహరణకు, ఢిల్లీలో ఏయే పోలింగ్ బూత్‌ల దగ్గర ఎవరెవరు ఆధిపత్యంలో వున్నారో జనసంఘానికి బాగా తెలుసు!

హిందీని ఆయుధంగా చేసుకుని డి యమ్ కె కాంగ్రెసును పడగొట్టింది కీర్తి శేషులైన శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి పార్లమెంటులో ఒక భాషచట్టాన్ని ప్రవేశపెడతానని హామీ ఇచ్చి ఉన్నారు ఈ వాగ్దానం తీరకుండానే ఆయన కీర్తి శేషు లైనారు!

ఈ ఎన్నికల్లో విద్యార్థుల పాత్ర విశేషించి చెప్పదగిందిగా ఉంది మద్రాసులో ఒకవిద్యార్థి శ్రీ కామరాజును చిత్తు చిత్తుగా ఓడించారు! బీహార్, ఉత్తరప్రదేశ్ వగైరా రాష్ట్రాల్లో విద్యార్థులు కాంగ్రెసుకు వ్యతిరేకంగా ప్రచారం చేశారు వారు అలా చేయడానికి తగిన కారణాలు ఉన్నాయి గనుకనే అలా చేశారు ఒక మంత్రిగారి కుమారుడు విదేశాలకు పోయి విద్యాభ్యాసం చేసేందుకు అనేకమైన అవకాశా లున్నాయి అదే ఒక పేదవాడి కొడుకు, ఎన్ని యోగ్యత లున్నా, కనీసం పొట్టకూటికి యేదో ఒక ఉద్యోగం చేసుకుందామన్నా, అది దొరకడం దుర్లభమైపోతూ వుంది!

ప్రస్తుత పరిస్థితికి ప్రత్యక్ష నిదర్శనాలు చాలా ఉన్నాయి ఇప్పటివరకు కాంగ్రెసు చాలినంత మెజారిటీతో వుంది గనుక ఇష్టం వచ్చినట్టు చట్టాన్ని మార్చుకోడానికి సదుపాయం ఏర్పడింది కాని, ఇప్పటి కాంగ్రెసుకు ఆ బలంలేదు చట్టాన్ని సవరించటానికి కనీసం రెండూ బై మూడో వంతయినా మెజారిటీ వుండాలి కాంగ్రెసుకు ఇప్పటికి 280 మంది సభ్యులన్నారు 512 మంది సభ్యులున్న సభలో చట్టాన్ని సవరించాలంటే కనీస కాంగ్రెసు సభ్యత్వం 342 ఉండాలి

కొద్ది రోజుల్లోనే కొత్త ప్రధాన మంత్రిగారు వస్తారు లేదా ఉన్నవారే నిలద్రొక్కుకుంటారు ప్రధానమంత్రిగా ఎవరు వచ్చినా ప్రభుత్వాన్ని ఏర్పరచు కోవడానికి యమయాతన పడడం తథ్యం 15గురు మంత్రులలోను రాజ్యసభకు చెందిన ఇద్దరు మంత్రులు అసలు ఎన్నికలకే నిలబడ లేదు ఉన్న పదముగ్గురులోను ఎనిమిది మంది మాత్రమే తిరిగి ఎన్నుకోబడ్డారు స్వతంత్రంగా సమర్థంగా నిర్వహించగల నలుగురు మంత్రులు ఓడిపోయారు ఇక, మంత్రి వర్గాన్ని ఏర్పరచేందుకు కాంగ్రెసు పార్టీలో మనుషు లెక్కడ ఉన్నట్టు? మద్రాసునుంచి మచ్చుకు ఒక్క కాంగ్రెసు సభ్యుడు కూడా లేడు కొత్త ప్రధానమంత్రిగారు, ఈ ప్రాంతానికి ప్రతినిధిగా ఎవరిని నియమిస్తారో వేచిచూడ వలసిందే! ●




## లోకం పోకడ

—(ఈ కారణాలన్నిటినీ దృష్టిలోకి తీసుకున్నా) కాం జెస్ (శ్రీ హెచ్ పి మాథుర్) గెలిస్తే—గెలిచే అవకాశాలు అంత ఎక్కువగా లేవు—అది వి ఎం బిర్లాకి వేర్పిన మంచి ఫలం అవుతుంది.

'పార్టీ' నియోజక వర్గం గురించి స్టేట్స్‌మన్ (1—2—67)

* * *

—కోటర్లకి కేంద్ర శాసనమంత్రులు 100ని మంది ఎన్నికల ఆటలో మహోత్సాహంగా పడగొట్టారు వారంతా కలిసి ఇప్పుడు 'ఆత నిరుద్యోగుల సంఘం' ఏర్పాటు చెయ్యవచ్చు!

—బ్లిట్జ్‌లో 'హాక్‌సాఫుటి'

* * *

—ప్రభుత్వ కార్యాలయాలకి దిగుతు చోక్కా, లాగూలతోవచ్చే యువకుల ధోరణి చూస్తే ప్రభుత్వం అయిష్టంతో చూడవచ్చు

—పి టి ఐ వార్త (2—3—67)

* * *

సుభద్ర (జోషి) జనసంఘ్ ఓడిస్తుంది

—బ్లిట్జ్ వతాక శీర్షిక (11—2—63)

* * *

—కేంద్రానికి సంబంధించినంతవరకూ మద్రాసులో కాంగ్రెసు పరాజయాలవల్ల ఆ రాష్ట్రానికి కలిగిన నష్టం సరిగ్గా అంచనా వెయ్యటం కష్టం

—'హిందూ' లో కె. రంగస్వామి

* * *

—ఎన్నికలు గెలవటం చాలా తేలిక

—జార్జ్ ఫెర్నాండెస్ (స్టేట్స్‌మన్ 5—3—67)

* * *

వంటిన తెడ్డుకి ఓటమి ఎదురు.

—బ్లిట్జ్ వతాక శీర్షిక (11—2—67)

* * *

—ఓడిపోయిన కేంద్రమంత్రులు ప్రతి పక్షాలతో ఒప్పందాలు చేసుకుని తొడ్డి దోవద్వారా లోక్‌సభ ప్రవేశించటాన్ని కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ కామరాజ ఆమోదించలేదు

—స్టేట్స్‌మన్ (4—3—67)




బాండ్ మిస్ టిల్లీ సోమ్స్‌ని బెర్గ్యుయె వద్ద దింపాడు
"థాంక్స్— సెలవు"

"మీరెంత బాగా కారు నడుపుతారు నాకెలా వచ్చి ఢీకొన్నారు?"
"ఢీ కొన్నందుకు నాకు సంతోషంగా ఉంది మళ్లీ కలుస్తామేమో"
"కలిస్తే మంచిదేగా"

"ఈ అమ్మాయి ఎలా పోతే ఏమిటి! ఇక గోల్డ్‌ఫింగర్‌ని పట్టుకోవాలి — ఎటు? లసాన్ కయితే ఎడం వయిపు, ఎవియాన్ కయితే కుడి వయిపు"




'కొప్పె' గ్రామం పొలిమేరల్లో ఆ పసుపు, వెండి ఆకారం కనిపించింది బాండ్‌కి, రోడ్డు పక్కకి మలుపు తిరిగింది
"అక్కడ అడ్డదారి లేదే!"

"ఓహో, గోల్డ్‌ఫింగర్ నక్క బొక్క పెట్టుక్కుందా?"

బాండ్ గోల్డ్‌ఫింగర్ ఎస్టేటు వెనకభాగానికి వెళ్లాడు
"చిన్నపిల్లలు దొంగదారి ఒకటి వాడుతూనే ఉంటారు నేను పెద్ద వేట మీదే ఉన్నానయితే"




బాండ్ జాగ్రత్తగా కిందికి చూశాడు. గోల్డ్‌ఫింగర్ కేంద్రం భవనం— 'ఆరిక్ ఎంటర్‌ప్రైజెస్' కింద ఏమి జరుగుతోంది?
"[illegible]"

"ఆ పొగగొట్టం మీద దేమిటి? రాడార్ స్కానర్ లాగ ఉందే!"

ఇక కదిలితే మంచిదనుకున్నాడు బాండ్.
"మళ్లీ వస్తాలే.. పరిస్థితెలా ఉందో చూస్తే మంచిది."










బాండ్ జెనీవాకి వెళ్లిపోయాడు 'క్వే విల్సన్' వద్ద ఒక చిన్న ఆఫీసుకి వెళ్లాడు

'నేను యూనివర్సల్ ఎక్స్‌పోర్ట్స్ కంపెనీ నుంచి వచ్చాను కొన్నివిషయాలు మాట్లాడాలి..''

''ఓహో! 007 కదూ?''

''ఏమ్మేం చెయ్యమంటారు? తొరగా చెప్పండి నన్ను శత్రువులు పసి గట్టేశారు! మీ వెంట కూడా పడటం మీ కిష్టంలేదుగా ''

''ఈ బంగారు కడ్డీని లండన్ చేరవెయ్యండి. 'స్మెర్ష్' పెట్టుబడిదారు గోల్డ్‌ఫింగర్ దగ్గర్నుంచి కాజేశాను వివరాలన్నీ అక్కడే ఉన్నాయి ''

''ఆంత్ర ప్రిసెసెస్ ఆరిక్ ఏజీ ఇక్కడే నడుపుతాడు.. ఇంకా?''










బాండ్ సహ గూఢచారి గోల్డ్‌ఫింగర్ గురించి, ఆరిక్ కంపెనీ గురించి విన్నాడు

'వాళ్లని గురించి మీకేం తెలుసు? ఏంచేస్తా ఉంటారు?''

''రైల్వేలకీ, విమానాల కంపెనీలకీ ఉక్కు కుర్చీ బల్లల వంటివి చేస్తారు ''

''ఇండియాకి 'మెక్కా' అనే రవాణా పంపు ఒకదాని* కూడా ఓరిక్‌కి వాటా ఉంది ఇది అంతే అనుకుంటా ''

''ఇండియాయేనా? అది దొంగ బంగారానికి మంచి మార్కెట్టు!''

''దాన్నంత ఆ కార్లో తీసుకొస్తాడు. 'అది సిల్వర్ ఘోస్ట్ కాదు, గోల్డెన్ ఘోస్ట్! రెండు టన్నుల బరువు ..''










బాండ్ బెర్గ్యూ హోటల్లో చూశాడు. మిస్ టిల్లీసోమ్స్ జాడలేదు

''ఆ పేరున్న వారెవరూ లేరండీ..''

''ఏమిటి ఆమె ఉద్దేశం?..''

రాత్రి భోజనంచేస్తూ గోల్డ్‌ఫింగర్ దొంగ రవాణా గురించి ఆలోచించాడు

''ఒక్కొక్క ఇండియన్ రవాణాకీ రెండువందల పర్సెంట్ లాభం చేస్తూ ఉండి ఉంటాడు.''

''కాని శీఘ్రంగా అడ్డుపడాలి స్మెర్ష్‌కి ఈ డబ్బు పెట్టుబడి పెడుతూ ఉంటే ''

**(ఇంకా వుంది)**

“ఇన్నేళ్లు తాగనివాడి అంతవంత పెట్టుదలేమో. ఈ పెళ్లి పేరు స్నేహితులందరూ వస్తే అతనికి తృప్తిగా ఉంటుంది” చెప్తూనే అన్నాడు ప్రభాకర్

నా నిగ్రహానికి ఇదొక పరీక్ష కావచ్చు “సరే” అన్నాను

రాత్రి మళ్లీ సికిందరాబాదు క్లబ్బు కళకళ లాడింది మా మూలు ఫార్మాలిటీస్‌తో రెండుకొండ్లు విస్కీ సేవించిన తరువాత వాతావరణంలో హుషారు పెరిగింది నేను మాత్రం కాస్త దూరంగా కూర్చొని పరిశీలిస్తున్నాను

రమేశ్ లేచాడు అంటే ఏదో ఒక కొత్త సమస్య ఆరంభమవుతుందన్నమాట

“మనిషి బ్రతుకుతుంది ఎందుకు?” చాలా గంభీరంగా అడిగేశాడు

షరీఫ్ కళ్లద్దాల సందులోంచి చూసి “తాగ టానికే” అని గట్టిగా అరిచాడు

అంతా గొల్లుమన్నారు

రమేష్ అఫెండ్ కాలేదు తిన్నగా అతని దగ్గరికి వచ్చి కొత్త బాటిల్ ఓపెన్ చేసి సోడా అయినా కలపకుండా అలాగే గ్లాసు నింపేశాడు “సగం సగం అంటే అమెరికన్ ఫాషన్‌లో ఎత్తిన గ్లాసు దించకుండా తాగెయ్యాలి” అన్నాడు రమేష్

మిగిలిన మిత్రులు అతని వొళ్లో పట్టుకున్నారు షరీఫ్ అన్నమాట నిలబెట్టుకున్నాడు గది కరతాళ ధ్వనులతో ప్రతిధ్వనించింది

నా దృష్టి తెరుచుకుంటున్న తలుపు వేపు మరలింది అందరూ అటే చూశారు డాక్టర్ కె ఎస్ శర్మ నవ్వుతూ లోపలికి వచ్చారు మాలో సగంమంది ఆయన దగ్గర చదువుకున్న వాళ్లమే లేచి నిల్చున్నాం

ఆ పరిసరాల్లో వచ్చిన మార్పును చూసి సంకోచంగా లోపలికి వచ్చారు

‘అయితే శర్మగారు మన మీద ఏమన్నా థీసిస్ రాయబోతున్నారా?” షరీఫ్ గొణిగాడు

“ఈయన కాస్త పూనుకొని నాలుగు వారాలు పత్రికల్లో మద్యపానం గురించి వ్యాసాలు దంచాడంటే ఇక్కడ ప్రొహిబిషన్ వచ్చేస్తుంది” భయంతో వణికి పోయాడు ప్రభాకర్

“అయితే మీరంతా ఎందుకలా ఆగిపోయారు” సంకోచంగా అన్నారు డాక్టర్

“ఎన్నడూ ఇటు రాని మీరు ఇలా రావడం ఆశ్చర్యంగా ఉంది”

ఆశ్చర్యం ఎందుకు? ఇప్పుడే మీ ముందు నేనూ గ్లాసు తాగాననుకోండి అప్పుడేం చేస్తారు?”

ఆయన నోట ఆమాట వస్తుందని ఎవరూ ఊహించలేదు

“మేం తాగటం మానేస్తాం” అన్నాడు ప్రభాకర్

“కారణం?”

“మీరే తాగారంటే, తాగటం కూడా ఒక గొప్ప విషయమే అన్న అపోహ అందరికీ కలుగుతుంది దాంతో తాగేవాళ్ల సంఖ్య పెరిగిపోతుంది ఇక మేం ఎక్కడ కొనగలం!” బాగా తెప్ప తలకెక్కిన షరీఫ్ ఆమాట అనగానే అంతా గొల్లుమన్నారు

ఈ సారి నిజంగానే శర్మగారు చిన్నబుచ్చుకున్నారు

“అయితే నా అనవసరానికి అడ్డు రాను” చప్పున లేచి వెళ్లిపోయారు

నేనూ బయటికి వచ్చాను.

“ఆగండి”

నేను విన్న దాన్నిబట్టి నిజంగా ఆయన్లో ఇటువంటి మార్పు రావచ్చనుకున్నాను

‘డాక్టర్‌గారూ మీరు ఇక్కడికి వచ్చింది నిజంగా తాగాలనా?”

‘కాదు, తాగిన వాళ్లు ఎలా ప్రవర్తిస్తారో చూద్దామని”

చనిపోతానన్న విరక్తి శర్మగారిని ఇటు పంపిందా ఆయన మాటలు అబద్ధం అని ఖండించే శక్తి నాలో లేదు వెనకగా తిరిగివచ్చాను

లోపల కూర్చున్న జనం మళ్లీ శర్మగారిని తిట్టడం ప్రారంభించారు

“ఆయన ఎక్స్‌పరిమెంట్స్‌కి మనమే దొరికామా!” కసిగా గ్లాసు ఎత్తి గటగటా తాగేశాడు, షరీఫ్

“పానకంలో పుడక అంటే ఇదే మళ్లీ పార్టీ మూడ్‌లో పడాలంటే కనీసం రెండు గంటలయినా పడుతుంది అసలు పిడిలాంటి ప్యూరిటన్స్ మన పార్టీలో చేరబట్టే” వేలెత్తి నావేపు చూపిస్తూ అన్నాడు షరీఫ్

అసలు నువ్వెన్నిసార్లు రా తాగుడు మానేసేది?”

“నా ఇష్టం”

“అసలు నువ్వు తాగకపోతే ఆ డాక్టర్ లాగ వెళ్లిపో” చురుముని లేచాడు ప్రభాకర్

“సరే, వెళ్లిపోతాను”

పెళ్లికొడుకు ప్రసాద్ వచ్చి నా చెయ్యి పట్టుకున్నాడు “సంతోషంగా ఉండవలసిన చోట ఇలా ప్రవర్తించడం మంచిదికాదు గ్లాసులో కాస్త సోడా పోస్తాను కంపెనీ కీపప్ చెయ్యి”

నన్ను లాక్కెళ్లి గ్లాసు అందించాడు

మళ్లీ గది కరతాళ ధ్వనులతో దద్దరిల్లిపోయింది

సోడాతో నాలుక తడుపుకుందామనుకున్నాను అది సోడా కాదు జిన్ గుండె చురుమని మండి పోయింది

మళ్లీ కరతాళ ధ్వనులు, కేకలు వెర్రిగా వినిపించాయి నేను ఓడిపోయినందుకు సంతోషం

అంతే, ఇక నాకేసి ఎవరూ చూడలేదు వాళ్ల దారికి వచ్చినందుకు తృప్తి

“ఇవ్వాళ పార్టీ అంత తృప్తికరంగా సాగటంలేదు మనం మాంచి మూడ్‌లో పడాలంటే ఏంచెయ్యాలి” ఒక సమస్య

“గుల్నార్” ఒక గొంతు మాంచి శృతిలో వినిపించింది

వహ్వా వహ్వా !”

టైం చూసుకున్నాం అప్పటికే పన్నెండు అయింది ఒంటి గంట తరువాత చట్ట రీత్యా ఆ వీధిలో మగపురుగు ఉండటానికి వీల్లేదు

కొత్త పెళ్లికొడుకు ఉన్నాడనే విషయం ఆలోచించకుండా అంతా గుల్నార్ ఇంట్లో వాలిపోయాం సౌందర్యం, సంగీతం మమ్మల్ని మైమరపించింది

ఇంతలో గడియారం ఒంటి గంట కొట్టింది

గుల్నార్ అందరికీ “ఖుదా హాఫిజ్” అని వెళ్లి పోయింది

బైట వర్షం జోరుగా కురుస్తుంది ఒక్కొక్కరూ జారుకుంటున్నారు నెమ్మదిగా మేడ మెట్లు దిగి బయటకు వచ్చాను

రోడ్డంతా చీకటిగా ఉంది పక్క ఇంటి గుమ్మం దగ్గర నిల్చున్న వ్యక్తి నీడ మాత్రం కనిపించింది.

ఆ వ్యక్తి [illegible]

“వేళాపాళా లేనియటువంటి లాగింది సరిగ్గా ఒంటి గంటకి వచ్చాను.” [illegible] తలుపు మూసుకుంటూ [illegible]

మరోసారి జాగ్రత్తగా చూశాను వర్షం జోరు ఎక్కువ కాసాగింది గాలి వేగం మాత్రం కాస్త తగ్గింది

నేనెంత మత్తులో ఉన్నా గుమ్మం దగ్గర నిరాశగా నిల్చున్న వ్యక్తి డాక్టర్ కె. ఎస్ శర్మ కాదనడానికి నా మనసు ఒప్పుకోలేదు

వర్షం తాలూకు ప్రవాహం ఆ రోడ్డును శుభ్రం చేసినా అక్కడక్కడా నలిగి పడిఉన్న పూలు మాత్రం గాలికి రెపరెప లాడుతున్నాయి ●



# ❋ తాగుడు గురించి తాజా సమాచారం ❋

ప్రపంచ చరిత్రలో సురాపానం తెలియని సమాజాలు లేవంటారు. సారాయి వల్ల ఎంత ప్రమాదం ఉన్నా తాగుడు మాత్రం తగ్గటల్లేదు. కొందరు 'తాగుబోతు' లవటానికీ మరికొందరు ఉత్త 'పిసినా'లు కావటానికీ కారణం ఏమిటి? ఈ ప్రశ్నలకి సంబంధించి పరిశోధన జరుగుతోంది. మెదడు పనిచేసే విధానానికీ, వంశ పారంపర్యానికీ సంబంధం ఉందని శాస్త్రజ్ఞులు అంటున్నారు.

*  *  *

మీరు ఎస్కిమోలా? ఆస్ట్రేలియా దేశపు ఆదిమవాసులా? లేక 'టియెర్రా దెల్ ఫుయెగో' నుంచి వచ్చారా?— అవునవగలిగితే ఇక చదవటం ఆపండి! ఎందుకంటే "ప్రపంచ ఆరోగ్య సంస్థ" (ఐరాసలో ఒకభాగం) ప్రకారం సారాయం ఉన్న పానీయాలని తయారు చెయ్యటం, ఆ పానీయాలని తాగి ఆనందించటం చరిత్రలో లేని సమాజాలు పై మూడు మాత్రమేట! బియ్యం, బార్లీ, బంగాళా దుంప, రాక్షసి జెముడు చెట్టు, ద్రాక్ష, కొబ్బరి కల్లు—ఒకటేమిటి రకరకాల పదార్థాల నుంచి మద్యాన్ని తయారు చెయ్యటం మానవులకి అలవాటయి పోయింది.

అంటే, సారాయం (ఆల్కహాల్) మానవుడికి అత్యవసరమయిన వస్తువులలో ఒకటని అనుకోవచ్చునా? అనుకోవచ్చునేమో, కాని 'తాగుడు' ఏదో సరదా అని అతి చేసి ఇల్లు వళ్ళు గుల్ల చేసుకునే వారు అసంఖ్యాకులు. ఇది అందరికీ తెలిసిన విషయమే. పైన చెప్పిన "ప్రపంచ ఆరోగ్యసంస్థ" ప్రకారం సుమారు ఎనిమిది లక్షల ఫ్రెంచివారు రోజుకి మూడు నుంచి ఎనిమిది లీటర్ల ద్రాక్ష సారాయం తాగుతారుట. అమెరికాలో నూటికి ఆరు ఏడు మంది మద్య అపరిమిత సురాపానానికి లోనై వైద్య చికిత్సార్హులుగా మారుతున్నారుట.

## రుచి ఇష్టంలేదు కాని తాగుతారు

మనుష్యులు కేవలం రుచి కోసం మాత్రమే 'తాగరు'. కొన్ని యూరోపియన్ దేశాలలో కొన్ని చోట్ల అశుభ్రమయిన నీరు తాగటం ప్రమాదకరమని దిగుమతి అయిన 'వైన్' తాగేవారు ఆ అలవాటు ఇంకా పోలేదు. అమెరికాలో కొన్నివర్గాలలో తాగుడు నాగరకతకి చిహ్నం అనే భావం ఉంది. పత్రికలలో, టెలివిజన్‌లో, సినిమాలలో ప్రచారం అలా ఉంది మరి! తాగే విద్యార్థి, విద్యార్థినులని అడిగగా సగానికి పైగా 'రుచి' తమకి ఇష్టం లేదన్నారు. పెద్దవారు తాగుతూ ఉంటే చూసి గొప్ప కోసం అలవాటు చేసుకొనటమనా కద్దు.

అసలు 'సారాయం'మనకి, అంటే మానవదేహానికి ఏవిధంగా అవసరం? ఈ ప్రశ్నకి సమాధానం ఇంకా తెలీదు. సారాయం పుచ్చుకుంటే ఎందుకో గాని మనస్సుకు తృప్తి ఇస్తుందని మాత్రం అందరికీ తెలుసు (కనీసం చాలామందికి!) అంతేకాక, సారాయం ఉన్న పానీయాలు పుచ్చుకుంటే శరీరంలో కొంత శక్తి పుడుతుంది. ఇందుకోసం కూడా కొందరు తాగుతారు. కూలీపని చేసేవారూ, వగైరా. సారాయం లేకపోతే విపరీతంగా బాధపడ్తారు అలవాటు పడ్డవారు. (వైన్ తాగేవారు సాధారణంగా విషాలో ఉన్నా విగ్రహం కోల్పోరుట, విస్కీ మొదలయినవి తాగేవారు దినమూ 'తాగక' పోయినా తరచూ ఒళ్ళు మరచేటంతగా తాగుతారుట.)




## వంశ పారంపర్యం

కొందరు కొన్నిచుక్కలు పడగానే శృతి తప్పుతారు. మరికొందరు ఎంత తరచు తాగినా దాసులుకారు. ఎందుచేత? 'చిలీ' విశ్వవిద్యాలయంలో జరిగిన పరిశోధనలు, సురాపానం వంశ పారంపర్యం మీద ఆధారపడి ఉంటుందనే అనుమానాన్ని కలిగిస్తాయి. 'రంగు గుడ్డితనం' (కలర్ బ్లయిండ్‌నెస్), కాలేయానికి సంబంధించిన 'సిర్రోసిస్' జబ్బు వంశ పారంపర్యంగా వస్తాయి. ఇవి రెండూ తాగుడు వల్ల వచ్చే జబ్బులే. అందువల్ల కొన్నిరకాల దేహ లోపాలు ఉన్నవారు సారాయం పట్ల ప్రత్యేక గుణాలని ప్రదర్శిస్తారన్నమాట.

చిలీ శాస్త్రజ్ఞులు మరొక ఆందోళనకరమయిన అనుమానాన్ని వెలిబుచ్చుతున్నారు. సారాయం పట్ల అభిలాష ప్రదర్శించే గుణం కొన్నిప్రాంతాలలో ఎక్కువ అవుతోందిట. ఇది వంశపారంపర్యానికి సంబంధించిన విషయమే.

మెదడులో కొన్నిమార్పులు రావటంవల్ల సారాయం పట్ల కోరిక అధికం అవుతుందిట. మెదడులో శక్తి పుట్టించే ఏర్పాట్లు చెడిపోతే సారాయం పట్ల ఆసక్తి పెరుగుతుందని ఒకరకం జంతువుల మీద చేసిన పరిశోధనలు తెలుపుతున్నాయి.

సాధారణంగా మెదడులో, తక్కిన శరీరభాగాలలో పలెనే, చక్కెర, ప్రాణవాయువుల పరస్పర ప్రతిక్రియ మూలంగా శక్తి జనిస్తుంది. చక్కెర బదులు సారాయం వాడినా శక్తి జనిస్తుంది. అందువల్ల చక్కెర బదులు సారాయం వాడే ధోరణి ఏర్పడవచ్చు. ఈ ధోరణి అధికం అయితే శరీరంలో చక్కెర ప్రతిక్రియలు చెడిపోయి సారాయం కోసం విపరీతమయిన కోరిక కలగవచ్చు. ఇంకొక విధంగా చెప్పాలంటే, అసలే 'చక్కెర సమస్య'లు ఉన్నవారు సారాయం జోలికి వెళ్ళకపోవటం మంచిది! 'చక్కెర సమస్య' అంటే అతిమూత్ర వ్యాధికాదు. రక్తంలో చక్కెర తక్కువ ఉండే సమస్య.

## 'యూదులలో తాగుడుతక్కువ'

అతిమూత్ర వ్యాధి ఉండేవారి రక్తంలో చక్కెర అధికంగా ఉంటుంది ఇటువంటివారికి యీ 'తాగుడు' అలవాటు తక్కువగా ఉంటుంది యూదులలో ఈ వ్యాధి ఎక్కువ కాబట్టి అయి ఉండవచ్చు వారిలో 'తాగుడు' తక్కువ

తాగుడు లక్షణాలు ఇప్పుడు బాగా అవగతం అవుతున్నాయి వాటిలో 'సంధి' ఒకటి నిద్రలో కలలు రావటం ఆరోగ్యానికి మంచిది తాగడం వల్ల మెగుడు మత్తు ఎక్కి కలలు కరలేక చివరికి మెలకువ లోనే 'కలలు' వస్తాయి! ఇదే 'సంధి' అందుకనే 'సంధి'కి వైద్యం చేసేప్పుడు దేహానికి కలిగిన అవసరం ఏమిటో తెలుసుకోవాలి

'తాగుడు' వ్యాధిని కుదర్చటం తేలికకాదు అసలు జరిగే పనే కాదంటారు కొందరు అందుకనే కొన్ని




సూత్రాలని ఇస్తాను వాటిని పాటించే వారు పాటించవచ్చు

1 'అవసరం' అని ఎప్పుడూ మద్యం పుచ్చుకో రాదు

2 ఒక 'డ్రింక్'కీ తరువాతి దానికి మధ్య అర గంటయినా ఉండాలి రెండు పైన పుచ్చుకున్నప్పుడు రెండూ, మూడుల మధ్య గంట ఉండటం మంచిది. మూడవ దానిని అసలు తీసుకొనకపోవటం అంతకన్నా మంచిది!

3 ఎంత నీరు పోసి తాగితే అంత మంచిది

4 పరగడుపున తాగరాదు

6 భోజనం ముందు, ఇంటికి వెడుతూ వెడుతూ, ఎవరినైనా కలవాలసి చ్చినప్పుడు ఒక 'గుటక' వెయ్యటం అలవాటు చేసుకోకండి!

6 బాగా అలిసిపోతే వేడినీటి స్నానం తర్వాత చన్నీటి స్నానం మంచిది

7 బాధానివారణ కోసం తాగటం మంచిది కాదు!

— జాన్ న్యుయెల్

సీరియల్

# జాహ్నవి హైమవతులు

సి. ఆనందారామం

## జరిగిన కథ

ఉమాపతికి ఇద్దరు భార్యలు హైమవతీ జాహ్నవి ఇద్దరూ అక్కచెల్లెళ్ళే. సహనం, సానుభూతి హైమవతికి ఆభరణాలయితే, ద్వేషం, అసూయ జాహ్నవి సొత్తు. జాహ్నవికి అపకరంగా జన్మించింది నీరజ. శ్రీరామచంద్రమూర్తి, మనోరమా ఇద్దరూ హైమవతి సంతానం. శ్రీరామచంద్రమూర్తి మెడిసిన్‌లో చేరాడు. ఆడపిల్లలిద్దరూ కాలేజీలో చదువుతున్నారు. గోపాల్‌ను కలుసుకునే మిషమీద రాజా మనోరమను చూడ్డానికి తరచువస్తున్నాడు.

## 5

నీరజకు సంబంధాలు చూసి చూసి ప్రాణం విసిగిపోతూంది ఉమాపతికి.

'ఏం చెయ్యమంటావు హైమా! ఏదీ కుదరటం లేదు' దిగాలుగా అన్నాడు. హైమ ఉస్సురంది.

"పోనీ ఇంకా కట్నం ఎక్కువ ఇస్తామని చెప్పండి."

"ఇప్పటికే యాభై వేలిస్తామని చెప్తున్నాను ఇంకా ఎక్కడ తేను? మనో సంగతేమిటి?"

"ముందు నీరజకు కానియ్యండి. మనో సంగతాలోచిద్దాం. మనోను రాధాయమ్మ కోడలిగా చేసుకుంటా నంటున్నారు గదా!"

"అయితే?! కట్నం ఇచ్చుకోనక్కర్లేదా? రాధాయమ్మ అడిగినా అడగకపోయినా, మన మర్యాద మనం దక్కించుకోవద్దా?"

దీర్ఘంగా నిట్టూర్చింది హైమ.

"ఇంకో పదివేలు ఎక్కువ ఇస్తాననండి. ఏదైనా కుదురుతుందేమో?"

ఉమాపతి ప్రయత్నాలు సాగించగా సాగించగా అరవై అయిదు వేల కట్నంతో ఒక సంబంధం కుదిరింది. తగు మాత్రం ఆస్తి ఉంది. బి. యస్‌సి. చదువుతున్నాడు. కానీ నల్లగా ఉంటాడు.

"ఊహూ? ఆ కాకి లాంటి వాడికి నీరజను కట్టబెట్టద్దు" అంది జాహ్నవి.

ఉమాపతికి వళ్ళుమాలిన కోపమొచ్చింది.

"ఎంతో ప్రయత్నం మీద ఈ సంబంధం కుదిరింది. ఇక నా వల్లకాదు. పెళ్ళికొడుకు నల్లగా ఉన్నాడని తోసి పారెయ్యడానికి నీ కూతురు అప్సరసా?"

"అదీ సంగతి! నీరజ 'నా' కూతురు మన కూతురు కాదు. అందుకే మీకీ నిర్లక్ష్యం. 'మీ' కూతురు మనోరమనయితే, ఇలా అనాకారి కిచ్చి ముడి పెట్టేవారా?"

"మనోరమతో సంతేమిటే?"

"అవును. మనోరమెక్కడ? నీరజెక్కడ? నీరజకు మనోరమతో పంతేమిటే? అదే కదూ!"

"నేనలా అనలేదు. నువ్వు పెడర్థాలు తీస్తున్నావు."

"సరే! ఇదే సంబంధం మనోరమకు నిశ్చయం చెయ్యగలరా?"

చికాగ్గా చూశాడు జాహ్నవిని.

"నీకు మతిపోయింది."

"అవును ఇప్పుడు కాదు. పదిహేడేళ్ళ క్రిందట ఆ పోయిన మతి ఆలస్యంగా మళ్ళీ వచ్చింది. కానీ ప్రయోజనంలేదు."

నిస్తాపోయి జాహ్నవిని చూస్తూ కూర్చున్నాడు ఉమాపతి.

వూరుకుని వూరుకుని "ఇంత నువ్వు సుఖపడలేవా? శాంతిగా ఉండలేవా?" అనడిగాడు.

ఉమాపతి నోట ఈ ప్రశ్న విని జాహ్నవి ఆశ్చర్యపోయింది.

"సుఖంగా ఉండగలను. నీరజకు అనుకూలమైన సంబంధం దొరికినప్పుడు—నా శాంతి నీరజ సుఖంలో!"

"నువ్వర్థం చేసుకోవటంలేదు. నీరజ సుఖం నాకూ కావాలి. అందుకే ఇన్ని ప్రయత్నాలు. మనకి ఒక్కటే భేదం. మనో నీకేమీ కాదు. కానీ, మనో కూడా నాకు కూతురు."

"గారాల కూతురు. నీరజ విధిలేక కన్నకూతురు. రూపుదాల్చిన మన దురదృష్టం. దాన్ని వదిలించుకోవటానికి ప్రయత్నాలు మీవి."

"నన్నిలా హింసించకు జాహ్నవీ!"

"నేనా హింసిస్తున్నది? నాకు మొగపిల్లలు లేరు. వాళ్ళకు చదువుల బాధ మీకు లేదు. ఒక్క కూతురు. దానికి మంచి సంబంధం తేలేరా?"

"ఛీ, నా భేదం తెస్తావెందుకూ? ముగ్గురూ మన పిల్లలు. ఎవరి కెలా చెయ్యాలో అలా చేస్తాం."

"అలా చెయ్యటంలేదు. చెయ్యదలచుకుంటే, నీరజ కిలాంటి సంబంధం కుదర్చరు."

"తిరిగి తిరిగి వేసారిపోయాను. ఈ సంబంధం నీకక్కర్లేకపోతే, ఇక నీరజ అలా ఉండిపోవల్సిందే!" విసుగ్గా అన్నాడు.

"ఉంటుంది. దాని వెనక మనోరమా ఉంటుంది." క్రూరంగా నవ్వింది జాహ్నవి. ఉలికిపడ్డాడు.

"మనోరమ విషయం తేగానే ఆ ఉలికిపాటు దేనికి?" విషపు నవ్వుతో ప్రశ్నించింది జాహ్నవి.

ఉమాపతికి తల పగిలిపోతోంది. జాహ్నవికి నచ్చచెప్పటానికి ప్రయత్నించి లాభం లేదనిపించింది. అంతకంటె నీరజకే నచ్చచెప్పి నీరజతోనే తల్లికి చెప్పిస్తే నయం. నీరజ తన నర్థం చేసుకుంటుంది.

ఎన్నడూ లేనిది తండ్రి తన దగ్గిరకు రావటంతో గౌరవంతో లేచి నించుంది నీరజ.

"కూర్చో నీరజమ్మా! నీతో మాట్లాడాలి" అన్నాడు ఉమాపతి తడబడుతూ. తీరా మాట్లాడబోయేసరికి, అతని కేం మాట్లాడాలో తెలియటం లేదు. ఈ కార్యభారం హైమ మీద పెట్టే బాగుండేదనుకున్నాడు. కానీ హైమ మనసు మరీ మెత్తన. జాహ్నవి కిష్టంలేదని తెలిసి తనూ వద్దంటే?

"చూడమ్మా! నీకు ఎన్నో సంబంధాలు చూసాను" ఆగిపోయాడు ఉమాపతి. పాపం, పసిపిల్లను హింసిస్తున్నానా అనిపించింది. మాటల కోసం వెతుక్కోసాగాడు.

తల్లి కూడ తన దగ్గిర పెళ్ళి విషయాలు మాట్లాడదు. అట్లాంటిది తండ్రి తన దగ్గిర ఈ విషయం ప్రస్తావించేసరికి నిస్తాపోయి చూసింది నీరజ. నీరజ చూపులు మరింత తడబాటు కలిగించాయి, ఉమాపతికి.

"నీ కొక సంబంధం కుదిరిందమ్మా! అంతా బాగుంది కానీ, పెళ్ళికొడుకు నల్లగా ఉంటాడు. అందుకు మీ అమ్మ ఒద్దంటుంది. నువ్వు బాగా ఆలోచించుకుని నీ కభ్యంతరం లేకపోతే, మీ అమ్మకు నచ్చచెప్పు."

అంతకంటె చెప్పలేకపోయాడు ఉమాపతి. ఏదో అపరాధం చేసిన వాడిలా గబగబ వెళ్ళిపోయాడు.

కానీ, అంతలోనే నీరజ కర్థమయిపోయింది. పాపం, తండ్రి తనతో స్వయంగా ఈ విషయం ప్రస్తావించాడంటే, ఇది ఎంత విషమ సమస్యో, ఈ వివాహం నిశ్చయం కావటం తండ్రి కెంత వాంఛనీయమో, స్పష్టంగా తెలుస్తోంది.

ఓ— రాజా!

రాజా తనక గగన కుసుమమా?

అనాడు సినిమాలో ప్రతి లిప్తా తన కలలలో అమృతాన్ని నింపిన అతని సాన్నిధ్యం?

ప్రత్యేకం ఎదురయి ఆప్యాయతా ప్రదర్శించే చిరునవ్వుల పలకరింపులా?

తమ వనం తోటలో గంటలకు గంటలను క్షణాల్లా దొర్లించేసే అర్థంలేని అందమైన కబుర్లా, వీటికి విలువ లేదా?

అది తెలుసుకోవాలి

వెంటనే తెలుసుకోవాలి

వ్యవధానం లేదు.

"మనో! ఇవాళ తోటకు నువ్వు రావద్దు" ఉగ్గబట్టుకుని అంది

"ఎందుకు?"

"పరీక్షల దగ్గిర పడటంలా?"

"నీకు మాత్రం?"

"అబ్బబ్బ! చెప్పినట్టు విను. ఇవాళొక్కరోజుకి నువ్వు రాకు."

"అయితే నువ్వూ మానెయ్యి."

"సరే! నే మానేస్తాను. నువ్వెళ్ళు" కోపంగా అంది.

"ఊహూ! నువ్వెళితే వెళతాను. నువ్వు మానేస్తే నే మానేస్తాను."

"నే చస్తే?" కోపంగా కసిగా అంది.

"నేనూ చస్తాను" టక్కున సమాధానం చెప్పి పకపక నవ్వింది మనోరమ.

నీరజ కోపం మెగిరిపోయింది. ఇంతకంటె స్పష్టంగా మనోరమకు ఎలా చెప్పాలి? లాభంలేదు. ఏదైనా మార్గం మాలోచించుకోవాలి.

* * *

తన అదృష్టాన్ని తను నమ్మలేకపోయాడు రాజా! మనోరమ! నిస్సంశయంగా మనోరమే! తన ఇంట్లో! అందులోనూ నీరజ లేకుండ ఒంటరిగా!

రాజా ఇల్లు కూడ పెద్దదే! సాధారణంగా అంత వాళ్ళ గదుల్లోకి రాడు. కానీ, ఆరోజు చెల్లెలు పుట్టిన రోజు కావటం వల్ల చెల్లెలికి తను కొన్న రిస్టువాచ్ ఇద్దామని వచ్చాడు.

"మనో!" అప్రయత్నంగా వచ్చేసింది రాజా నోటి నుండి.

మనోరమ ఆశ్చర్యంగా చూసింది.

"సారీ! మనోరమా! ఎంతదృష్టం? ఇవాళ మా ఇల్లు పవిత్రమయింది."

మనోరమ తెలతెల పోతూ చూసింది. పాపం, నీరజే అందరికీ సమాధానాలు చెప్పేది. నీరజ వెనుక ఒదిగి పోతూ ఉండేది మనోరమ.

"నేను..ఇవాళ..నళిని.."

మాటలు పెగలటం లేదు మనోరమకు. శరీరం ఆపాదమస్తకమూ వణకటం స్పష్టంగా కనిపించింది రాజాకు. ఆ ముగ్ధత్వం మనోరమ సహజ సౌందర్యానికి మరొక ప్రత్యేకాకర్షణగా అనిపించింది రాజాకు!

"నీరజమ్మ కివాళ జ్వరంగా ఉందన్నయ్యా! ఈ పాపాయిగారు 'నీరజక్క రాకపోతేరాన'ని కూర్చున్నారు. నేనెళ్ళి తీసుకొచ్చా నీమెను."

"చాలా మంచి పని చేసావు. నీకేం కావాలో అడుగు తెచ్చిస్తాను."

"నిజంగానా?"

"ఆ! నిజంగా!!"

"నాకు వదిన కావాలి"

చెల్లెలి గడుసుతనం గమనించి రాజా చిరునవ్వు నవ్వుకున్నాడు

"అది నేను నీ కియ్యటం కాదు నువ్వే నాకివ్వాలి కావాలంటే. మా బావగారిని రమ్మని వైరిస్తాను"

"ఛీ! పో!" బుంగమూతి పెట్టింది నళిని

మనోరమ గాభరాగా ఇద్దరినీ చూస్తోంది

"నిలబడిపోయా రేమిటి? కూర్చోండి" బొమ్మలా కూర్చుంది మనోరమ

ఫలహారం తెస్తానంటూ మాయమయింది నళిని మనోరమకూడా లేచింది లోపలికి వెళ్ళడానికి అది గమనించి "కూర్చోండి" అన్నాడు చిరునవ్వుతో రాజా

సోఫాలో ఒదిగిపోతూ కూర్చుంది మనోరమ వణుకుతున్న చేతుల నొకదానితో ఒకటి బంధించుకొని కళ్ళు వాల్చుకుని చూపుల నేల పైపాదికు మరల్చుకుంది

"నీరజమ్మకు జ్వరమా?"

"అవును నిన్నటి నుంచీ! పాపం, అక్క తానూ వస్తానంది అమ్మ వెళ్ళనియ్యలేదు."

"మంచి పని చేసారు."

"అదేం?"

"జ్వరంలో ఉన్నవాళ్ళు విశ్రాంతి తీసుకో వద్దూ?"

"కానీ, మీరు నళినికి అన్నగారా? ఈ సంగతి నాకూ అక్కయ్యకూ తెలియదు తెలిస్తే అక్కయ్య ఎంత జ్వరంగా ఉన్నా వచ్చేది"

రాజా పెదవులపై చిరునవ్వు విరిసింది.

"తెలిస్తే రావటమేమిటి?"

"ఎందుకురాదూ? మీ రిక్కడుంటున్నారని తెలిస్తే రాదా?"



అతని ముఖంలోకి చూస్తూ ఎదురు ప్రశ్న వేసింది

"నీరజమ్మ పంగతలా ఉంచండి మీరు మీకు తెలిస్తే వచ్చేవారా?"

"అక్కయ్య వస్తే నేనెందుకు రాను?"

"నీరజమ్మ రాకపోయినా"

"ఎందుకు నేను?"

"నా కోసం" సాహసించి అనేసాడు రాజా

మనోరమ కళ్ళు విప్పార్చుకుని చూసింది

"నా కోసం దేనికి?"

"మీరే నా జీవితం గనుక!"

మనోరమ కర్థమయింది చటుక్కున కళ్ళు వాల్చేసుకుంది గుండె దడదడ కొట్టుకుంది అతని ఎదుట కూర్చోలేక చటుక్కున లేవబోయి, తూలింది ఒక్క అంగలో రాజా లేచొచ్చి, ఆమెను తూలకుండా పొదివి పట్టుకున్నాడు అప్రయత్నంగా అతని గుండెల మీద వాలిపోయింది మనోరమ

అతని చేతులామెను మృదువుగా చుట్టేసాయి శిరసు మంచి ఆమె చెవి దగ్గర గుస గుసగా "నువ్వు నాదానివి మనో! ఇప్పుడూ, ఎప్పుడూ ఇలా నా గుండెలో ఇమిడి పోవాలి నువ్వు" అన్నాడు

మనోరమ కేమీ తెలియటంలేదు లజ్జాభారంతో ముఖాన్ని చేతులలో దాచుకుంది

"ఏం, చెప్పవూ? నువ్వు నా దానివే కదూ!"

"అక్కయ్య నడిగి చెప్తాను." చివుక్కుమంది రాజాకు మనోరమను వదిలేశాడు

"ఊహూ! అక్కయ్య నడిగికాదు నువ్వే ఆలోచించుకుని చెప్పు తొందరలేదు స్థిమితంగా ఆలోచించుకు చెప్పు"

పులుకు పులుకున రాజాను చూస్తూ ఊరుకొంది మనోరమ

నీరజను అడగొద్దన్నందుకు మనోరమకు కష్టం తోచిందని అర్థం చేసుకున్నాడు రాజా

"మనో! ఏ పరిస్థితుల్లోనూ ఈ విషయం నీరజకు చెప్పనని మాటియ్యి"

తెల్లబోతూ చూసింది మనోరమ

"ప్లీజ్! నాకలా వాగ్దానం ఇయ్యవూ?" చెయ్యి జాపాడు అప్రయత్నంగా ఆ చేతిలో చెయ్యి వేసింది మనోరమ

అప్పటివరకూ కావాలనే లోపలుండి పోయిన నళిని నవ్వుకొంటూ అమాయకత్వం నటిస్తూ వచ్చింది

వెనకనే దాసీది ఫలహారాలు తెచ్చింది సిగ్గుతో వంచిన తల ఎత్తలేకపోయింది మనోరమ నళిని ఆప్యాయంగా మనోరమ భుజం చుట్టూ చెయ్యేసి "నేనెంతో పుణ్యం చేసుకున్నాను అందుకే ఇవాళ మీరు మా ఇంటి కొచ్చారు"–అంది

కొన్నిక్షణాలలో మనోరమకు ఎంతో ఎదిగి పోయి నట్లనిపించింది నళిని మాటలు అర్థమయ్యాయి. మరింత ముకుళించుకుపోయింది

అంతవరకూ ఒక పండితురాలి దగ్గిర పురాణం వింటున్న తల్లి అక్కడకు రావటంతో రాజా అక్కడి నుండి వెళ్ళిపోయాడు

మనోరమను తమ కారులో ష్వయంగా ఇంటి దగ్గిర దింపింది నళిని ఇల్లు చేరుకున్న మనోరమకు లోకమంతా కొత్తగా కనిపించింది ఇంకా ఎవరిదో స్పర్శ శరీర మనుభవిస్తున్నట్లే ఉంది చెవుల్లో ఎవరో గుస గుసగా ఏమిటో చెప్తున్నారు

ఎప్పుడూ పక్క మీద వాలగానే నిద్రపోయే

# జాహ్నవీ హైమవతులు

మనోరమకు ఎంత సేపటికీ నిద్ర రాలేదు బయటి కొచ్చి పైని వెలుగుతూన్న చంద్రుణ్ణి చూస్తూ కూర్చుంది

ఆలోచించుకుని చెప్పమన్నారు ఆలోచించటాని కేముంది? ఆయనే చెప్పారుగా "నువ్వు నాదాని"వని!

చిరునవ్వుతో ముఖం వెలిగిపోతుండగా, మస్తిష్కంలో దోబూచులాడుతూ మనసును గిలిగింతలు పెట్టే ఆలోచనలతో పక్క మీద వాలిపోయింది మనోరమ

* * *

ఉమాపతి వనసతోటలో ఇంచుమించు రోజూ రాజాతో మనోరమా నీరజలు కబుర్లు చెప్పుకోవటం అలవాటై పోయింది ఈ సమావేశాల గురించి వారికి తెలుసు తెలీనట్లుండాలనీ తెలుసు

ఒక్కడే తోటలో కూర్చుని నీరజా మనోరమల రాక కోసం ఎదురు చూస్తున్నాడు రాజా! ఒక్కత్తే నడిచి వస్తున్న మనోరమను చూసిన అతని మనసు పున్నమినాటి సముద్రమైంది మనోరమ దగ్గిరగా వచ్చింది

"కూచోండి" అన్నాడు

"కాదు కూచోను మీకు ఉత్తరం"

చేతిలోని కాగితం మడత అతని చేతుల్లో పడేసి పరుగెడుతున్నట్లుగా వెళ్ళిపోయింది మనోరమ వెళ్ళిపోతున్న మనోరమను చెయ్యి పట్టుకుని తన గుండెల మీదకు లాక్కోవాలనిపించింది రాజాకు మనోరమ కంటికి కనుపించేటంతవరకూ ఆమెను చూస్తూ కూర్చుని తరువాత ఉత్తరం విప్పాడు ఆతృతగా

"ప్రభూ!

రాజా శరీరం పులకించింది ఆ ఉత్తరం అలాగే గుండెలకు హత్తుకున్నాడు అయితే మనోరమ తనను ప్రభువుగా అంగీకరించిందన్న మాట

త్వరలో పెద్దల అనుమతితో ఆమెను తన దేవిగా చేసుకోవాలి

"ఆనాడు వర్షంలో తడుస్తుండగా మిమ్మల్ని మొదటిసారి కనుపించినప్పుడు నేను జ్ఞానం వచ్చి



నప్పటి నుండి కన్న కలలన్నీ ఆకారం దాల్చి నా ఎదుట నిలిచి నట్లయింది"

అంటే, మనోరమకు కూడా మొదటి నుండే తన పట్ల మమకారం ఉందన్న మాట! ఆశ్చర్యం! ఏనాడూ కనీసం హావభావాలలోనైనా బయట పడలేదు

"ఆయాచితంగా ఆపన్నులకు సహకరించే మీ కరుణాంతరంగం మీ ఆకృతికి మరింత వర్చస్సు నిచ్చింది ఆనాడే నా హృదయంలో మీరు స్థిరపడి పోయారు"

నోరు పెగిలి మాట రాని మనోరమ కెన్ని మాటలు?

"ఏ విధంగానూ మీ దానిని కావటానికి అర్హురాలిని కాను తిక్కన వర్ణించినట్లు "ఉపలాలితుండయిన డింభకుండు తన కొలది ఎరుంగక" నేడినట్లు మీ దాసిని కావాలనే కోరికతో తపస్సు చేస్తున్నాను"

ఎంతటి వినయం మనోరమా!!

"సాహసించి ఈ ఉత్తరం ద్వారా నా మనసు తెలుపుకుంటున్నందుకు మీరే విధంగా భావిస్తారో? మీరంగీకరించకపోతే, నాకిక జీవితమేలేదు మా తండ్రి గారు నా వివాహం స్థిరపరచాలని గట్టి ప్రయత్నం చేస్తుండటం వల్ల లజ్జ నణచి ఈ ఉత్తరం రాస్తున్నాను దయతో మీరు పంపే సమాధానం కోసం ఆతృతతో ఎదురు చూస్తుంటాను నా భవిష్య జ్జీవితానందాన్నంతా పణంగా పెట్టి ఈ లేఖను మీకు పంపుకుంటున్నాను జయాపజయాలు మీ సమాధానం నిర్ణయించాలి

మీ

పాదదాసి కావటం కొరకు పరితపించే

నీరజ.

నీరజ!! నీరజా!, ఈ ఉత్తరం వ్రాసింది!!

రాజాకు తల గిర్రున తిరగి పోయింది ఉత్తరం చేతులలో వణికిపోతూంది శక్తంతా ఉడిగిపోయిన వాడులా చెట్టుకు జార్లగిల బడ్డాడు

ఈ ఉత్తరం మనోరమ తెచ్చింది

మనోరమకు తెలుసా? తెలియదా?

తెలియకుండా ఎలా ఉంటుంది?

తెలిస్తే ఎందుకు తెస్తుంది?

తెలిసే అక్క కోసం తను త్యాగం చెయ్యాలను కుందా?

ముఖంలో ఏ కోశానా విచారం లేదే?

అసలు మనోరమకు తన మీద ప్రేమ లేదా?

మరి నిన్న తన స్పర్శలో అంతగా పరవశించిందే! ఆమె ముఖం సంతోషంతో వెలిగిపోయిందే!

ఆలోచించి సమాధానం చెప్పమన్నాను

ఇదే మనోరమ సమాధానమా?

నీరజకు నాపై ప్రేమ ఉన్నదని తెలిసాక మనోరమ నన్నంగీకరిస్తుందా?

మనోరమకు కూడా నాపై ప్రేమ ఉందని నీరజ అర్థం చేసుకోగలిగితే, తన అభిప్రాయాన్నణగ ద్రొక్కుకుంటుందా?

ఏం చెయ్యాలి?

ఎలా అర్థం చేసుకోవాలి?

ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. రాజా— నీరజకు సమాధానం వ్రాసాడు

"నీరజ గారూ!

మీకు సమాధానం వ్రాయటానికి నాకు ముఖం చెల్లటంలేదు. అలాగని మీ లేఖని నిర్లక్ష్యం చేసి

కావం వహించి అగౌరవపరచలేను.

"మీ పట్ల నాకెంతో గౌరవముంది. మీ తెలివి తేటలు, చురుకుదనం, ఆత్మవిశ్వాసం విశాల హృదయం వీటి పట్ల నాకు చాలా గౌరవం— మీవంటి వ్యక్తులు నూటి కొక్కరు కూడా ఉండరు. అది నాకు తెలుసు.

"కానీ, నన్ను క్షమించండి. నేను మీ చెల్లెలు మనోరమను ప్రేమించాను. ఈ విషయం మీ మనసు కెంతటి అఘాతాన్ని కలిగిస్తుందో చక్కగా తెలిసీ నా నోటితో చెప్పవలసి వచ్చింది.

కర్తవ్యం మీరే నిర్ణయించండి.

మీ నిర్ణయం పట్ల నాకు చాలా గౌరవం.

సెలవు,

రాజా...."

ఈ ఉత్తరం గోపాల్ కిచ్చి నీరజ కందజేయమని చెప్పాడు.

గోపాల్ సహజంగా భయస్థుడు. పైగా ఒకరి ఆశ్రయంలో ఉంటున్నాడు. తను ఉత్తర మియ్యటం ఎవ్వరికైనా తెలిస్తే ఏం మునుగుతుందో నని భయపడి పోయాడు దాసీదాని కొడుకు పదేళ్ళ వాడికిచ్చి నీరజమ్మ కియ్యమన్నాడు "నీరజమ్మకే ఇయ్యి. ఇంకెవరికీ ఇయ్యొద్దు." అని హెచ్చరించాడు కూడా.

వాడా ఉత్తరం తీసుకుని లోపలి కొచ్చి "నీర జమ్మ" అని పిలిచాడు. మంచం మీద పడుకొని ఉన్న జాహ్నవి "ఎందుకు?" అని అడిగింది.

"ఉత్తర మియ్యటానికి."

"ఎవరియ్యమన్నారు?"

"గోపాల్ బాబు."

జాహ్నవి అదిరిపడింది. గోపాల్ నీరజ కుత్తరమా? కొంపదీసి నీరజ ఆ దిక్కూమొక్కూలేని అనాథ యువకుణ్ణి ప్రేమించటంలేదు గదా!

"ఏదీ, ఆ ఉత్తరం ఇలా ఇయ్యి." గర్జించింది.

"నీరజమ్మకే ఇయ్యమన్నారు గోపాల్ బాబు."

"ఇస్తావ? లేదా?"

హుంకరించింది జాహ్నవి. వాడు హడిలిపోయి ఉత్తరం జాహ్నవి దగ్గిర పారేసి పరుగెట్టాడు.

జాహ్నవి ఉత్తరం విప్పి చదివింది.

నీరజ ప్రేమించింది గోపాల్‌ను కాదనే విషయం తెలిసాక చాలా వరకు స్థిమిత పడింది.

రాజా జాహ్నవికి తెలుసు. అన్నివిధాలా కోరుకో దగ్గ సంబంధం. కానీ, రాజా కిష్టంలేదు. కారణం మనోరమ!

తన బ్రతుకు సర్వనాశనమయింది. తన ఒక్కాగా నొక్క కూతురి బ్రతుకూ సర్వనాశనం కాబోతుంది. వీల్లేదు. అలా జరగటానికి వీల్లేదు. తన కూతురు భంగపడటానికి వీల్లేదు.

నీరజకు రాజా భర్త కావాలి.

తన కూతురు కలకాలం కోరిన భర్తతో సుఖంగా ఉండాలి.

మనోరమ ఏమయిపోయినా తన కక్కర్లేదు. మిగిలిన ప్రపంచంతో తన కసలు నిమిత్తంలేదు. ఈ ప్రయత్నంలో నైతిక విలువలు ఏ గంగలో కలిసిపోయినా తనకు బాధలేదు.

ఆ దేవుడనే వాడు తన బ్రతుకు మొత్తాన్ని బూడిద చేసాడు. ఆ దేవుడితో, ఆ ధర్మంతో తనకు నిమిత్త మేమిటి? (సశేషం)



వైజ్ఞానిక గాథావళి-93

# భారతదేశంలో వైజ్ఞానిక పరిశోధనలా?

-జగదీశబంధుడు-

"భారతీయులు విజ్ఞాన శాస్త్రానికి పూర్తిగా అపరిచితులు. వేదాంతమూ, భాషా శాస్త్రమూ అయితే, సంస్కృత విజ్ఞాన బలమువల్ల వారు ప్రవీణులై బోధింప గలుగుతారు. భౌతికశాస్త్రములో ఇంతవరకూ భారతీయుడెవరూ ప్రజ్ఞ సంపాదించలేదు. ఈ జె. సి. బోసును భౌతిక శాస్త్రాచార్యుడిగా ఈ (రాజధాని) కళాశాలలో నియమించడం వల్ల ఆ విజ్ఞాన శాఖకి అన్యాయమే జరుగు తుంది" అని పై అధికారులకు వ్రాశాడు 1883లో కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజి ప్రిన్సిపాలు. ఇలాటి నమ్మకము ఉండబట్టే, "విద్యుత్ప్రసారము గోడల లోంచి మేడలలోంచి చొచ్చుకు పోతుంది" అని ప్రయోగముల ద్వారా జగదీశచంద్రుడు 1897 లో నిరూపించిన తర్వాత, లండను "స్పెక్టేటరు పత్రిక" నూటికి నూరుపాళ్ళు వంగదేశీయుడు ప్రసిద్ధ ఐరోపీయ వైజ్ఞానికుల సమక్షములో తన వైజ్ఞానిక పరిశోధనలనువివరించి అక్కడి పరచినాడు"అని వ్రాసింది, లండను టైమ్సు "ఆచార్య బోసు తన బోధనా కార్యక్రమము నిర్వర్తిస్తూనే, సాధన యంత్రాలు నిర్మించుకుంటూ పరిశోధనలు చేశాడు." అని రాసింది. లండను విశ్వవిద్యాలయపు వైస్‌ఛాన్సలరు సర్ హెన్రీ రోస్కో "ప్రాచ్య మేధ పతిచీ వైజ్ఞానికుల మేధాసంపత్తితో సమముగా తూగి పరిశోధనలు సాగించగలదు." అన్న సత్యమూ, బొంబాయి గవర్నరుగా నుండిన రీయా ప్రభువు "విజ్ఞానము ఏ ఒక్కదేశానికీ హక్కైనది కాదు. జగదీశ చంద్రుడు అంతర్జాతీయ వైజ్ఞానిక సంఘము లోనివాడు సందేహము లేదు" అన్న సత్యమూ కనుక్కుని ప్రకటించారు.

జగదీశ చంద్రబోసు చేసిన వైజ్ఞానిక పరిశోధనల ఔన్నత్యమూ ప్రాధాన్యమూ-కంటె ప్రాచ్య వైజ్ఞానికుడు— విశేషించి వేదాంతుల కులానికి చెందిన భారతీయుడు—పాశ్చాత్య వైజ్ఞానికుల వలెనే ప్రయోగ కౌశల్యమూ వైజ్ఞానిక వాద ప్రావీణ్యమూ ప్రదర్శించగలగడము వింత అయిపోయింది. లండను విశ్వవిద్యాలయము ఆయనకు పరీక్షతో పని లేకుండానే డాక్టరేటు డిగ్రీ ఇచ్చింది, కారన్టా అన్న ఫ్రెంచి వైజ్ఞానిక పరిషదధ్యక్షుడూ కెల్విను ప్రభువూ చాలా చాలా అభినందించారూ, ఫ్రాన్సుకూ జర్మనీకూ వైజ్ఞానికోపన్యాసాల కోసం ఆహ్వానాలు వచ్చాయి. కొమ్ములు తిరిగిన వైజ్ఞానికులు లిప్‌మన్, హైలెబెడ్, క్వింకే వార్ బర్గ్, ఈబర్ట్, లెనార్డ్‌లు బోసునుకలుసుకుని అభినందించారు.

జగదీశ చంద్రుడు అందరు పరిశోధకులవలెనే తననాటి వైజ్ఞానిక సమస్య నొకదానిని— విద్యుత్ప్రసారము కోసము మెరుపు వెలుగులు సక్రమంగ వచ్చే సాధన నిర్మాణమును— ఎంచుకున్నాడూ, బ్రాన్లే అనే పరిశోధకుడు నిర్మించిన కొహీరరును లోహపు కణాలకు బదులు స్ప్రింగు తునకలను వాడి సున్నితము చేశాడూ, ప్రసారకము (ట్రాన్స్మిటరు)ను శక్తివంతమూ ఏకముఖమూ చేశాడూ, సున్నితత్వానికి కళ్ళెము పెట్టాడు. ఆయన కృషి విజ్ఞాత విద్యుత్తరంగాల ఆయతిని ఇటూ అటూ విస్తరింప జేసింది. ప్రఖ్యాత వైజ్ఞానికులు డేవీ, క్యూరీ వంటి ధార్మికుల వలెనే, తాను నిర్మించిన సాధనమును పేటెంటు చేయక విజ్ఞాన ప్రపంచానికేనిష్కామంగా అర్పణ చేశాడు జగదీశచంద్ర.

విద్యుత్ప్రసారకమును నిర్మించడములో వెలుగులు దాటే బింతులకు ప్లాటినము పూతపెట్టించాడు బోసు. ప్రసారకాన్ని ఇనుప గోళములో ఇమిడ్చి దానికి అయస్కాంతిక జోక్యాన్ని దాన్ని మళ్ళీ రాగిగోళములో ఇమిడ్చి విద్యుత్ జోక్యాన్ని నివారించాడు. ఈకృషిలో వేర్వేరు లోహాల శరీరధర్మాలు పనికి వచ్చాయి ఆయనకు. విద్యుత్తరంగాల్ని పట్టి సూచించే కొహీరరులో కూడా వచ్చాని ఉక్కు స్ప్రింగుల స్పర్శను ఉపయోగించాడూ ఈస్ప్రింగులకు కోబాల్టు పూత పెట్టించాడు. కూడాను. వీటికి ఒత్తిడి ఎక్కువైన కొద్దీ కొహీరరు సున్నితత్వము మారింది. గంటా రెండు గంటలు పని చేసిన తర్వాత కొహీరరు జాగరూకత మారింది. కొంత విశ్రాంతి ఇస్తే సున్నితత్వము మళ్లీవచ్చింది. చాలానాళ్ళు విశ్రాంతి ఇస్తే అసలే మొద్దుబారింది. ఈ సున్నితత్వాన్ని పరిశోధించాడు బోసు. అది పెరిగి లోహాలా—అలోహములా స్పర్శాజాగరూకత యొక్క కూలంకష పరిశోధనగా రూపొందింది. అన్ని పరిశోధనల వలెనే బోసు పరిశోధన కూడా దారి బాటవలెనే నిరంతరాయముగా సాగింది కాని ఇప్పుడాట్టు వేయలేదు. కూల పదార్థాలు అన్నీ ఈ స్పర్శా ధర్మాన్ని వేర్వేరుగా ప్రదర్శించడములో 'ఇది అణువులలో విద్యుత్తరంగాలవల్ల కలిగిన మార్పు' అని తీర్మానించుకుని కాంతివల్ల ఫోటోగ్రాఫిక్ పదార్థాల అణువులలో కలిగే మార్పుని శోధించాడు. కాంతి అంటే కంటికి అందివచ్చే విద్యుత్తరంగ ప్రసారమేగదా? కంటికి అందిరాని ప్రసార ఫలితాలు తెలుసుకోడానికి కాంతి వల్ల కలిగేఫలితాలు తెలుసుకోడము మార్గముకదూ?

ఈపరిశోధననుండి, "జీవములూ అజీవములూ ప్రేరణ కేనా చూపించే ప్రతిక్రమము"ను పరిశోధించడమునకు ఒక్కటేమెట్టు: ఆరెండింటి ప్రతికారాన్ని ఒకదాని పక్కన ఒకటి పెట్టి పోల్చడము, జగదీశ చంద్రుడు చేసినదదే. ఇనుము, రాగి అయస్కాంత రజము వంటి రసాయనిక పదార్థాలు విద్యుత్ప్రసారానికి చేసే ప్రతికారానికీ, కండరాలు —బతికి ఉన్న ప్రాణాల కండరాలు...చేసే ప్రతికారానికీ గొప్ప పోలికలున్నట్లుగా మొట్టమొదటి సారిగా జగదీశ చంద్రుడు నిరూపించాడు.

అయితే, ఈ భారతీయుడు, భౌతికశాస్త్రవేత్త, జీవశాస్త్రముతో జోక్యము చేసుకొని 'ప్రతికారము' అనే జీవశాస్త్ర పరిభాషను దోచుకోడము సర్ జాన్ సెండర్సను అన్న ఆక్స్ఫర్డు జీవశాస్త్రజ్ఞునికి కిట్టలేదు. బోసుగారి వ్యాసానికి శీర్షిక (తప్పని) మార్చాలని చెప్పాడు ఆయన. బోసుగారు అంగీకరించలేదు. ప్రయోగాల మూలంగా తనతప్పు చూపించాలిగాని అధికారము వల్ల కాకూడ దన్నారు. అపతరి వారికి చాలా చాలా కోపం వచ్చేసింది, బోసుగారి వ్యాసము అచ్చుతో రాకుండ అడ్డేరు. దీని అంతు కనుక్కోవలని బోసుగారు ఉద్యోగానికి శలవు పెట్టి లండనులో రాయల్ ఇన్‌స్టిట్యూషనులో కొత్త పరిశోధనలు జరిపేరు. "రాయల్ సొసైటీ ప్రచురించకుంటే మాని లిన్నియన్ సొసైటీ వారము వేస్తామన్నారు.

అయితే ఇక్కడ మోసము అడ్డువచ్చింది. బోసుగారి ప్రయోగాలు చిరకాలంగా చూస్తూండిన మహాను భావుడొకాయన ఆ ప్రయోగాలు నావి నేనూ చేశానూ, నేను చెయ్యడము మొదలూ బోసుగారివి తరవాతవి అన్నాడు! విచారించడానికి కమిటీ వేశారూ, చచ్చి చెడి వాయుంగల విన్నపాలు "ఆ ఫలితాలు మొదట కనుక్కున్నది బోసుగారే" నన్నారు.

తరవాతి రోజుల్లో బోసుగారు వైజ్ఞానిక పత్రికల ప్రచురణ కోసమని చూడక తన పరిశోధనలను పుస్తకాల రూపంలో ప్రచురించారు! ప్రతిసక్షులు ఇంగ్లండులో ఆయన ప్రయోగవిధానాన్ని విమర్శిస్తూ గేలికొట్టుతూనే వుండినారు. 1914 తర్వాత ఆయన మళ్లీ ఆ దేశాలకు వెళ్లి తనవాదాన్ని స్థాపించే దాకా కిట్టని వారు అక్కడ ఇక్కడా అల్లర్లు చేస్తూనే ఉన్నారు! అయితే బోసుగారి తరువాతి వైజ్ఞానికులు సాహా, రామన్, పి. సి. రాయి, యస్. ఎన్. బోసు, కె. యస్. కృష్ణన్ వంటి వారికి బోసుగారికి వచ్చిన కష్టాలు రాలేదు. రామన గారికి నోబెలు బహుమానము ఇవ్వక ముందు మాత్రము "భారతీయులు మీరు అగాలయ్యా" అని బూడిద్ తర్లు గాలో ఎవరో అన్నట్లు వినికిడి.




సాయంకాలం ఆకాశం రకరకాల రంగుల్తో అలంకరించుకుంటుంది. సోమరిగా కదుల్తున్న మబ్బు ముక్కలు క్షణక్షణానికి ఆకారాలు మార్చుకుని తేలిపోతున్నాయి. వాటి వంక అలాగే చూస్తూ ఆలోచిస్తున్న పార్వతి మనసులోనూ ఎన్నోరకాల రంగుల ఆలోచనలు రూపు చేసుకుంటున్నాయి, విడిపోతున్నాయి.

సుమారు యిరవై యేళ్ళ క్రితంనాటి మాట.

అప్పట్లో పార్వతి యూనివర్శిటీలో చదువుతోందేది. క్లాసు నాలుగుగోడల మధ్య చదువుకున్న విజ్ఞానమేకాక, యింకా ఎన్నోచూసి, చదివి, ఆలోచించి మనసుని వికసింప చేసుకుంటున్న మధురక్షణాలవి. చదువుకోవాలి, యింక పైనేం లేదన్నంతవరకు చదువుకుని ఒకరి అధికారానికి తలొగ్గకుండా స్వేచ్ఛగా సంపాదించుకుని జీవితం ఆదర్శవంతం చేసుకోవాలి. మామూలు ప్రతీ ఆడదాని లాగ యెవరికో ముడిపడి, పిల్లల్ని కని, వాళ్ళ రోగాలు, ఏడుపులు, వంటల్లో సతమతమవుతూ, మరొకరి కోసం తనని బలి పెట్టుకుని రోజులు నెట్టేయడం అంటే చెప్పలేని భయం, అసహ్యం!..యీ గాడిలో పడి అందర్లాగా యెటో చావు వెతుక్కుంటూ కొట్టుకుపోకుండా, పూర్తిగా తన కోసం తను, తనకి యిష్టం వచ్చిన విధంగా బ్రతకాలని ఆమె అప్పట్లో నిశ్చయించుకుంది.

ఆ నిశ్చయం ఎవరెన్ని విధాల నచ్చచెప్పినా సడలలేదు. తల్లి, తండ్రి, అన్నలు అందరూ ఎన్నోవిధాల హితబోధలుచేశారు. ఆఖరిసారి యింట్లో పెద్దరభసే జరిగింది. ఎన్నో సంబంధాలు చూడకుండానే తిరస్కరించింది. ఆఖరిసారి ఆమెకి తెలియకుండా పెళ్ళి చూపులు ఏర్పాటు చేశారు. యిష్టం లేకపోయినా కూర్చోక తప్పలేదు. అప్పుడే తన నిశ్చయాలని బయట పెట్టింది. యింట్లో అందరూ అనేకవిధాల నచ్చ చెప్పబోయారు.

"యింత మంచి సంబంధం తప్పు చేసినా మళ్లీ దొరకదు. పదిహేను వందలు జీతం. విదేశాలు వెళ్ళి వచ్చాడు. వినయం, విధేయత, సంస్కృతి, సంస్కారం ఉన్నవాడు. అందగాడు, ఆస్తిపరుడు. అన్నిటిని మించి నీ వంటే చాల యిష్టపడ్డాడు. నీ వెందుకింత మూర్ఖంగా అతన్ని తిరస్కరిస్తున్నావో మాకు అర్థం అవడం లేదు." అన్నయ్య కోప్పడ్డాడు. వద్దంటున్న కొద్దీ, దాన్నిలా డిగ్రీల మీద డిగ్రీలు చదివించారు. దాన్ని యిలా నెత్తి నెక్కించుకున్నారు. యింక యిప్పుడది మన మాట వింటుందా!" అమ్మ విసుక్కుంది.

"బాగా ఆలోచించు తల్లీ, చదువుకున్న దానివి. పెళ్ళి కాకుండా యెన్నాళ్ళుంటావు! నిన్ను కన్నందుకు మా బాధ్యత మేము నెరవేర్చాలి గదా! నీకు పెళ్ళి చెయ్యకుండా ఎన్నాళ్ళు చూస్తూ వూరుకుంటాం?" నాన్న బ్రతిమిలాడారు.

"పెళ్ళి చేసుకోకుండా, ఎమ్మెస్సీ, డియస్సీ అయి, విదేశాలు వెళ్ళి తిరిగొచ్చి యింకా పరిశోధించి, కనిపెట్టి, పేరు పొంది నోబుల్ ప్రైజు కొట్టేసి.. యింక ఆతర్వాత ఏం చేస్తావు?" చిన్నన్నయ్య వేళాకోళం.

యిన్ని హితోపదేశాలు, మందలింపులు, వెక్కిరింపులు, అనునయాలు, కోపాలు, ఆగ్రహాలని ఎదుర్కోవలసి వచ్చిందో ఆనాడు పైకి చదవాలన్న తన కోరిక నెరవేర్చుకోడానికి! మొత్తానికి ఎలాగైతేనేం, అన్ని అవరోధాలని దాటి తన ఆదర్శం చేరుకోగలిగింది. తన ఆశయం నెరవేర్చుకోగలిగింది.

యీ దేశంలో ఒక డాక్టరేట్, విదేశాల్లో ఒక డాక్టరేట్ పొందింది. తిరిగి వచ్చాక మొదట్లోనే పెద్ద జీతంతో మొదలై యూనివర్శిటీలో ప్రొఫెసరుగా పని చేస్తోంది. కాలేజీలో యెంతో పేరు. ఆమె అంత మేధావి ఆమెలాగ అతిసూక్ష్మంగా వివేచించి, వ్యక్తం చెయ్యగలవారు లేరంటారు. యెన్నో పుస్తకాలు చదువుతుంది. ఆమె సబ్జక్ట్ ఏదేకాక, యింకా యేవేవో యితర విషయాల మీద! జ్ఞానాన్ని అన్వేషించాలని, అర్జించాలని ఆమెకున్న తృష్ణ యెనాటి

క్కప్పుడు యేదో అసంతృప్తిని, వెలితిని చూపెట్టూనే ఉంటుంది.

నగరంలో అందమైన చోట ఓ అందమైన బంగళాలో ఆమె మకాం. వంటకి మనిషి, పనులకి నౌకరు, తోటకి మాలి, చిన్నకారు అన్ని సదుపాయా లున్నాయి. కాలక్షేపానికి అన్న కూతురు ప్రమీల వుంది. ఆమె పనిచేసే కాలేజీలోనే చదువుతూంది. చలాకీగా వుంటుంది, మంచి మాటకారి. పార్వతికి మనసు సరిగా లేనపుడు, ప్రమీలతో కాసేపు కబుర్లు చెపితే చాలు, ఆమె ఉల్లాసం యీమెలోనూ అంటు వ్యాధిలాగ వ్యాపిస్తుంది.

ప్రమీలని పార్వతి నద్దకి పంపడానికి ఆమె తండ్రి చాల సంశయించాడు. వివాహం ఆడదాని కాళ్లకి సంకెళ్ళు వేస్తుందని, అనవసరమైన వ్యాపకం అనీ, వాదించి పెళ్లి మానేసిన పార్వతి, ప్రమీల మెదడులో ఆ బీజాలే నాటుతుందని ఆయన భయం. కాని ప్రమీల యిష్టం వల్లా, పార్వతి వత్తిడి వల్లా, అంతకు మించి ప్రమీలని వంటరిగా వేరే చోట ఉంచడం యిష్టంలేక అక్కడికే పంపాల్సి వచ్చింది.

పార్వతి అలా సాయంకాలాలు ఆరుబయట, కూర్చుని నీరెండల్లోకి చూస్తూంటే యేవేమిటో ఆలోచనలు వస్తాయి. యీమధ్య కొన్ని కొన్ని సమయాల్లో యేదో అసంతృప్తి పూర్తిగా కృంగదీస్తుంది ఆమెని.

ఆ సాయంకాలమూ అంతే! అలా కూర్చుని పైకి చూస్తూంటే, రోజూ అవే పుస్తకాలు, పాఠాలు విద్యార్థులు, పరీక్షలు, అదే కాలేజి, అన్నీ యేమిటో గుర్తుకొచ్చి మనసు కలతపడింది. జీవితంలో స్తబ్దతని, నిశ్చలతని ద్వేషించిన తను కూడ ఆఖరికి ఒక గాడిలోకి ప్రవేశించింది. బ్రతుకు యిలా ముగియవలసిందేనా? నవ్యత నాశించిన ఆమెకి యీ బ్రతుకూ విసుగు కలిగించింది. ఆమె ఆలోచనలు పరిపరి విధాల పోతున్నాయి.

గేటు తీసుకుని ప్రమీల లోపలికి వచ్చింది. ప్రక్కన లాన్లో పార్వతి వంక చూడకుండానే యేదో ఆలోచనలో పడి హడావిడిగా లోపలికి వెళ్లింది. పుస్తకాలు టేబిల్ పైకి గిరవాటేసి బట్టలయినా మార్చకుండా, పుస్తకాల మధ్యనించి ఓ ఉత్తరం తీసి లదేపనిగా చదివింది చాలసేపు. చివరికి చీకటి గదిలో అలా ఉత్తరం పట్టుకుని ఆలోచించుకుంటూ కూర్చుంది.

"చీకట్లో కూర్చున్నావేం ప్రమీ, లైటు వేసుకోక పోయా వా?" పార్వతి గదిలోకి వచ్చి లైటు వేసింది.

ప్రమీల ఉలిక్కిపడి లేచి, గాభరాగా ఉత్తరం దాచి, మౌనంగా టవలు తీసుకుని బయటికి వెళ్లి పోయింది.

పెనుగాలిలా ఉరుకులు వేసే ప్రమీల అలా నెమ్మది, నిబ్బరంతో హుందాగా నడిచి వెళ్లడం, అంతకు మించి యేదో ఆలోచనలో పడ్డం, పార్వతికి ఆశ్చర్యంగా వుంది. ప్రమీలకి దేవుడు హృదయమే గాని మెదడు యివ్వ లేదనుకునేది చాలసార్లు. అలాంటిది యీ రోజు ప్రమీలలో మార్పుకి కారణం ఏమిటో!

ఆ తర్వాత ఆ మార్పుకి కారణాలు అన్వేషించడమే ఆమె కొక ముఖ్యమైన పనయింది. ప్రమీల క్రమంగా చాల మారింది. యెప్పుడూ పదిమందిని మట్టూ చేరేసి నవ్వుల్లో, కేరింతల్లో ఉప్పెనలా చెలరేగే ప్రమీల క్రమేపి స్నేహితులని వదిలిపెట్టింది.

# నీ రెండలు

యెప్పుడూ ఒక్కతే కూర్చుంటుంది. అప్పుడప్పుడు ఏదో వ్రాస్తూంటుంది. లేకపోతే అలా యెక్కడికో ఏ అర్థమూ చెప్పని చూపులు చూస్తూంటుంది.

ఓ సాయంకాలం తొందరగా యింటికి వచ్చి కూర్చున్నారిద్దరూ. సినిమాకి వెడదామని ప్రతి పాదించింది ప్రమీల. ఏముంటుందో చూడాలని తను యిష్టం లేకున్నది పార్వతి కావాలంటే ప్రమీలని ఒక్కతెనే వెళ్లమంది. మామూలుగా అయితే, పార్వతి కదిలిందాకా వేధించుకు తినేది ప్రమీల. కాని ఆరోజు "సరే, అయితే!" అని యింకేం అనకుండా వెళ్లిపోయింది. అది పార్వతి కొక కనువిప్పు.

మరో సాయంకాలం భోజనాల వేళ, కంచం ముందు కరిపిందే కలుపుతూ అలా మూగగా ఆలోచిస్తూ తనలో తను నవ్వుకుంటున్న ప్రమీలని చూస్తూంటే పార్వతికి నవ్వు, కోపం, చిరాకు, అదేమిటో తెలుసుకోవాలన్న ఉత్సుకత యిలాంటి వెన్నో చాల వచ్చాయి.

"యెందుకే అలా నీలోనువ్వే నవ్వుకుంటున్నావు?"

"యేం లేదత్తయ్యా!"

"యేమి లేకుండా నవ్వుకోడానికి నీకేం పిచ్చా ఏమిటి?"

"కాదు, యేదో గుర్తు వచ్చింది!"

"అ యేమిటో, యేదో నాతో చెప్పకూడదూ?"

"అబ్బ! అన్ని ప్రశ్నలే నీకన్నీ కావాలి! యేం లేదంటే యేం చెప్పను?" విసుగు, గారం, మిళా యించి మాట మార్చింది ప్రమీల.

అప్పట్నుంచి పార్వతి ప్రమీల మీద యించుమించు గూఢచర్యం సాగించింది. ఆమె మాటల్లో మౌనంలో లేని అర్థాలు యెన్నో వెతకసాగింది. ఆమె కళ్లలోకి పరిశీలనగా చూసేది. ఉత్సుకత, ఉత్కంఠ మాత్రమే కాకుండా యేదో భయం కూడ ఆమెలో ప్రవేశించింది.

ఆ రోజు కాలేజీలో వక్తృత్వపు పోటీలు! వార్షికోత్సవ సందర్భంగా జరిగే వారం రోజుల్లోనూ ఆ రోజు కట్టకడపటిది. అతిముఖ్యమైనది. అన్ని కాలేజీల నించి విద్యార్థులు పాల్గొంటారు.

పార్వతి కన్నా ముందుగానె అక్కడికి వచ్చి ముందు కుర్చీల్లో కూర్చుంది ప్రమీల. పోటీలన్న పేరేగాని యించుమించు తుదినిర్ణయం అందరికీ ముందుగా తెలిసినదే. కృష్ణమూర్తి అన్ని కాలేజీల్లోనూ అంతకుముందు ఉత్తమ వక్త అనిపించుకున్నాడు. అతను ఫైనల్ ఎం. ఏ. చదువుగ, సన్నగా బాగుంటాడు. చక్కని శైలి వినిపించే కంఠం. అంత కంటె అతను యే విషయం పైనైనా మాట్లాడే ముందు యెంతో చదివి, తెలుసుకుని గాని రాడు. అందుచేత అతను చెప్పే చాల విషయాలు యితరుల కందకుండా పోయేవి.

ఆ యేడు విజేత కృష్ణమూర్తి!

చాల రోజులనుంచి చ డని వెల్లువలాంటి ఉత్సాహం, ఉల్లాసం ప్రమీలలో ఆరోజు కృష్ణమూర్తిని అభినందిస్తున్నప్పుడు చ సింది పార్వతి దూరాన్నించి వాళ్లిద్దరూ ఒకర్నొకరు చ సి నవ్వుకుంటూ మాట్లాడుకుంటూ నడవడం చూశాక పార్వతికి చాలవరకు అర్థమయింది. వాళ్లిద్దరూ అలా కాంటీన్ లోకి మాయమైనాక, పార్వతి యింటికి చేరుకుంది వంటరిగా.

ఆ తర్వాత వారం రోజులలో కృష్ణమూర్తి గురించిన వివరాలు అన్నీ సేకరించింది పార్వతి. స్వయంగా అతనితో మాట్లాడింది. చివరికి ఓ నిర్ణయానికి వచ్చింది. అన్నగారికి ఉత్తరం రాసింది.

'అన్నయ్యకి,

చాలరోజుల తర్వాత ఉత్తరం వ్రాస్తున్నాను. వ్రాయాల్సిందేం కనపడక యింత కాలం వ్రాయలేదు. ప్రమీల కులాసాగా వుంది. బాగా చదువుతూంది తప్పకుండా క్లాసు రావచ్చు.

అసలు యీ ఉత్తరం రాయడానికి కారణం ప్రమీలకి యింక చదువు పోయినట్లే లెక్క అది రీసెర్చికి వెళ్తుందని గాని, ఉద్యోగం చేయించాలని నీ ఉద్దేశం అనిగాని నకోను. దానికి పై చదువుల మీద మోజ లేదు నాకూ యింక యీ చదువు చాలనిపిస్తుంది. అందుచేత యింక పెళ్లి గురించి ఆలోచించడం మంచిదని నా ఉద్దేశం.

ప్రమీలకి తగిన సంబంధం మొకటి చూశాను. కృష్ణమూర్తి బాగుంటాడు తెలివైనవాడు, చక్కని. యింకా చాలపైకి వెళ్లే లక్షణాలున్నాయి అన్ని విధాల ప్రమీలకి తగినవాడు. అందుకు నీవేం సందేహించక్కర లేదు.

అన్నింటికన్నా ముఖ్యం వాళ్లిద్దరూ ఒకర్నొకరు యెంచుకొని యిష్టపడ్డారు. ప్రమీల సుఖం కన్నా నువు కావల్సిందేముంది? అందుచేత యింక యే అడ్డు చెప్పకుండా యీ వేసవిలోనే యీ పెళ్లి జరిపిస్తావని ఆశిస్తాను నీవు అతన్ని చూడాలనుకుంటే యిక్కడికి రా? వాళ్ల పెద్దవారితో కూడ మాట్లాడి నిశ్చయించుకోవచ్చు.

—'పార్వతి'

ఉత్తరం పోస్టుకి పంపాక కిటికీ దగ్గిర నిలబడి బయటికి నీ రెండలోకి చూస్తూంది పార్వతి.

యీ యిరవై ఏళ్లలో తన అభిప్రాయా లెలా మారాయో, అలాగే మారుతున్నాయి ఆకాశంరంగులు. అప్పుడంత నిశ్చలమనుకున్న తన మనోభిప్రాయాలు, యీనాడు యిలా ఆమెని కలవర పెడుతున్నాయి. ఆమె జీవితంలో యెంతో నష్టపోయింది. కాని ఆ నిజం ఆమె చాల ఆలస్యంగా గుర్తించింది. తను పోగొట్టుకున్న దానివిలువ ఏమిటో చాలా ఆలస్యంగా తెలిసింది ఆమెకి. అనుకోకుండా ఆమె కళ్లలో నీరు తిరిగింది.

"ఎందుకత్తా! నీకళ్లలో నీళ్ళు! ఏమిటయింది?" అప్పుడే వచ్చిన ప్రమీల ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది.

"ఏంలేదు" చప్పున వెనక్కితిరిగి కళ్ళు తుడుకొంది పార్వతి.

"కాదు.. చెప్పాలి, ఏం అయిందత్తా" ఆత్రంగా అడిగింది ప్రమీల.

"షో, కొంటెపిల్లా! ఆరోజు నువ్వెందుకు నవ్వు కున్నావో చెప్పావా? యీరోజు నేనెందుకు యేడుస్తున్నావో చెప్పడానికి!" లేని నవ్వు తెచ్చుకుని హాస్యమాడబోయింది పార్వతి

ఆ కన్నీళ్లు ఆమె హృదయంలో గూడుకట్టుకున్న బాధకి ప్రతిరూపాలని, ఆమె ఓటమిని ప్రకటించే చిహ్నాలని ప్రమీలకి తెలియదు. ●

## జ రి గి న క థ

రామదాసును హత్యచేసి, ఆయన దాచుకొన్న ధనంతా ఎవరో దోచుకుపోయారు. అంతక్రితమే సత్యమూర్తితో తన కథ కొంత చెప్పారు రామదాసు. ప్రకాశం తన సుగర్ ఫ్యాక్టరీలో సత్యమూర్తికి ఉద్యోగం ఇచ్చాడు. ఆ చుట్టుప్రక్కల ప్రకాశానికి చాల పరపతి ఉంది. అతనికి దామోదరం నమ్మిన బంటు. భానుమతిని వశపరచుకుంటే కావలసినంత ఆస్తి దక్కుతుందని అందుకు దామోదరం ప్రయత్నిస్తున్నాడు. సత్యమూర్తి, భానుమతి పరస్పరం ఆకర్షించుకున్నారు. భానుమతిపేర నెలనెలా వచ్చే మనియార్డరు ఎవరిదగ్గర్నుంచో తెలుసుకోవాలని ఆరాటపడుతున్నాడు సత్యమూర్తి.

---

# 20

[ ] మహారాణి పేటలో చాలా దూరం నడిచి, బీచిలో ఒక ఏకాంత స్థలములో ఇద్దరూ కూర్చున్నారు. సత్యమూర్తి భానుమతి కళ్లలోకి చూస్తూ, అన్నాడు. "ఇక్కడికి నేను ముందు చాలా సార్లు వచ్చాను గాని, ఇంతసంతోషం ఎప్పుడూ కలగలేదు. పైగా ఈ ప్రదేశంలో ఇంత ఆనందం ఉందని కూడా అనిపించ లేదు. ఇప్పుడు ఏకంగా ఈ సముద్రం గురించి ఒక పద్యం రాయాలని పిస్తోంది".

"మునుపు మీరొక్కరే వచ్చివుంటారు. ఇప్పుడు నేను కూడా వుండడం వలన మీకు ఏదో మార్పు కనిపిస్తోంది కాబోలు" అంది భానుమతి, చిరునవ్వుని పెదిమల మధ్య దాచుకుంటూ.

"నిజం చెప్పావు. నువ్వు నా ప్రక్కనవుంటే ప్రపంచం అంతా క్రొత్త వెలుగుతో కన్పిస్తుంది. ఆ విషయం నేను గ్రహించాను"

"అంటే?" అని అతనివైపు తీక్షణంగా చూసింది.

"అంటే—అది అంతే" అన్నాడు సత్యమూర్తి.

"చాలా దూరం వెళ్తున్నారే" అంది భానుమతి

"అంతా వృథాప్రయాస అంటావా?"

"నాకేం తెలుసు?" అంది అమాయకంగా.

"హమ్మయ్యా! కాదని మాత్రం అనలేదు. అందుకు సంతోషం."

భానుమతి నవ్వింది సత్యమూర్తి కూడా నవ్వాడు. ఇద్దరూ కొద్దిసేపు కెరటాలవైపు చూశారు. సత్యమూర్తి కొద్దిక్షణాల తర్వాత, "నీకొక విషయం చెప్పాలని చాలా కాలంనుండి అనుకుంటున్నాను, కాని, చెప్పలేక పోతున్నాను. ఇవాళ అది చెప్తేగాని నా మనస్సాగే ట్టు లేదు." అన్నాడు.

"ఏమిటది?"

"మీ బాబాయి నీ బాధ్యత నా కప్పగించి నప్పుడు నిన్ను నేనెరుగను కాని నిన్ను చూసిన దగ్గర్నుండీ, ఇక ఒక్క నిముషమైనా ఆలోచించ కుండా వెంటనే నీ బాధ్యత స్వీకరించాలనిపించింది. నువ్వు కేవలం మా రామదాసుగారి కూతురువేకాదు. ఒక అపురూప సుందరివి. అటు వంటి సుందరిని కోసం అర్హత నాలో ఏమీ లేదు. అందువల్ల సంకోచించవలసి వచ్చింది. నీకూ ఈనరికి పురుషులంటే కొన్ని అభిప్రాయాలు ఏర్పడి




వుంటాయి. నీమనస్సుకు నచ్చిన వారి గురించి నాకు తెలియ జేస్తే సంతోషిస్తాను.'

"నామనసుకు నచ్చిన వాళ్లు, అనంత రావుగారు: మా బాబాయి".

సత్యమూర్తి పకపక నవ్వాడు. భానుమతీ నవ్వింది. నవ్వు ఆపి సత్యమూర్తి, "సరే నేను నీ మనసుకు నచ్చనేలేదన్న మాట" అన్నాడు.

"మీరు నామనసుకు నచ్చడం కాదు. నామనస నాకర్షించారు".

అదివినగానే, "ఆ!" అని సత్యమూర్తి, కళ్ళు పెద్దవి చేసి ఆమెవైపు చూశాడు. ఆమె తల వంచుకుంది.

"నిజంగా నేనంత అదృష్టవంతుణ్ణా?" అని మెల్లగా అన్నాడు.

ఆమె తలవంచే తలూపింది సత్యమూర్తి తన మనసులోని భావాలను ఏవేవో చెప్పనారంభించాడు. అవన్నీ ఆమెను చూసినప్పుడల్లా తనలో కలిగే ఆలోచనలు. స్త్రీలు ఏవిధంగా ఉండాలని తను తనమనసులో చిత్రించుకున్నాడో, ఆవిధంగా కన్పించింది భానుమతి ఒక్కర్తేనన్నాడు. ఆమెకూడా మధ్యమధ్య తన భావాలు చెప్పింది. ఒక ఆదర్శవంతమైన జీవితం గడపాలని ఇద్దరకూ వుంది. ఇద్దరిలోనూ, తాము భవిష్యత్తులో ఏవో సాధించాలనే కోర్కెలున్నాయి. ఆ కోర్కెలు డబ్బుగురించి కావు, సుఖం గురించి కావు. సంఘంలో మార్పును గురించి, ప్రజలకొక నవీన సందేశాన్నందించడం గురించి, దేశంలో వ్యాపించిన అజ్ఞానాంధకారంలో ఒక వెలుగు రేఖను చూపడం గురించి— కోరికలు.

ఇద్దరూ తమ భవిష్యత్తు గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు. బాగా చీకటి పడ్డాక, లేచి భానుమతి ఇంటికి బయల్దేరారు. సత్యమూర్తితో కలిసి భానుమతి రావడం చూసిన కూర్మనాథస్వామీ, ఆయన భార్యా తమలోతాము ప్రశ్నార్థకంగా చూసుకున్నారు.

సత్యమూర్తి ఇంట్లోకి రావడానికి సందేహిస్తూంటే, స్వామిగారు, "రావోయ్ ఇంతసేపూ భానుమతి ఎక్కడికెళ్లిందా?అని అనుకుంటున్నాము..దానికోసం జగ్గారావుగారి అమ్మాయి మాలతివచ్చి ఇంతసేపూ కూచుని ఇప్పుడేవెళ్లింది."అని భానుమతివైపు తిరిగి, "రేపు వాళ్లింట్లో ఏదో పార్టీవుందిట, నిన్ను తప్పకుండా రమ్మని మరీమరీ చెప్పింది." అన్నారు.

"సరే, అలాగే వెళ్తాను" అంది భానుమతి.

స్వామిగారు సత్యమూర్తిని కూచోపెట్టి, భానుమతి బి.ఏ. చదువు పూర్తయింది కాబట్టి భవిష్యత్తులో ఏం చెయ్యాలా? అని ఆలోచిస్తున్నామన్నారు. ఆడపిల్ల కాబట్టి వివాహం చెయ్యవలసిన బాధ్యత తమపై వుందనీ, ఆ విషయంలో భగవంతుడి దయ ఎప్పుడు కలుగుతుందా? అని ఆలోచిస్తున్నామన్నారు. "అది అందరి లాటి పిల్ల కాదోయ్. చాలా స్వతంత్ర భావాలు కల వ్యక్తి. దానిని సరిగ్గా అర్థం చేసుకుని, దాని భావాల్ని గౌరవించే వ్యక్తి కావాలి." అన్నారు ఆలోచిస్తూ.

"మీరందుకు చింతించకండి. నే నామెను ఆరాధిస్తున్నాను. మీ రంగీకరిస్తే ఆమెను నా దానిగా చేసుకుంటాను." అన్నాడు సత్యమూర్తి.

స్వామిగారు సంతోషంతో, "చాలా మంచిది నాయనా, మా మనస్సులలోనూ అదే వుంది. భాను నీ గురించి ఎన్నో విషయాలు చెప్పింది. ఎప్పుడూ నీ గురించే మాట్లాడుతుంది. మీ యిద్దరూ ఒకరికొకరు తగిన వారనిపిస్తుంది. మేము ముసలి వాళ్లమై పోయాం. మీ యిద్దరిని ఒకటి చేసి, మిమ్మల్ని చూసుకుంటూ, ఆ భగవంతుణ్ణి ధ్యానించుకుంటూ కాలం వెళ్లబుచ్చుదల్చాం.' అన్నారు.

"నా కొక వివాహంకాని చెల్లెలుంది. ఆమె మా మీద అలిగి మూడేళ్ల క్రిందట ఇల్లు వదిలి పెట్టి వెళ్లిపోయింది. ఆమె గురించి తెలుసుకుని, ఆమె విషయంలో నా బాధ్యత నెరవేర్చుకోగానే మే మిద్దరం వివాహం చేసుకుంటాం." అని సత్యమూర్తి చెప్తే, అందుకు స్వామిగారు అంగీకరించారు.

మరునాడు ప్రొద్దున్న మాలతి ఒకచీటి రాసి భానుమతి పేర, తమ నౌకరు ద్వారా పంపింది. అందులో ఆరోజు సాయంకాలం భానుమతి తప్పకుండా తమ యింటికి రావాలనీ, తమయింట్లో ఒక చిన్న టీపార్టీ ఏర్పాటు చేశామనీ వుంది. అలాగే వస్తానని చెప్పమని, ఆ నౌకరుతో చెప్పి పంపేసింది భానుమతి.

సాయంకాలం ఆరు గంటలకి భానుమతి కోసం జగ్గారావుగారి కారు వచ్చింది. అందులో భానుమతి వెళ్లి కూచుంది. కారు జగ్గారావుగారి ఇంటిముందు ఆగగానే, మాలతి ఎదురుగా వచ్చి "అంతా సిద్ధమైపోయింది. నీ కోసం ఎదురు చూస్తున్నాను. నువ్వు లేకుండా పార్టీకి అందం లేదు." అని కారులోంచి దిగిన భానుమతిని, ఇంట్లోకి తీసుకు వెళ్లింది.

"ఏమిటే హడావుడి? అని అడిగింది భానుమతి.

'వూరిలోని కొందరు ప్రముఖ వ్యక్తుల నాహ్వానించి ఒక టీపార్టీ ఏర్పాటు చేశారు నాన్నగారు. దామోదరంగారూ, ఆయన కొడుకూ కూడా వచ్చారు. ముఖ్యంగా మన మహిళాభ్యుదయసంఘం గురించి కొంత చర్చించ దల్చుకున్నారు.

పార్టీ, జగ్గారావుగారి ఇంట్లో, తోటలో ఏర్పాటు చెయ్య బడింది. ఆయన కొక అందమైన తోటా, చిన్న లాన్ గ్రౌండు ఉంది. మధ్యన ఒక టేబిల్ పెట్టి దానిమీదా పలహారపు పళ్లేలూ, కాఫీ కప్పులూ, సాసర్లూ వుంచారు. అది 'బఫే పార్టీ'. సుమారు ఇరవై మందిదాకా పురప్రముఖులు తదితర వ్యక్తులూ వున్నారు. మాలతి, భానుమతిని వారందరికీ పరిచయం చేసింది. దామోదరం భానుమతిని చూడ గానే, "నీ పరీక్ష లైపోయాయనుకుంటాను". అన్నాడు.

"అవును". అంది భానుమతి దామోదరం ప్రక్కన నిల్చున్న ఒక పొడుగాటి సన్నని వ్యక్తివైపు

ఆమె దృష్టి పడింది. అతను ఖరీదైన టెరిలిన్ సూటు వేసుకున్నాడు. లోపల తెల్లని చొక్కా, దానిమీద నల్లని టై కనిపిస్తోంది. సూటు ఖాకీ రంగులో వుంది. అతని కళ్ళు మాత్రం ఎర్రగా వున్నాయి.

దామోదరం అతనితో, "ఈమె భానుమతి". అని భానుమతితో "ఇతనే మా అబ్బాయి గోపాలన్" అన్నాడు.

"నమస్తే." అంది భానుమతి, తనవైపు కళ్ళప్పగించి చూస్తున్న ఆపాతికేళ్ళ యువకుణ్ణి చూస్తూ.

"నమస్తే." అన్నాడు.

దామోదరం భానుమతితో "గోపాలన్ మరొక వారం రోజుల్లో బొంబాయి వెళ్తున్నాడు. నువ్వు కూడా అతనితో వెళ్ళవచ్చు. మహిళాభ్యుదయ సంస్థ యొక్క బొంబాయి బ్రాంచికి వుత్తరం రాస్తున్నాం. నువ్వు ఆడపిల్లల హాస్టలులో వుండ వచ్చు. గోపాలన్ అక్కడ పదిహేను రోజులు పాటుంటాడు. నీకక్కడ ముఖ్యమైన వన్నీ చూపిస్తాడు. సెలవులు రెండు నెలలూ ఉత్తర హిందూ స్థానంలో గడిపి రండి." అన్నాడు.

"అబ్బో! బొంబాయి వెళ్ళడమా? సాధ్యం కాదు." అంది భానుమతి.

"ఏం? అంతా సంస్థ ఖర్చుమీదే. నువ్వేందుకు జంకక్కర్లేదు. అయినా ఇక నీబాధ్యతంతా మాది" అన్నాడు చిరునవ్వుతో దామోదరం.

భానుమతి లాభం లేదన్నట్లు తలూపింది. దామోదరం, "ఏమో మీయిష్టం. నువ్వు, గోపాలన్ మాట్లాడుండి." అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిపోయాక, భానుమతి కూడా కదలబోయింది. కాని గోపాలన్ "మా అప్ప నాకు మీగురించి అంతా చెప్పారు. ఆయన మీతో కూడా చాలా విషయాలు చెప్పారనుకుంటాను" అన్నాడు, కొద్దిగా తడబడుతూ.

"దేనిగురించి?" అని అడిగింది భానుమతి.

"అదే, ఈసంస్థ గురించి, మీయొక్క నాయొక్క భవిష్యత్తు గురించి, ఆయన చాలా ప్లానులు వేశారు. బొంబాయి వెళ్తే బాగానే వుంటుంది." అని మెల్లిగా మాట్లాడసాగాడు. భానుమతి, "మావాళ్ళు ఒప్పుకోరు" అని, మాటలో కొంచెం ముందుకు వెళ్తున్న అవకాశం చూసుకుని, ఆమెతోపాటు ముందుకు వెళ్ళిపోయింది, గోపాలన్‌కు దూరంగా.

గోపాలన్ మాత్రం ఆమెను చూసిన దగ్గర్నుంచి, ఏదో ఒక వూహా ప్రపంచంలో విహరిస్తున్నాడు. ఆమె అంత అందమైనదని తను అనుకోలేదు. ఇహ ఎంత మాత్రం ఆలస్యం చెయ్యకుండా ఆమెను వివాహం ఆడాలి. ఆమెకు తనయందంత ఇష్టమున్నట్లు కన్పించటం లేదు. కాని ఎంత డబ్బు ఖర్చు పెట్టినా, ఆమెను లొంగదియ్యాలి. అతనలా ఆలోచిస్తూంటే దామోదరం అతని వద్దకు వచ్చాడు. తండ్రిని చూడగానే, మెల్లిగా, "చాలా అందమైన పిల్ల." అన్నాడు.

"అందమే కాదు. చాలా తెలివైన పిల్ల." అన్నాడు దామోదరం.

అందరూ ఎవరికి కావలసిన ప్లేట్లువాళ్ళు తెచ్చుకుని తింటున్నారు. రెండు స్వీట్లూ, రెండు హాట్లూ, పళ్ళూ, జీడి పప్పు, బిస్కట్లూ, కాఫీలు ఏర్పాటు చెయ్యబడ్డాయి. జగ్గారావుగారు అందరినీ పలకరించి మర్యాద చేస్తున్నారు. భానుమతిని చూడ గానే ఆప్యాయంగా పలకరించి, తన స్నేహితులిద్దరికీ పరిచయం చేశాడు. అందులో ఒక ముసలాయన ఆమెతో చాలాసేపు మాట్లాడుతూ అన్ని విషయాలూ అడుగ సాగాడు. ముఖ్యంగా ఆమె చదువు గురించీ, ఆమెకు



అన్ని విషయాలయందు గల భావాల గురించీ అడిగాడు. అతనొక రిటైర్డు జడ్జి. చాలా డబ్బున్నవాడు. పేరు మోహన్‌రావు. మహిళాభ్యుదయస్థాపనకు అతను కూడా కృషి చేస్తున్నాడు. భానుమతి అందం, పార్టీ కొచ్చిన వారందరినీ ఆకర్షించింది. 'ఆమె ఎవరు?' అని చాలా మంది జగ్గారావుగారిని ప్రశ్నించారు. ఆమె ఒక స్నేహితుని కుమార్తె అనీ, దామోదరానికి కాబోయే కోడలనీ చెప్పాడు. ఆమాటలు భానుమతి వినలేదు. వింటే ఏమయ్యేదో జగ్గారావుకి తెలియదు.

గోపాలన్ మెల్లిగా భానుమతి వద్దకువచ్చాడు. ఆమె మోహనరావుగారితో మాట్లాడుతూంటే, తను కూడా అక్కడే నిలబడి వాళ్ళ సంభాషణలో పాల్గొన్నాడు. బెనర్జీ కూడా అక్కడ చేరాడు. మోహన్‌రావుగారు, బెనర్జీని చూసి క్లబ్బులో జరుగబోయే టెన్నిస్ పోటీల గురించి మాట్లాడ సాగారు. వాళ్ళిద్దరూ టెన్నిస్ పోటీల చర్చలో మునిగి పోయారు. భానుమతిని గోపాలన్, "మీ సెలవు లెన్నాళ్ళుంటాయి?" అని అడిగాడు. ఆమె రెండు నెలలని సమాధానం చెప్పింది.

"సెలవుల్లో ఇంటి దగ్గర కూర్చుంటే ఏం తోస్తుంది?" అన్నాడు.

"అది నిజమేననుకోండి. కానీ పరిక్ష ఫలితాలు తెలిసే దాకా నేను ఎక్కడికీ కదల దల్చుకోలేదు."

"మరి అప్ప మనల్ని బొంబాయి వెళ్ళమంటున్నారు."

"మీరు వెళ్ళండి నాకు కుదరదు."

"నన్ను వచ్చి మీ వాళ్ళతో మాట్లాడి ఒప్పించమంటారా?"

# సుప్రభాతం

భానుమతి నవ్వింది. "మావాళ్ళ తత్వం నాకు తెలిసినంతగా మీకు తెలియదు. మా నాన్నగారు అంత సులభంగా ఒప్పుకోరు. అయినా నాకు కూడా వెళ్ళాలని లేదు. మళ్ళీ కాలేజీలు తెరిచే దాకా, ఈ ఎక్కడికీ కదల దల్చుకోలేదు."

"పై చదువులు చదవాలని వుందా?"

"అవును నాకింకా చదవాలని వుంది."

"ఏం చదవాలని వుంది".

"నాకు లా చదవాలని కోరిగా వుంది." అని భానుమతి అనడం మోహన రావుగారికి వినిపించింది. ఆయన ఆనందంతో "అయితే మావృత్తిలో చేర దల్చావన్నమాట. మాలతి కూడా 'లా' చదువుతుందా?" అన్నారు భానుమతి ప్రక్కనున్న మాలతి మద్దేశించి.

"ఊహూ. నేను ఎం. ఏ. చదువుతాను" అంది మాలతి.

గోపాలన్ దృష్టంతా భానుమతి మైపే వుండడం వల్ల, ఆమె పూల చెట్లకేసి చూస్తుండడం గమనించాడు. ముఖ్యంగా గులాబీ పూలు, చెట్లు చెట్టున విచ్చి, అందంగా వున్నాయి. విద్యుద్దీపాల కాంతి వాటి మీద పడింది. కొంచెం సేపు ఆలోచించాడు.

"మీకు పూలంటే చాలా యిష్టం అనుకుంటాను." అన్నాడు.

"అవును" అంది భానుమతి. ఆసమయంలో మాలతి అక్కడ లేదు. మరెవరితోనో మాట్లాడుతూ దూరంగా వెళ్ళింది. బెనర్జీ, మోహన రావు గార్లు మళ్ళీ కేసుల గురించి మాట్లాడ సాగారు. గోపాలన్, "ఆమూల ఒక పెద్ద గులాబీ పువ్వు చూశాను. మీకు చూపిస్తాను రండి." అన్నాడు. నిజమేననుకుని భానుమతి అతని వెంట వెళ్ళింది. పార్టీలో వారందరికీ కొంచెం దూరంగా వెళ్ళాక "మీతో నేను చాలా మాట్లాడాలి. ఇక్కడ మనకి సమయం, అవకాశం కూడా లేవు. రేపు నన్ను కలుసుకోవడానికి మీకు వీలుంటుందా?"

"మా యింటికి రండి." అంది భానుమతి.

"అబ్బే. అదంతా రహస్యం. మీవాళ్ళకు అసలు తెలియ కూడదు."

"అంత రహస్యమేముంది?"

"అది చెప్పాక మీకే బోధపడుతుంది. పోనీ బీచిలో కలుసు కుందామా? అక్కడ ఇతరులెవరూ వుండరు."

"ఊహూ. అంతగా మాట్లాడాలంటే, మాలతి ఇంట్లోనే కలుసు కుందాం". అంది భానుమతి. గోపాలన్, ఆమె అంతకు మించి అవకాశం ఇవ్వదని "సరే, అలాగే రేపు అయిదు గంటల కల్లా ఇక్కడికి రండి." అన్నాడు.

అక్కడ అట్టే సేపు నిలబడకుండా భానుమతి ఇవతలికి వచ్చేసింది. ఆమెకు తనెక్కడ తిరుగుతున్నా, దామోదరం కళ్ళు తనని వెంటాడుతున్నాయని పించింది. మొట్ట మొదటి సారిగా ఆమెకు కొంచెం భయం వేసింది. వాళ్ల మనస్సులో మెలగుతున్న దురూహల్ని తను పసిగట్టగలుగు తున్నట్లనిపించింది. గోపాలన్ మొదట్లో అంత ఆసక్తి చూపించ లేదు, తనంటే. కాని కొద్ది సేపట్లో అతనిలో చాలా మార్పొచ్చింది. అతని కళ్ళల్లో ఏదో తీవ్రమైన కాంక్ష తొంగి చూస్తోంది. తనొక గొప్ప కుటుంబీకుడిలా కన్పించాలని అతను ఎంత ప్రయత్నిస్తున్నా, మధ్య మధ్యలో అతను చాలా తక్కువరకపు వ్యక్తులతో తిరిగే రకం అని తెలుస్తోంది. అతని కన్నా బెనర్జీ ఎన్నో రెట్లు నయం.

ఆడవాళ్ళతో, ముఖ్యంగా చదువుకున్న ఆడపిల్లలతో మెలగడం హిందూ కుటుంబంలోని యువకులలో ప్రత్యేకంగా నేర్చుకుంటేనే తప్ప, సరిగా చాత కాదేమో ననిపిస్తుంది. అదొక ప్రత్యేక విషయం. స్త్రీ అవగానే, ఏవేవో వూహాలు మనస్సులో పెట్టుకుని సరిగా మాట్లాడ లేకపోవడం కొందరి తరహా, మరికొందరు ఆడదానికి గౌరవం ఇస్తే తమ మగతనానికి లోటెక్కడొస్తుందో అని, వీలైనంత నిరసనగా మాట్లాడుతారు, కాని పాశ్చాత్య సాంప్రదాయాల్లో మెచ్చుకోదగిన విషయం, స్త్రీలను గౌరవించి మాట్లాడడం. అందులో సహజత్వం ఉట్టి పడుతుంది. సాధారణంగా చదువుకునే ఆడపిల్లలకు, తమనలా గౌరవించి మాట్లాడే వారంటేనే ఇష్టం అని తెలుస్తే, యువకులలో కొంత మార్పొస్తుందేమో.

భానుమతి, మొట్టమొదటి రోజున బెనర్జీకి పాఠం చెప్పిన దగ్గర్నుండి, బెనర్జీలో చాలా మార్పు వచ్చింది. అతను భానుమతి నెంతో గౌరవించసాగాడు. ఈ పార్టీలో కూడా, గోపాలన్ తనను చూసే చూపుల కన్నా బెనర్జీ తనవైపు చూసే చూపులలో ఏదో ఆత్మీయత వున్నట్లనిపించింది భానుమతికి. ఎలాగో పార్టీ పూర్తయ్యేంతవరకూ భానుమతి గోపాలన్‌కు దూరంగా తిరిగింది. చివరకు వెళ్లిపోతూ కూడా గోపాలన్ ఆమె దగ్గరకు వచ్చి, "రేపు తప్పకుండా కలుసుకోవాలి. మర్చిపోవద్దు." అని చెప్పి మరీ వెళ్ళాడు. ఆ తరువాత భానుమతిని కారులో దిగబెట్టి రమ్మని డ్రైవరుతో చెప్పారు జగ్గారావు గారు. తనకు కొంచెం పనుందని బెనర్జీ కూడా కారెక్కి ముందు సీటులో డ్రైవరు ప్రక్కన కూర్చున్నాడు. భానుమతి వెనుక సీటులో కూచుంది. కారు కొంచెం దూరం పోగానే, బెనర్జీ భానుమతి వైపు తిరిగి, "చెల్లాయి, నేనొక సలహా ఇస్తాను కోపం తెచ్చుకోరు కదా?" అన్నాడు. అతనలా మాట్లాడి నందుకు భానుమతి ఆశ్చర్యపోయింది.

"ఏమిటది?" అని అడిగింది.

"మీ మేలుకోరి చెప్తున్నాను. గోపాలన్ లాంటి లుచ్చా, ప్రపంచంలో మరొకడు లేడు. వాడి వలలో మీరు పడవద్దు."

"అతనంటే మీకు చాలా కోపం లాగుంది."

"వాడొక పశువు. అసలా మాటకొస్తే దామోదరం కూడా అలాంటివాడే. వీళ్ళంతా మీకోసం ఒక పెద్ద వలపన్నారు. అందుకు మా డాడీ సహాయం పొందారు. ఈ విషయం నేనెందుకు చెప్తున్నానని మీరాశ్చర్య పోవచ్చు. నాకు మీ మీదెంతో గౌరవం కలిగింది కాబట్టి చెప్తున్నాను. మీరు చాలా జాగ్రత్తగా వుండాలి."

"సరే."

"అసలు కొన్నాళ్ళు మీరెవరికీ కన్పించకుండా

ఇక్కడికైనా వెళ్ళిపోతే మంచిదేమో." అన్నాడు.

"అలా వెళ్ళిపోయినంత మాత్రాన, జరుగబోయే ప్రమాదాలు తప్పుతాయంటే నేను నమ్మను. ధైర్యంగా వాటి నెదుర్కొనడమే నా వుద్దేశం."

"అలా అయితే మీరు చాలా అపాయస్థితిలో వున్నారు. దామోదరం, నయాన్నైనా, భయాన్నైనా మిమ్మల్ని లొంగదీసుకుని గోపాలన్ కిచ్చి పెళ్ళి చెయ్యాలని చూస్తున్నాడు."

"అది అంత సులభ సాధ్యం కాదు." అంది భానుమతి.

కారు రివ్వున పోతోంది. డ్రైవరు వీరి మాటలు విననట్లు నడుపుతున్నాడు. కొద్దిసేపు ఇద్దరూ మవునంగా ఆలోచించసాగారు. భానుమతి ఇంటి వద్ద కారాగింది. బెనర్జీ తను ముందు దిగి, వెనుక సీటు తలుపు తీసాడు. భానుమతి బయటకు వచ్చింది. ఆమె నుద్దేశించి, "ఏది ఏమైనా నేనెప్పుడూ మీకు ఏ అపాయం రాకుండా శ్రద్ధ తీసుకుంటాను." అన్నాడు.

"మీకు కృతజ్ఞురాల్ని."

బెనర్జీ కారెక్కాక కారు కదిలి పోయింది.

మరునాడు సాయంకాలం భానుమతి జగ్గారావు గారింటికి వెళ్ళేసరికి, గోపాలన్ ఆమెకోసం ఎదురు చూస్తున్నాడు. మాలతి అతనితో మాట్లాడుతోంది. భానుమతి రాగానే, అతనిలో ఎంతో ఆనందం కన్పించింది.

"మీకోసం ఇందాకటి నుంచి ఎదురు చూస్తున్నాము" అన్నాడు గోపాలన్.

"నే నెక్కువ ఆలస్యం చెయ్యలేదే." అంది భానుమతి కూర్చుంటూ. ఆమే, మాలతీ ఒక సోఫాలో కూచున్నారు. గోపాలన్ వారి కెదురుగా కూర్చున్నాడు.

"అప్ప నాకు మీగురించి చాలా కాలం క్రిందటే చెప్పారు. కాని నేను మీరింత అందమైన వారను కోలేదు. ఇప్పటికైనా మిమ్మల్ని చూడగల్గాను."

"ఇదేనా మీరు చెప్పదల్చుకున్న విషయం."

"అబ్బే. అదొక్కటే కాదు. మన వివాహం గురించి." అని మాలతి వైపు చూశాడు. మాలతి "మీరిద్దరూ మాట్లాడు తూండండి, ఇప్పుడే వస్తాను." అని లేచింది. వెంటనే భానుమతి ఆమె చెయ్యి పట్టుకుని, "కూర్చో." అని, "నాకు మీకన్నా పాత స్నేహితురాలు మాలతి. మీరేం చెప్పదల్చుకున్నా ఆమె నా కూడా వుండాలిసిందే." అంది. మాలతి చేసేదేమీ లేక కూచుంది. గోపాలన్ అయిష్టంగా చూశాడు గాని, భానుమతి తనతో ఒంటరిగా మాట్లాడటానికి ఇష్టపడటం లేదని గ్రహించాడు.

"స్వర్గీయులైన మీ నాన్నగారి కోరికమీద మా అప్ప ఈ వివాహం జరిపించాలని చూస్తున్నారు. నావుద్దేశంలో అది ఎంత త్వరగా జరిగితే అంత మంచిది." అని గోపాలన్ అన్నాడు. భానుమతికి మనసులో చిరాకు గలిగింది.

"అయ్యో. ఎంతసేపూ మా నాన్నగారి కోరిక అంటున్నారే, దానికి ఆధారంగాని, ఋజువుగాని ఏదైనా వుందా? అసలు మా నాన్నగారిని మీరెరుగుదురో లేదో కూడా నాకెలా తెలుస్తుంది?"

"అంటే మా మాటలు మీరు నమ్మరా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"నన్ను నమ్మేవరకు [illegible] టాను."

ఆమె మాటకు గోపాలన్ దిగ్భ్రాంతి చెందాడు. ఈ మాట అడుగుతుందని తను కలలోనైనా అనుకుని వుంటే ఎలా జవాబివ్వాలో ఆలోచించుకుని వుండేవాడు. కాని ఇప్పుడు తను చాలా ఇరుకున పడ్డాడు. ఆరుజువులూ, ఆధారాలూ తన తండ్రికి తెలుసునుగాని తనకు తెలియవు. అయినా తను ఆ విషయంలో ఆమె ముందు తెలివి తక్కువ వాడిలా వుండకూడదు. దామోదరం ఆ క్రితం రోజా రాత్రే హైదరాబాదు వెళ్ళిపోయాడు. మళ్ళీ మూడు నాలుగు రోజులలోగాని రాడు. అతను వెళ్ళేటప్పుడు గోపాలన్‌తో, పెళ్ళి పది రోజులలోగా జరిగి పోవాలని చెప్పాడు. ఈ పది రోజులూ గోపాలన్ విశాఖపట్టణంలో వుండి భానుమతిని దారిలోకి తీసుకురావాలి. తను మెల్లిగా కబుర్లతో ఆమెను లొంగదీద్దామని చూశాడు. కాని ఆమె అడిగినట్లు ఋజువు చూపించక పోతే పరిస్థితి పూర్తిగా ఎదురు తిరుగుతుంది. అందుకని వెంటనే ఏదో ఆలోచించాలి.

"మా మీద మీకు అనుమానం కలిగిందన్న మాట."

"ఇది నా జీవితానికి సంబంధించిన సమస్య. అందువలన విషయాన్ని పూర్తిగా తెలుసుకోదల్చటంలో తప్పేమీ లేదను కుంటాను."

"నేను మీకొక ఋజువు చూపించగలను కాని, అది ప్రస్తుతం ఇక్కడలేదు. రామవరంలో వుంది. అది చూస్తే మీరు తప్పక మా మాటలు విశ్వసిస్తారు."

"అయితే నేనది చూడ్డం చాలా అవసరం." అంది భానుమతి.

ఆమెలో, తనకు దూరంగా వుండాలనే భావం వున్నంతవరకూ తను ఆమెను లొంగదియ్యలేడు. ఆమెను లొంగదియ్యాలంటే తనయందామెకు విశ్వాసం కలగాలి. ఆ విశ్వాసం కలిగిననాడు తనంత తనే ఆమె తనకు దగ్గరగా వస్తుంది, తను కోరిన పని చేస్తుంది. ఆమె అందం చూస్తున్న కొద్దీ గోపాలన్‌కు మతి పోతోంది. ఆమెను త్వరలో పరిణయం కోసం, ఆమెను తన దానిగా చేసుకోవటం కోసం తను ఏ పనినైనా చేస్తాడు.

"రామవరం వెళ్ళి తీసుకు వస్తాను." అన్నాడు దృఢ నిశ్చయంతో.

"అలాగే. అయితే మళ్ళీ కలుసుకుందాం." అని లేచింది భానుమతి.

"నేను ఇప్పుడే వెళ్తాను."

"ఉహూ. మీరొక పని చెయ్యండి. రేపు మాలతి చేతి కిచ్చి పంపండి. నేను రేపు సాయంకాలం నా యింట్లోనే వుంటాను."

"నేనే తీసుకొచ్చి ఇస్తాను."

"అలాగే కాని మా యింటివద్ద ఈ విషయం మాట్లాడడానికి వీలుండదు. మీరు కేవలం అది నా చేతికిచ్చి వెళ్ళిపోవాలి. మనం తరువాత దాని విషయం మాట్లాడుదాం. ఇంతకీ అదేమిటి?"

"ఒక ఫోటో. ఒక వుత్తరం."

"అలా అయితే మంచిదే." అంది భానుమతి.

"కాని అది ఒకసారి మీరు చూసి వెంటనే ఇచ్చెయ్యాలి. ఎందుకంటే అవే కాక మా అప్ప దగ్గర చాలా కాగితాలు వున్నాయి. భవిష్యత్తులో మనకు వాటివల్ల చాలా ప్రయోజనం వుందని చాలా జాగ్రత్తగా చూడుతున్నారు."

"అందుకు నాకేమీ అభ్యంతరం లేదు. మీరు నాకవి ఒక చిన్నపెట్టెలోపెట్టి, ఇచ్చి వెళ్ళిపొండి. మరొక గంటలో మీకవి తీసుకువచ్చి అందజేస్తాను. మాయింట్లో ఈ విషయాలేమీ తెలియకూడదు."

"సరే. మీరవి చూసి నమ్మకం పొందితే మన వివాహానికి మీకేమీ అభ్యంతరం లేనట్లేనా?"

"అసలు ముందు నాలో వున్న అనుమానాలు పోగొట్టుకోనివ్వండి. వివాహం గురించి తొందర పడితే ప్రయోజనం ఏముంది?"

"మీరు చెప్పింది నిజమే." అన్నాడు గోపాలన్, ఆమెకు తనమీద నమ్మకం కలిగేవరకూ ఆమెను లొంగదియ్యడం అసాధ్యమని.

(సశేషం)



పంచాక్షరి

# వనితల వెనుకడుగు

"మగవాళ్ళు ముందడుగు వేస్తున్నారు!" అన్నారు శ్రీవారు, రాత్రిపదింటిలవేళ సినిమానుంచి తిరిగొచ్చి తన శ్రీమతితో. ఆ శ్రీమతి వూరుకోవచ్చుగా, ఉహూ! భర్తగారి మాటల్లోని నిందాలాపం విని వూరుకోలేక పోయింది.

'ఆ, నా బొందడుగు! స్త్రీలు పైకిరావటానికి ప్రయత్నించేకొద్దీ, పురుషులు మరోమెట్టు పైనే కూచుంటున్నారు. సినిమాల్లో, వ్యాపాల్లో తప్ప, మరెక్కడా కనిపించని ముందడుగు." అన్నది నోటి దురుసుతనంతో.

శ్రీ వారూరుకోవచ్చుగా! ఆయనా వూరుకోలేదు. పాపం, భర్తగారయితేనేం. "అమ్మమ్మ, అంతమాటనకు. విస్త్రయంగా మీరు ముందుకెళ్ళిపోతున్నారు. కావలిస్తే బస్సుల్లో చూడు. మేము 'క్యూ'లో అల్లాడుతూనే ఉంటాం, బస్సులు మటుకు మీతో నిండిపోతుంటాయి. ఈవిషయంలో కండక్టర్లు గూడా చాలా 'దయ'గా ఉంటున్నారు. అదిగాక వెనకటికిలా స్త్రీలు సందేహించటంలేదు. సరాసరి వచ్చిపురుషుల పక్కసీట్లు ఆక్రమించేస్తున్నారు. ఇది అభివృద్ధికాక మరేమిటి?!"

"మీరేం వ్యంగ్యంగా మాట్లాడక్కర్లేదు. పక్కసీట్లో కూచోక, నిలబడేఉండి బస్సు టర్నింగ్ తిరిగినప్పుడల్లా తూలిపడమంటారా ఏం?" శ్రీమతి తన సోదరీమణులను సపోర్టు చేస్తూ అన్నది.

"సరే, ఆవిషయం పోనీయ్......"

"ఏం, ఎందుకు పోనివ్వాలి? నిందగామాట్లాడటం మీవంతూ, దాన్నంతా మొయ్యడం మావంతూనా!?" అని తయ్యాలిగా అడగబోయి, బుద్ధిమంతుడిలా కూచున్న భర్తనుచూసి, నవ్వుకుంటూ ఆగిపోయింది శ్రీమతి.

"అదికాదోయ్, ఇవ్వాళ ఆసినిమాకెళ్ళానా, అంతా ఆడవాళ్ళే! అన్ని సీట్లూ ఆక్రమించి కూచున్నారు. సినిమానా, పేరంటమా అనిపించింది. అయినా ఆడవాళ్ళకు ఈసినిమాపిచ్చి మితిమీరి పోతున్నదిలే."

శ్రీవారి దాడికికారణం ఇప్పుడు తెలిసింది శ్రీమతికి. "ఏదోపాపం సీతమ్మవారు శోకించే చిత్రంగదాని అంత మందొచ్చుంటారు. అమాత్రానికే మీరు 'జనరల్ైజ్ చేయాలా? జేమ్సుబాండ్, అమెరికా రాత్రి, రష్యానిధి, ప్రపంచంలో తిమిరం, స్వర్గలోకంలోమాలోకం, కుస్తీపట్ల సినిమాలు, ఇవన్నీ ఎవరి వల్ల బతుకుతున్నాయో!"

"సరేలే! ఆకలవుతున్నది పద!" వాగ్యుద్ధం ముగిస్తూ అన్నారు శ్రీవారు. కాని శ్రీమతి మనసులో మటుకు ఆలోచనలు మెదులుతూనే ఉన్నాయి—

ఇలాంటి వాదన ఏ భార్యాభర్తలమధ్యనైనా జరగొచ్చు. కాని ఈపైన చెప్పిన సంభాషణ మటుకు మామధ్యే జరిగింది.

"ఆడవాళ్ళు మగవాళ్ళకంటే సినిమాలను ఎక్కువగా చూడటానికి ఇష్టపడతారంటారు. నిజమేనా?" అన్న ప్రశ్నకు జవాబు 'అవున'నే ఇవ్వాల్సి ఉంటుంది. స్త్రీకి వ్యాపకాలు తక్కువ. పురుషునికిమల్లే, క్లబ్బులకో, స్త్రీలు, వివిధ రకాలైన క్రీడలలో పాల్గొనే యువతులూ, ఎక్కువసంఖ్యలో కన్పించరు. కారణం, మన సాంఘిక కట్టుబాట్లే. మన సమాజంలో తరతరాల్నుంచి మనల్నంటిపెట్టుకొని ఉన్న కట్టుబాట్లు, పురుషులకిచ్చినంత స్వేచ్ఛను స్త్రీల కివ్వలేదు. దీని వల్ల, ప్రపంచం విశాలమైనా, స్త్రీ సంచరించాల్సిన లోకం మటుకు అతిచిన్నదై పోయింది. పురుషులతో బాటు అన్నిరంగాలలోనూ ముందడుగు వేస్తున్న స్త్రీలు, బాగా అభివృద్ధిచెందిన నగరాలలో, అభివృద్ధి భావాలు కల్గిన కుటుంబాలలో మాత్రమే కన్పిస్తారు గానీ, సమాజంలో ఎక్కువశాతమైన మధ్య తరగతి కుటుంబాలలో కన్పించరు. రోజంతా శారీరక శ్రమ చేసే స్త్రీ, తనకున్న పరిమితులలోనే మానసికోల్లాసాన్ని చేకూర్చుకోటానికి ప్రయత్నిస్తుంది. స్త్రీకి, ఈ ప్రయత్నంలో బాగా దోహదం చేస్తున్నవి, ప్రస్తుతకాలంలో సినిమాలు అని చెప్పక తప్పదు.

స్త్రీ మనసు సున్నితవిషయాలకుగూడా అతిసున్నితంగా చలించిపోతుంది. అలాంటి సున్నిత దృశ్యాలు చలన చిత్రాలలో చూసినప్పుడల్లా, స్త్రీ ఓ విధమైన ఆనందానుభూతిని పొందుతుంది. ఓ మంచి పాటవిన్నా, ఓ చక్కటి దృశ్యం చూసినా, పురుషునికంటే, స్త్రీ హృదయంలో హెచ్చు కదలిక, తృప్తి కలుగుతాయి. అందుకనే స్త్రీ, ఆ మానసిక సంతృప్తికోసం ఎక్కువగా సినిమాలుచూడాలని ఇష్టపడుతుంది. వెనుకటి రోజుల్లో ఈవిధమైన సంతృప్తిని, వీధినాటకాలు, యక్షగానాలు, మొదలైనవి కల్గించేవి. కానీ అప్పుడూ, ఇప్పుడూకూడా, తమ మనోగత వాంఛను నెరవేర్చుకోనటానికి స్త్రీలకుగల అవకాశాలుపరిమితం.

భర్త ఆఫీసుకెళ్ళిన సమయంలో, పగటి ఆటలకు వెళ్ళగలిగే తెగువ,చాలాకొద్దిమంది స్త్రీలలోమాత్రమే కన్పిస్తుంది. మొదటి ఆటకు వెళ్ళి భర్తసేవకు దూరమవటం, రెండవ ఆటకు వెళ్ళి నిద్రకు దూరమవడం, స్త్రీచెయ్యలేదు. అదిగాక, అనుకున్నప్పుడల్లా సినిమాలకు వెళ్ళి, అందరిచేతా ప్రేలెత్తి చూపబడటం, అసలే భరించలేదు. ఇన్ని కారణాలవల్లనే, స్త్రీ, తనకు మానసిక విశ్రాంతిని ప్రసాదించే చలనచిత్రాలను, కావలసినప్పుడల్లా చూడటానికి నిలుతేక పోతున్నది.

సినిమాలు చూడాలనే కోరిక, వనితలకు ఎక్కువే. కానీ వూహాలు వేరూ, వాస్తవం వేరూ! వాస్తవానికి, అనుకున్నప్పుడల్లా సినిమాలకు వెళ్ళగలగటంలో, పురుషులకంటే, వనితలది వెనుకడుగనే చెప్పాలి.

# మనోవ్యాకులతా సంకేతాలు

మానసికంగా బలహీనంగా ఉన్నవాళ్ళు వాళ్ళ సమస్యల్ని వెంటనే ఒప్పుకోరు, ఒకరి సహాయాన్ని ఆపేక్షించరు. ఒకవిధంగా చూస్తే, సహజమైన మానసిక బలహీనత కంటే ఈ సహాయాన్ని అర్థించలేని దుర్బలత్వం మరింత చెడ్డది. దీనికి నిజంగా వారికి సహాయం కావలసి ఉంటుంది. ప్రత్యేకంగా వారికి సహాయం కావాలని వాళ్ళు అడగరు కాని, తెలిసీ తెలియనట్లు తమ తమ కోర్కెల్ని వ్యక్తపరుస్తూ వుంటారు.

ఇది పిల్లల్లో అయితే సులభంగా గుర్తించవచ్చు. చిన్న చిన్న దొంగతనాలు, బళ్ళో తోటిపిల్లలతో అంటీ అంటనట్టు తిరగడం, దెబ్బలాడడం, ఇలాంటి వాటివల్ల పిల్లల మనస్తత్వం ఇట్టే బయటపడి పోతుంది. మరికొన్ని లక్షణాలున్నాయి. అవి చాలా చమత్కారంగా వుంటాయి. అనుభవమున్న వాళ్ళకు గాని అవి అవగతం కావు. 'తోటకూర నాటి'.... కథలా కొన్ని కొన్ని కొంప మునిగిన తర్వాతగాని గమనించడానికి వీల్లేకుండా ఉంటాయి.

అందరూ గుర్తించుకోతగిన కొన్ని ప్రాథమిక సంకేతాలు:

1. రోజువారీ ప్రవర్తనలో మార్పు —అర్భకుడుగా పుప్పొడు ఒక్క సారి అరిందాగా మారిపోవచ్చు. మితభాషి వాగుడు కాయగా మారొచ్చు. అంత వరకు సంతోషభావంతో చక్కగా వ్యవహరించేవాడు, మందకొడిగా ఏకాంతవాసం చేయవచ్చు.

2. రూపురేఖలు చక్కదిద్దుకోవడంపై ఆసక్తి చూపకపోవడం, వ్యక్తిగతమైన అలవాట్లమీద అభిరుచి లేకపోవడం, అజాగ్రత్త.

3 చేతులోవున్న పనిమీద ధ్యాస నిమగ్నత లేకపోవడం, చపలచిత్తం.

4 మహోద్రేకుడుగా కనిపించడం.

ఆడవాళ్ళలోను, మగవాళ్ళలోను, ఇటువంటి లక్షణాలు ప్రతినిత్యమూ మార్పుల్ని సంతరించు కొంటూ ఉంటాయి.

ఉదాహరణకు మీ భర్త, ఆఫీసులో ఓనాట్లు తిరిగి ముఖం మాడ్చుకొని ఇంటికి వచ్చి కస్సుబుస్సు మన్నారను కోండి, వెంటనే అతన్ని మానసిక వైద్యుడి దగ్గరికి బట్వాడా చేయాలనుకుంటే అది పొరపాటు. రోజూ ఇదే సమస్య మీకు ఎదురైనట్లయితే, అతనిలో తప్పకుండా ఏదో లోపమున్నట్టే లెక్క.

మనోవ్యథకు గురవుతున్నట్టు మీకు తెలియవచ్చును. ఎవరైనా తోడు వుంటేనే బాగుంటుంది అని మీ కనిపించవచ్చు. అలా అనిపించిందీ అంటే మీకు సహాయం కావాలనే అర్థం. అలాంటి 'అనుభవ'డాన్ని ఉపేక్షించకుండా, ఎవరి సహాయమైనా అర్థించడం మంచిది. మీ డాక్టరు సలహా కూడా తీసుకోవడం మరి పోకండి

ఎటువంటి సమస్యా పరిష్కారానికయినా సహాయం లభించకుండా ఉండదు. జాప్యంచేసి, లేదా ఉపేక్షతో సమస్య పెరగనిచ్చి, మనోవేదనకూ అశ్రద్ధ చేయకూడదు.

—ఇన్‌ఫో

చదువుల్లో మొనగాడు
ఆటల్లో మొనగాడు
పెరిగి పెద్దవాడౌతున్నాడు

**అతడి సైకిలు ఫిలిప్స్**

ఫిలిప్స్ దిట్టంగా ఉంటుంది ఎంత చెడ తొక్కినా తట్టుకొనేటట్టు మంచి ట్రూ టెంపరు స్టీలుతో తయారైంది. దాని అంద చందాలు గంభీరత కూడా మీ సంస్కృతిని బాగా తెలియజేస్తాయి. మీవంటి యువకులకు తయారుచేయబడిన విశిష్టమైన బైసికిలు.

ఫిలిప్స్ మీరు వాడదగిన సైకిల్







® ఫిలిప్స్

సీరియల్

# రామశాస్త్రి

వి.ఎస్.సుక్తాంకర్

## 11

జరిగినకథ: రామశాస్త్రి ప్రఖ్యాతి మరాఠా సామ్రాజ్యానికి ప్రధాన న్యాయమూర్తి. నిరుపేద కుటుంబంలో జన్మించి గొప్ప పండితుడని పేరు తెచ్చుకుని ఈ పదవిని అలంకరించిన ఆయన ప్రభావం వల్ల పేష్వా మాధవరావ్ ఎన్నో సంస్కరణలు తీసుకు వస్తాడు. రామశాస్త్రి పెంచిన శ్యామా అనే బాలికపిల్లా, ఆమె భర్త చంపాజీ పేష్వా కుటుంబానికి సన్నిహిత సేవక వర్గంలో ఒక జంట అవుతారు. మాధవరావ్ మరణం తర్వాత నారాయణరావ్ పేష్వా అవుతాడు. నారాయణరావ్‌ని రఘోబా హత్య చేయిస్తాడు. హత్యా ప్రయత్నంలో జరిగిన యుద్ధంలో చంపాజీ తీవ్రమయిన గాయాలకి లోనయినప్పటికీ శ్యామాతో హంతకులు తమ శ్రేయస్సుకోసం రహస్యంగా దాచిన రఘోబా ఆజ్ఞాపత్రం రామశాస్త్రికి దొరికే ఏర్పాట్లు చెయ్యమని ఉద్బోధిస్తాడు. శత్రువులకి చిక్కిన రాజభవనం నుంచి ఎలా బయటికి వెళ్ళాలో శ్యామాకి చెప్తాడు. భర్త పరిస్థితి ప్రమాదంగా ఉన్నప్పటికీ స్వామి భక్తిని మరువరాదని అతను బోధించటం చేత శ్యామా అతని ఆజ్ఞని శిరసావహిస్తుంది.

అశ్వశాలలో మామూలు రక్షకభటదళం కూడా లేదు. శ్యామా ఒక గుర్రానికి జీనువేసి ధైర్యంగా రాజభవనద్వారం వైపు స్వారీ చేసుకుంటూ వెళ్ళిపోయింది. "ఆనంద్- రఘో! అనే మాటలు బాగా పనిచేశాయి. ఈమె ఎవరో కుట్రలో ముఖ్యమయిన వ్యక్తి అయివుండవచ్చునని వూహించిన కాపలావాళ్ళు అడ్డు పెట్టలేదు. శ్యామా రాజభవనం బయట పడింది.

* * *

పది రోజులు గడిచాయి. ఆనాడు స్మశానంలో తమ పేష్వా అంత్యక్రియలని చూసిపోదామని ఎందరో పోగయ్యారు. 'తిలాంజలి' క్రియలు జరిపించటానికి పూనానుంచి ఐదవయిమంది పురోహితులు వచ్చారు. వారందరూ మంచి పండితులు. కర్మకాండ క్షుణ్ణంగా ఎరిగినవారు. కాని, చివరికి పిండాలని వేసినప్పుడు కాకులు వచ్చి వాటిని ముట్టుకోనేలేదు! తమ మంత్ర పఠనంలో ఏదో లోపం ఉందేమోనని బ్రాహ్మణులు వాటిని తిరిగి చదివినా చెట్లమీద ఉన్న కాకులలో ఒకటి కూడా వాటి దగ్గరికి రాలేదు.

"పేష్వావారి ఆత్మకి సంతృప్తి కలగలేదన్నమాట!"

"ఇదేమి వింత!" —

"ఇంకా కొంతసేపు ఆగి చూద్దాము!"—

అందరూ పరిపరి విధాల అనుకున్నారు. సూర్యుడు పైకి ఎక్కేకొద్దీ ఆ ప్రదేశంలో ఎండ తీక్షణం అధికం అయిందేకాని కాకులు పిండాలని భక్షించలేదు. సాయంకాలం కూడా కావచ్చింది కాని కాకులు ముందుకి రాలేదు.

"కాకులు తినేముందు వెళ్ళిపోతే మహాపాపం!"

"మన పేష్వావారిని రక్షించ కోలేని పాపం కన్నానా!"

"ఇంత ఘోరమయిన హత్య జరుగుతుందని తెలిసే మనమంతా ఏమి చెయ్యగలిగాము?"—

అక్కడ పోగయిన వారిలో అధికులు తమని మొదటి నుంచీ బాధించిన ఆలోచనలని బయట పెట్టారు. ఇక కేవలం మర్యాద కోసం వచ్చినవారు 'ఈపని ముగిస్తే రేపు కొత్త పేష్వా అధిష్ఠానానికి సంబంధించిన పనులు చాలా ఉన్నాయి, వాటిని చూసుకోవాలి కదా?' అని విసుక్కున్నారు.

"ఈ కాకులు పిండాన్ని స్పృశించేట్లు కనిపించవు! పిండాలని స్వీకరించమని పితరులని ప్రార్థించాలి.... దానికి తగిన మార్గాలు ఉన్నాయి....." అని ఒకర్ని సూచించారు.

మరాఠా సామ్రాజ్యం ముఖ్యమంత్రి నానా ఫర్నవీస్ ఈ సూచనని వెంటనే ఆమోదించాడు.

"ప్రభూ! నారాయణరావ్ సాహెబ్!" అన్నాడు విచారంతో బరువయిన గొంతుకతో. "మీ సతీమణి గంగాబాయి సాహెబ్‌వారు 'శనివార్‌వాడా'లో ఇక ఉండలేమన్నారు. ఈ విషయమయి తమరు చింతించకండి— ఈ సామ్రాజ్యానికి ముఖ్యమంత్రిగా వారికి మరొక భవనం నిర్మించి అందులో సురక్షితమయిన నివాసం ఏర్పరిచే బాధ్యతనాది".

అందరూ ఆత్రంగా కాకులవైపు చూశారు. ఈ ప్రతిజ్ఞ కూడా వాటిని కదిలించినట్లు లేదు.

"ప్రభూ! గంగాబాయిసాహెబ్‌వారికి జన్మించబోయే శిశువుకి తగిన జాగీర్ వచ్చేట్లు చూసే బాధ్యత ఈ తమ భృత్యుడిది. నా మాట నమ్మండి!" ఈసారి సఖారామ్‌బాపూ ప్రార్థించాడు. అతని ప్రార్థన సయితం దుష్ఫలితం అయింది.

మరాఠా సామ్రాజ్య సేనాధిపతి హరిపంత్‌ఫడ్కే ఇలా అన్నాడు: "ప్రభూ, నా ఈ ఖడ్గం తమరి ప్రాణాల్ని కాపాడలేక పోయింది! కాని, ఇక మీద అప్రమత్తుడనయి గంగాబాయిసాహెబ్‌గారి కీగాని ఆమెకి జన్మించబోయే శిశువుకిగాని హానిరాకుండా చూసే బాధ్యత నేను స్వీకరిస్తున్నాను. నా మాట నమ్మండి!" కాకులు కదలలేదు. సూర్యుడు కూడా అస్తమించే వేళ అవుతోంది.

"ఇక రామశాస్త్రిగారే ఈ సమస్య పరిష్కరించాలి!" అన్నారు ఎవరో. వెంటనే ఇతరులు దానిని ఆమోదించారు.

"ప్రధాన న్యాయమూర్తే మనకొక మార్గం చూపించాలి!" అనే మాటలు అక్కడ ప్రతిధ్వనించాయి. పెద్దలందరూ ఒక మూల నుంచుని ఉన్న రామశాస్త్రిని కాకులు పిండాన్ని స్వీకరించేట్లు చెయ్యమని అర్థించారు.

రామశాస్త్రి మౌనంగా ముందుకి వచ్చి, అంజలి ఘటించి, దుఃఖంతో గద్గదమయిన కంఠంతో ఇలా ప్రార్థించాడు: "ప్రభూ! ఈ భృత్యుడి ప్రార్థన ఆలకించు! మేమందరం ఈ మరాఠా రాజ్యసేవకులమే! ఈ ఘోరమయిన నేరానికి కారణభూతులయిన వారెవరో తెలుసుకుని శిక్షించేదాకా వూరుకోనని మీకు తెలుసు! ఇదే నా ప్రతిజ్ఞ!"

రామశాస్త్రి ఈ మాటలు అన్నాడో లేదో రెక్కల రెపరెపలతో చెట్ల మీది కాకులు నేల మీదకు ఎగిరి వచ్చివాలాయి. త్వరలోనే పిండాలని భక్షించటం ప్రారంభించాయి.

"ఆహా! రామశాస్త్రిగారి వాక్శుద్ధికి ఇది మరొక నిదర్శనం!"—

"పేష్వావారి ఆత్మ ఇక శాంతిస్తుంది!"— అనుకున్నారు అందరూ. అందరి హృదయాలూ తేలికపడ్డాయి— ఒక్క రామశాస్త్రి తప్ప. తన ప్రతిజ్ఞ నెరవేర్చే బాధ్యత అతని హృదయంలో ఒక పెద్ద బరువుగా నిల్చిపోయింది.

పెద్దలు ఒక్కొక్కరూ తమ తమ పల్లకీలు ఎక్కి వెళ్ళిపోయారు, రామశాస్త్రి ఒకడే కాలినడక మీద ఇంటికి వెళ్ళటానికి ఉద్యుక్తుడయ్యాడు. అప్పటికే సంధ్య వేళ అయింది. కాగడా పట్టుకుని వున్న ఒక సేవకుడు మాత్రం దారి చూపించటానికి ముందు నడచి వెళ్ళగా రామశాస్త్రి అతన్ని అనుసరించాడు.

'రఘోబా ఈ హత్యకి కారకుడని అందరికీ తెలుసు....... కాని రుజువు చెయ్యటం ఎలా?.... ఈ పది రోజులుగా చేసిన ప్రయత్నాలన్నీ విఫల

మయ్యాయే?.......' ఇటువంటి ఆలోచనలు అతని తలలో ముసురుకున్నాయి. పరధ్యాన్నంగా నడుస్తున్న అతను తనవైపుకి పరిగెత్తుకు వస్తున్న ఒక స్త్రీ ఆకారాన్ని గమనించనే లేదు.

"అర్జీ! ఈ దీనురాలి అర్జీని మరాఠా ప్రధాన న్యాయమూర్తి వినాలి!" అంటూ ఆమె తన పాదాల మీద పడటంతో ఉలిక్కిపడ్డాడు. ఆశ్చర్యానికి తోడు మరొక ఆశ్చర్యం, ఆ స్త్రీ ఎవరో కాదు శ్యామా!

చంఫాజీ చెప్పినట్లే శ్యామా జోహార్‌సింగ్‌ని అనుసరించి ఘర్డీల రహస్య స్థలాన్ని కనుక్కుంది. కాని భర్త చెప్పిన మాటదాటి నేరుగా రామ్‌శాస్త్రి వద్దకి వెళ్లేబదులు చంఫాజీ ఎలా ఉన్నాడో చూడటానికి తిరిగి రాజభవనం వైపు వెళ్లింది. రాజభవన ద్వారం ప్రవేశించగానే తులాజీ ఆమెని పట్టుకుని ఒక కారాగృహంలో పడవేశాడు. 'ఈమె ఈ భవనం బయటికి ఎలా వెళ్లింది, ఎందుకు తిరిగి వచ్చింది?' అనే సందేహం అతన్ని పీడించింది. కాని శ్యామా అతని సందేహం తీర్చలేదు. ఎంత ప్రశ్నించినా అసలు సంగతి బయట పెట్టలేదు.

కారాగృహంలో శ్యామా పరిస్థితి అతి దీనం అయిపోయింది. తను చంఫాజీ కర్మలు చేయించలేక పోయింది! అతని ప్రధానాదేశాన్ని పాటించలేపోయింది. ఘర్డీల రహస్య స్థలం తెలిసికూడా రామ్‌శాస్త్రికి చెప్పలేక పోతున్నది! ఈ కారాగృహం నుంచి బయట పడటం తనకి సాధ్యమయిన పని కాదు. కోట బురుజు ఒకదాని కింద కట్టిన ఆ గది కిటికీలోనుంచి చూస్తే కింద ఎక్కడో కనిపించే కందకం చాలా లోతయినది.........

ఇలా ఆలోచిస్తూ కుమిలిపోతూ వున్న శ్యామాకి ఆనాడు మెల్లిగా కదులుతూ వెడుతున్న కాగడా కాంతిలో ఒక సుపరిచిత స్వరూపం కనిపించింది. అది రామ్‌శాస్త్రి, సందేహం లేదు! ముందు వెనుకలు ఆలోచించకుండా శ్యామా కిటికీలో నుంచి కందకంలోకి దూకింది. ఎలాగో దానిని ఈది రక్షకభటుల కంట పడకుండా అవతలగట్టు చేరింది. ఇటువంటి సాహస కృత్యాన్ని వారు కూడా ఎదురుచూడలేరు. కేవలం ఒక స్త్రీ, అని కారాగృహ పరిసరాలని అంత జాగ్రత్తగా కాపలా కాయలేదు. క్షణాలలో వచ్చి రామ్‌శాస్త్రి పాదాల మీద వాలింది.

"శ్యామా! నువ్వామ్మా! ఎక్కడినుంచి వచ్చావిలా? ఏమిటి నీ అర్జీ? చెప్పు!" అన్నాడు రామ్‌శాస్త్రి.

శ్యామా వెక్కివెక్కి ఏడుస్తూ తన కథంతా చెప్పింది. తను రాజభవనం కందకాన్ని ఎలా దాటి వచ్చిందో చెప్తూవుండగా పెద్ద డెక్కల శబ్దంతో అక్కడికి ఒక అశ్వదళం వచ్చింది. అది రాత్రిపూట నగారి చుట్టూ తిరిగే రక్షకదళాలలో ఒకటి. రామ్‌శాస్త్రిని చూడగానే కొత్వాల్ గుర్రం దిగి వచ్చి నమస్కరించాడు.

"మేము చెయ్యగలిగిన దేమయినా వుంటే సెలవిప్పించండి!" అన్నాడు వినయంగా.

సాధారణంగా రామ్‌శాస్త్రి ఆజ్ఞ ఏమీలేదని చిరునవ్వుతో అతన్ని సాగనంపేవాడే కాని ఈసారి మాత్రం ఒక క్షణం నిరుత్తరుడయి నిలిచాడు. తర్వాత నిదానంగా అన్నాడు: "కొత్వాల్, పది సంవత్సరాలుగా ఎప్పుడు కలిసినా నన్నీవిధంగా అభిమానంతో ఏమి చెయ్యగలనని అడుగుతూ వచ్చారు



మీరు! ఒకసారయినా మిమ్మల్ని, ఇది చెయ్యమని నేను కోరలేదు. కాని ఈనాడు మిమ్మల్ని ఒక పెద్ద కోరిక కోరుతున్నాను. ప్రధాన న్యాయమూర్తిగా నేను మిమ్మల్ని కోరేది ఇదే! రేపు నేను ఈ పదవిలో వుంటానో ఉండనో చెప్పలేను....... కొత్వాల్ సాహెబ్! రాజసేవకుడిగా నీ కర్తవ్యం నెరవేర్చుకొనమని అర్థిస్తున్నాను."

"సెలవివ్వండి!" అన్నాడు కొత్వాల్ ఉత్సాహంతో.

"నాకు రెండు అశ్వాలు అవసరం! ఇద్దరు అశ్వికులని దింపి వారి గుర్రాలని నాకు ఇప్పించండి!"

కొత్వాల్ వెంటనే రెండు గుర్రాలని రామ్‌శాస్త్రికి ఇప్పించాడు.

రామ్‌శాస్త్రి శ్యామాని ఒక గుర్రాన్ని ఎక్కమని, తనూ అశ్వారూఢు డయ్యాడు. "కొత్వాల్ సాహెబ్ మనమంతా ఇప్పుడు ఈ అమ్మాయి ఎక్కడికి తీసుకు వెడతే అక్కడికి వెళ్తాం!" అన్నాడు.

* * *

గంటలో అశ్వికదళం ఘర్డీల రహస్య స్థలం చేరుకుంది. ఘర్డీలు వారితో కలియబడ్డారు. కాని కొత్వాల్ దళం ధాటికి ఆగలేక లొంగిపోయారు. ఆ తర్వాత జోహార్‌సింగ్ దాచిన రఘోబా ఆజ్ఞాపత్రం వెతకటానికి ఎంతో సేపు పట్టలేదు.

(సశేషం)

# అందని అపేక్ష

## —పెనుమర్తి మూర్తి—

ప్రకాశరావు ఆఫీసు పని తొందరగా పూర్తి చేసుకుని అయిదు గంటలకే ఇంటికి వచ్చేశాడు. ఆరోజు సాయంత్రం ఆరు గంటలకి రవీంద్ర భారతిలో ఉస్తాద్ బిస్మిల్లాఖాన్ సన్నాయి ప్రోగ్రామ్ వుంది. తను రెండు టిక్కెట్లు తీసికున్నాడు. ఇటువంటి ప్రోగ్రామ్స్ అంటె శోభ చెవి కోసు కుంటుంది. అందుకనే ఈ రోజు శోభను తీసి కెళ్లడం కోసం ఆఫీసు పని తొందరగా పూర్తి చేసుకుని ఇంటికి చేరుకున్నాడు.

"శోభా! తొందరగా తయారవు. ఇవ్వాళ రవీంద్ర భారతిలో నీ ఫేవరేట్ బిస్మిల్లాఖాన్ ప్రోగ్రామ్ వుంది. టిక్కెట్లు కూడ తీసికున్నాను" అంటూ ఇంట్లోకి అడుగు పెడ్తూనే శోభని తొందర పెట్టాడు.

ఏదో పుస్తకం చదువుకుంటున్న శోభ ఒకసారి తలెత్తి ప్రకాశరావు వంక చూసి మళ్ళీ పుస్తకంలో మునిగిపోయింది. బిస్మిల్లాఖాన్ పేరు వింటూనే ఎగిరి గంతేస్తుందనుకున్న ప్రకాశరావుకి ఆశాభంగం కలిగింది.

"శోభా! తొందరగా తయారవు, టైమయి పోతోంది" అన్నాడు మళ్ళీ.

"నేను రాలేను. మీరు వెళ్ళిరండి." శోభ తల ఎత్తకుండానే సమాధానం చెప్పింది.

ప్రకాశరావు ఆశ్చర్యపోయాడు. "అదేమిటి శోభా! నువ్వొస్తావని రెండు టిక్కెట్లు తీసికున్నాను. ఆఫీసులో అర్జంటు పని వున్నా విడిచిపెట్టి వచ్చే శాను."

"నాకు తలనొప్పిగా ఉందండి. నే రాలేను, మీరు వెళ్ళిరండి."

ప్రకాశరావుకి కొద్దిగా కోపం వచ్చింది. "శోభా! నే నేదైనా ప్రోగ్రామ్ వేసిన రోజే నీకు తలనొప్పి వస్తున్నది. నాతో రావడం నీ కిష్టం లేకపోతే చెప్పెయ్యి. ఈ కుంటి సాకు లెందుకూ?"

శోభ తలెత్తి చురుగ్గా చూసింది. "సరిగ్గా నాకు తలనొప్పి వచ్చినప్పుడే మీరు ప్రోగ్రామ్ వేసుకుంటా రాయను, నేనేం చెయ్యను! కుంటి సాకులు, గుడ్డి సాకులు చెప్పే అగత్యం నాకేంలేదు" అంది కఠినంగా. ఆ కంఠంలో మార్దవం అన్నది ఏకోశానా లేదు.

"ఇంతకీ ఇవ్వాళ వస్తావా? రావా?"

"రాలేనని చెప్పాగా! కావాలంటె మీరు వెళ్ళిరండి."

"రానని చెప్పరాదూ!..సరే! నువ్వు రాకపోతే నేనూ వెళ్ళను."

"అదేమిటి! నాతో మీకు పంతేమిటి! మీరు వెళ్ళండి."

ప్రకాశరావు శూన్యంగా నవ్వాడు. "ఇప్పుడు నాకూ వెళ్ళాలని లేదు. అది కాకుండా హఠాత్తుగా నాకూ తలనొప్పి వచ్చింది" అంటూ చేతిలో వున్న రెండు టిక్కెట్లని నాలుగు ముక్కలు చేశాడు. ఆ నాలుగు ముక్కల్ని ఎనిమిదిగాను, ఆ ఎనిమిది పదహారుగాను చించేసి కిటికీలో నించి అవతల పారేశాడు.

శోభ ప్రకాశరావు ముఖంలోకి చూసింది. ప్రకాశ రావు ముఖం అటు తిప్పుకున్నాడు. "మంచిది. మీకూ తలనొప్పి వచ్చిందన్న మాట. అమృతాంజనం ఇంత రాసుకుని రెస్ట్ తీసికోండి. అదే తగ్గిపోతుంది" అంటూ శోభ తన పుస్తకం తీసికొని లోపలి గదిలోకి వెళ్ళిపోయింది.

తనకి వేలకి వేలు కట్నాలు ఇస్తామంటూ ఎంతో మంది వచ్చినా, తను అన్ని సంబంధాలు త్రోసి పుచ్చాడు. కట్నం మీద తనకి దృష్టి ఎప్పుడూ లేదు. తను కోరుకున్నదల్లా రూపవతి, విద్యావతి అయిన భార్య. తన మనస్సు కనిపెట్టి ప్రవర్తించే ఇల్లాలు. తన ఆదర్శాలతో ఏకీభవించి తనకు చేదోడు వాదో డుగా వుండే అర్ధాంగి. అటువంటి భార్య కోసం తను ఎన్నిరోజులేనాసరే ఆగాలని సంకల్పించు కున్నారు.

పెండ్లికి పూర్వం శోభతో ఆరు నెలల పరిచయం వుంది. మొదటిసారి చూసినప్పుడే శోభ మీద పెద్ద అభిప్రాయం ఏర్పడింది. తరువాత కొద్దిరోజుల్లోనే శోభ తన అభిప్రాయం తప్పు కాదని నిరూపించింది. ఇన్నాళ్ళ నించి కలలు గన్న ఆశయం సిద్ధించినట్లు కనపడింది. శోభలో తను కోరుకున్న గుణాలన్నీ కనపడ్డాయి.

అందుచేతే తన తల్లితండ్రులు ఈ సంబంధంకి విముఖత చూపించినా తను పట్టుపట్టి శోభనే చేసుకున్నాడు.

కాని పెండ్లికి పూర్వం శోభకి, పెండ్లి తరువాత శోభకి ఎక్కడా పోలిక లేకుండాపోయింది. ఎంతో హుషారుగా వుండే శోభ ఎప్పుడు చూసినా నిర్లిప్తతగా వుండడం మొదలెట్టింది. పూర్వపు చలాకీతనం ఎక్కడా లేకుండాపోయింది. తనంటే ఎంతో గౌరవం, ప్రేమ చూపించిన శోభ ఈ రోజు తనంటె గౌరవం లేకపోవడం, సరిగ్గా సమాధానమైనా ఇవ్వకపోవడం వంటి పనులు చేస్తున్నది.

ప్రకాశరావుకి కోపం ముంచుకొచ్చింది. కాని ఏమీ చెయ్యలేక సోఫాలో కూలబడ్డాడు.

ప్రకాశరావుకి ఎంత ఆలోచించినా శోభ విషయం అంతుపట్టటం లేదు. కావాలని పట్టుపట్టి శోభను చేసుకున్నాడు. పెండ్లికి ముందరి శోభ ఎంతో హుషారుగా లేడి పిల్లలా వుండేది. శోభ వలన తనకి సర్వసౌఖ్యాలు లభిస్తాయను కున్నాడు. తమదెంతో ఆదర్శ దాంపత్యం అవుతుందనుకున్నాడు.

కొత్తగా కాపరం పెట్టిన రోజుల్లో తన స్నేహి తులు తమిద్దరినీ వాళ్ళ ఇళ్ళకు ఆహ్వానించారు. వాళ్ళ భార్యలతో పరిచయం అయితే శోభకి కొంత కాల క్షేపం అవుతుందనే ఉద్దేశంతో తను వెడ్దామన్నాడు. కాని శోభ రానని నిక్కచ్చిగా చెప్పింది. తను ఎంత బతిమాలినా లాభం లేకపోయింది.

శోభ ఈ విధంగా ఎందుకుంటున్నదో ఎంత ఆలోచించినా అంతు చిక్కటంలేదు. ఏదో మనస్సులో పెట్టుకుని బాధపడుతున్నట్లుంది. తను ఎన్నిసార్లు అడిగినా ఏమీ లేదంటూ సమాధానం చెప్తున్నది. పోనీ తనవల్ల ఏదేనా లోపం జరిగిందా అంటె అట్లాంటి దానికి ఆస్కారం లేదని తనకి బాగా తెలుసు. శోభకి తను ఎప్పుడూ అడ్డు చెప్పలేదు. శోభ మనస్సు ఎక్కడ గాయపడుతుందో అని తను ఎంతో మెళకువతో ప్రవర్తిస్తూ వస్తున్నాడు. ఒక్కొక్కప్పుడు పట్టరాని కోపం వచ్చినా, మరు క్షణమే దాన్ని దిగమ్రింగుకుంటూ వచ్చాడు. కాని శోభలో మాత్రం మార్పు లేదు.

ప్రకాశరావుకి ఆలోచించిన కొద్దీ అగాధంలా కనపడుతున్నది. ఇహ తను చెయ్యవలసింది ఏమీ లేదనుకున్నాడు. హఠాత్తుగా మారిన శోభ, మళ్లీ హఠాత్తుగానే మారి మునుపటి శోభ అవాలి కాని తను మార్పు తీసుకురావటం అన్నది అసంభవం అనుకున్నాడు.

అప్పటి నించి ఎక్కడికీ రమ్మనమని అడగడం మానేశాడు. అడిగితే ఏం సమాధానం వస్తుందో తెలుసు. అడిగి కాదని పించుకోడం కంటె, అడగ కుండా ఉండడమే మంచిదను కున్నాడు.

ప్రకాశరావు సంసారం ఒక యంత్రంగా నడవడం మొదలెట్టింది. సరదాగా ఒక సినిమా లేదు, ఒక షికారు లేదు. ఇద్దరి మధ్య మాటలు కూడ చాలా తక్కువయి పోయాయి. ఎంతో అవసరం వుంటె తప్ప ఒకరిని ఇంకొకరు పలకరించటం లేదు.

ఒక విషయం మాత్రం ప్రకాశరావుని మరీ కృంగదీసింది. రామారావు ప్రకాశరావుకి ముఖ్య స్నేహితుడు. ఒకరోజు హఠాత్తుగా ఆఫీసుకి వచ్చి ప్రకాశరావుకి ఒక శుభలేఖ ఇచ్చాడు. తీరా చూస్తే అది రామారావు పెండ్లి శుభలేఖ! ప్రకాశరావు ఆశ్చర్యపోయాడు.

"అరేయ్! ప్రకాశం! అట్లా ఆశ్చర్యపోతావేం రా! పెళ్ళి నాడే నువ్వు, నీ మిసెస్ తప్పక రావాలి. నువ్వు రాకపోయావంటె అసలు పెళ్ళే చేసుకోను జాగ్రత్త" అన్నాడు రామారావు నవ్వుతూ. ప్రకాశరావు వస్తానని వాగ్దానం చేసేటంతవరకు అక్కడినించి కదలలేదు.

ప్రకాశరావు ఆరోజు సాయంత్రం ఇంటికి వెళ్ళిన తరువాత శోభతో చెప్పాడు. "శోభా. రామం పెండ్లికి మనిద్దరం వెళ్ళక తప్పదు. వాడు మరీమరీ చెప్పాడు. వచ్చేవారంలోనే పెండ్లి."

"కట్నం ఏమాత్రంట?" శోభ ప్రశ్నించింది.

"పదివేలు."

"అదృష్టవంతుడు."

"అవును మరి. అందరూ నాకు మల్లే ఉంటారా." నవ్వుతూ అన్నాడు ప్రకాశరావు.

శోభ చురుగ్గా చూసింది. "అందరూ మీలా వుంటె ఈపాటికి లోకం భగ్గుమని మండిపోయేది" అంది కటువుగా.

ప్రకాశరావు నిర్ఘాంతపోయాడు. తను అన్న దాంట్లో శోభకి అంత కోపం తెప్పించిన విషయ మేమిటో ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. ఒకవేళ తను కట్నం లేకుండా చేసుకుని ఇప్పుడు దెప్పుతున్నా ననుకుంటున్నదేమో! నిజానికి తనకి ఆ ఉద్దేశం లేనేలేదు. తను కట్నం తీసుకోలేదని ఎప్పుడూ విచారించలేదు. అసలు కట్నాలు అంటేనే తనకి అమితమైన విముఖభావం. ఆ భావం ఇప్పటికీ పోలేదు. తను ఇప్పుడు అన్న మాటలు ఏదో సరదాగా నవ్వు లాటకి అన్నవే గాని ఏ దురుద్దేశంతోనూ అన్నవి కావు. కాని శోభ ఇంకో విధంగా తలచింది.

శోభ తనని అర్థం చేసుకోటంల్లేదు అనుకున్నాడు ప్రకాశరావు. చివ్వరికి రామారావు పెండ్లికి ప్రకాశ రావు ఒక్కడే వెళ్ళి రావలసి వచ్చింది. 'నీ మిసెస్ రాలేదే'మని రామారావు అడిగినప్పుడు 'ఆమెకి ఒంట్లో బాగా లేదు. రాలేకపోయినందుకు ఏమీ అనుకోవద్దని

కూడ నీకు చెప్పమంది' అంటూ తనో అబద్ధం కూడ ఆడవలసి వచ్చింది.

శోభకి కూడ ఏవేవో ఆలోచనలతో తల బ్రద్దలయి పోతోంది. తనలోని అశాంతి నానాటికి పెరిగి పోతోంది కాని తగ్గటం లేదు. ఎంత సరిపెట్టుకుందామన్నా సరిపెట్టుకోలేక పోతోంది. గతాన్ని మరచిపోయి ప్రకాశరావుని సుఖపెట్టి తను సుఖపడ్డాం అనుకున్న మరుక్షణంలోనే మనస్సు కల్లోలం అయిపోతున్నది. ఎంత ప్రయత్నించినా ప్రకాశరావుని క్షమించలేక పోతోంది.

తన వివాహం ప్రకాశరావుతో స్థిరపడిందని తెలుసుకుని ఎంతేనా ఆనందించింది. అటువంటి ఉన్నతాదర్శాలు కలవాడు తనకి భర్తగా లభించడం తన పూర్వజన్మ ఫలం అనుకుంది. ప్రకాశరావుతో ఏర్పడ్డ ఆరునెలల పరిచయంలోనే అతనం టె పెద్ద అభిప్రాయం ఏర్పడింది. అతని ఆదర్శాలు, ఆశయాలు చూసి తనెంతో సంతోష పడింది. ముఖ్యంగ ఈ వరకట్నాలు మీద అతని కున్న ఏహ్యాభావం చూసి తనెంతగానో మెచ్చుకుంది. "శోభాదేవీ! ఈ దేశం బాగు పడాలంటె ముఖ్యంగా ఈ వరకట్నం అనేది రూపు మాసి పోవాలి. చదువుకున్న వాళ్ళు కూడ సిగ్గు, లజ్జ విడిచి డబ్బుకి కక్కుర్తి పడి ఆడపిల్లల తండ్రుల అసహాయత ఆసరాగా తీసికొని వచ్చినంత కట్నం గుంజడం ఎంతేనా గోచనీయం. కట్నం తీసికున్న వాడు మనిషికాదు, గాడిదతో సమానం. ఈ వెధవ తీసికున్న కట్నం వీడి దగ్గర ఒక సంవత్సరం కంటె ఎట్లాగా నిలవదు. కాని ఈ కట్నం ఇవ్వడం వల్ల ఒక్కొక్క పిల్ల తండ్రి జీవితాంతం కష్ట పడ్తాడు. ఆ విషయం తెలిసుండి కూడ ఈ వెధవ కట్నం తీసికుంటున్నాడంటె వాడిని మనిషిగా జమ కట్టడం మహాపరాధం. వాడి కివ్వవలసిన స్థానం గాడిదల వెనక. గాడిదల కంటె కూడ హీనం కాబట్టి గాడిదలతో కూడ పోల్చకూడదు. వాటి వెనకే వీడి స్థానం" అంటూ అతను చెప్తున్నపుడు తనెంతో ఆశ్చర్యపోయింది. ఎం. ఎ. ప్యాసయి, నెలకి ఏడు వందలు సంపాదిస్తున్న మనిషి ఇట్లా అంటూంటె తన కెంతేనా ఆశ్చర్యం వేసింది. ప్రకాశరావుని భర్తగా పొందే స్త్రీ చాలా అదృష్టవంతు రాలనుకుంది. ఆ అదృష్టం తననే వరించేటప్పటికి తన ఆనందం వర్ణనాతీతం అయింది.

కాని.....కాని....

అనుకున్న దేమిటి! జరిగిందేమిటి!

ఎంతో గొప్ప వాడనుకున్న ఈయన చేసిన పనేమిటి!!

ఈయన చెప్పిన ఆదర్శాలు, ఆశయాలు ఈయన విషయంలో ఏమయ్యాయి?

పైకి వకటి చెప్పి లోపల ఇంకోటి చేసేటంత దిగజారిపోయిన వ్యక్తి అని తెలుసుకునేటప్పటికి తన మనస్సు ఎంత క్షోభ పడింది!

ఇన్ని నీరంగనీతులు చెప్పిన ఈయన తన తండ్రి వద్ద అయిదు వేలు కట్నం తీసికున్నాడు. తన తండ్రి ఆర్థిక పరిస్థితి తెలిసుండి, తన తండ్రికి అయిదు వేలు ఇచ్చే స్థోమత లేదని తెలుసుకుని కూడ అయిదు వేలు నిక్కచ్చిగా పుచ్చుకున్న ఈ మనిషిని ఏమనాలి? ఈయన చెప్పిన ప్రకారమే ఈయన కివ్వవలసిన స్థానం గాడిదల వెనుక కాదా??

తన తండ్రి ఈ కట్నం డబ్బు కోసం శంకరం గారికి ప్రోనోటు రాసి అయిదువేలు అప్పుతీసికున్నాడు. తన తండ్రి ఆ అప్పు తీర్చాలంటె మాటలా! ఆయన జీవితంలో జరిగే పనేనా! ఛీ! ఛీ! ముందరే ఈ విషయం తెలిసి వుంటె తను చచ్చినా ఈయన్ని చేసుకునేది కాదు. వివాహం అయిపోయిన తరువాతగాని తనకి తెలియలేదు. కనీసం తన తండ్రయినా చెప్పలేదు. తనకి తెలిసేటప్పటికి అంతా అయిపోయింది.

ఇటువంటి ఆలోచనలతో శోభ హృదయం బద్దలై పోతోంది. అశాంతి అంత కంతకీ పెరిగి పోయి శోభని నిలువెల్లా దహించి వేస్తున్నది. ఆ ఇంట్లో ఉండటి మంటె నిప్పుల్లో ఉన్నట్లుగా భావిస్తున్నది. ప్రకాశరావు ఎప్పుడేనా తనని దగ్గరగా తీసుకోబోతే అతని రెండు చేతులు రెండు నాగు బాములుగా వూహించుకుని గిలగిల్లాడి పోయేది. ప్రకాశరావుకి సాధ్యమైనంత దూరంగా ఉండాలనుకునేది.

చివ్వరికి ఒక నిర్ణయాని కొచ్చింది శోభ. కొన్నాళ్ళపాటేనా తన పుట్టింటికి వెళ్ళి వుంటె తనలోని అశాంతి కొంత తగ్గవచ్చునుకుంది.

ఆ మరునాడు పొద్దున్న ప్రకాశరావు దగ్గరకి వచ్చి "ఒకసారి మావాళ్ళ దగ్గరకి వెళ్ళి వద్దామని వుంది" అంది శోభ.

ఏదో పుస్తకం చదువుతూ కూర్చున్న ప్రకాశరావు తలెత్తి చూశాడు. శోభ ముఖం అటు త్రిప్పుకుని వుంది. "నేనూ అదే అనుకుంటున్నాను శోభా! ఏమిటో అదోలా వుంటున్నావు ఈమధ్య. కొన్నాళ్ళ పాటు మీ ఇంటికి వెళ్ళి వుంటె నీకూ కొంత మనశ్శాంతిగా ఉంటుంది. ఎన్నిరోజు లుంటావు?"

"ఓ రెండు నెలలు" ముఖం త్రిప్పకుండానే సమాధానం ఇచ్చింది శోభ.



"మంచిది. నీకు తోచినట్లు చెయ్యి. ఎప్పుడు వెడ్దామను కుంటున్నావు?"

"రేపు"

"రేపే!"

శోభ సమాధానం చెప్పలేదు. ముఖం కూడ ఇటు త్రిప్పలేదు.

కొద్దిక్షణాలు వుండి ప్రకాశరావే మళ్ళీ అన్నాడు. "వచ్చే వారంలో వెళ్ళరాదూ! ఈ వెలాఖరులో నా దగ్గర డబ్బు కూడ ఎక్కువగా లేదు. ఇప్పు

తారీకు తరువాతయితే ఓ రెండొందలు తీసుకుని వెళ్ళవచ్చు."

శోభకి ఎంతేనా అసహ్యం వేసింది. 'అయిదు వేలు కట్నం తీసికున్నాడు. ఇంట్లో ఖరీదైన సామాను ఒక్కటి లేదు. తనకి చేయించిన నగలు నాణ్యాలు అసలే లేవు. డబ్బు లేదుట!! ఛీ! కక్కుర్తి మనుష్యులు! డబ్బు కోసం మనుష్యులు! సర్వం డబ్బే అనుకునే హీనులు !'

కాని తన ఏహ్యభావం పైకి కనపడనీయలేదు శోభ. "అవసరం లేదు లెండి. వెళ్ళడానికి నా దగ్గర వుంది." అంది ముభావంగా.

"మంచిదయితే. ఫస్టు తారీకు తరువాత ఓ రెండొంధలు పంపిస్తాను. వెళ్ళిరా."

ఆ మర్నాడే శోభ తన పుట్టింటికి వెళ్ళింది. హఠాత్తుగా వచ్చిన కూతురుని చూసి శోభ తండ్రి ప్రభాకరరావు గారు ఆశ్చర్యపోయారు. "అదేమిటే అమ్మాయ్! కనీసం ఉత్తరం ముక్కైనా రాయకుండా వచ్చావ్!" అన్నారు కూతురు వంక ఆశ్చర్యంగా చూస్తూ.

"ముందర అనుకోలేదు నాన్నా" అంటూ ముభావంగా సమాధానం చెప్పి ఇంట్లోకి వెళ్ళిపోయింది శోభ.

శోభ ఇంత హఠాత్తుగా రావడం, శోభ ముభావం, నిర్లిప్తత చూసి 'ఒకవేళ కూతురు, అల్లుడు పోట్లాడుకున్నారేమో' అనుకున్నాడు ప్రభాకరరావు గారు. కాని ఆ విషయం కూతురుని అడిగితే ప్రయోజనం ఉండదని ఆయనకి తెలుసు. ఓ రెండు రోజులు అగుతే అసలు విషయ మేమిటో తెలుస్తుంది లెమ్మని అనుకున్నారు. అందుకని ఆ ప్రసక్తి తీసుకురాలేదు.

వారంరోజులు గడిచాయి. శోభ ఎంతో ముభావంగా వుంటూ వస్తున్నది. ఎంతో హుషారుగా వుండే శోభ ఇంత నిర్లిప్తతగా ఎందుకుంటున్నదో ఎవ్వరికీ అర్థం కాలేదు. ఎవ్వరి తోటి సరిగ్గా మాట్లాడటం లేదు. ఈ వారం రోజుల్లో ఒక్కసారి కూడ ఇల్లు విడిచి బయటికి వెళ్ళలేదు. ఒక్క స్నేహితు

# అందని ఆపేక్ష

రాల్ని కూడ కలుసుకోలేదు. ఎప్పుడు చూసినా ఏదో ఆలోచిస్తున్నట్లు వుండేది. ఏదో దిగులు, నిర్లిప్తత! ప్రభాకరరావుగారు ఒకసారి అడిగి చూసేరు, కాని శోభ దగ్గర నించి సమాధానం లేదు.

ఎనిమిది రోజున ముందర గదిలో ఏదో పత్రిక చూస్తూ కూర్చుంది శోభ. "ఏమమ్మా! శోభా! బాగున్నావా?" అంటూ పలకరించాడు, అప్పుడే ప్రవేశించిన శంకరంగారు.

"బాగానే ఉన్నానండీ" అంటూ సమాధానం చెప్పింది శోభ.

"మీ ఆయన కులాసాయేనా?"

"ఆ"

"మీ ఆయన చాలా ఉత్తముడమ్మా. నువ్వు చాలా అదృష్టవంతు రాలివి."

శోభ నవ్వి వూరుకుంది. కాని మనస్సులో మాత్రం అగ్నిపర్వతం భగ్గుమంది. 'హు! ఉత్తముడట! ఉత్తముడు!! చక్కటి మాటలు చెప్పి ఎదటి వాళ్ళని నేర్పుగా వంచించే మోసగాడు! అసలు విషయాలు బయటి వాళ్ళకేం తెలుస్తాయి' అనుకుంది మనస్సులో.

శంకరంగారి కంఠం విని ప్రభాకరరావుగారు లోపలి నించి వచ్చారు. "ఎంత సేపయింది వచ్చి శంకరం?" అంటూ ప్రశ్నించారు.

"ఇప్పుడేనోయ్. ఇవ్వాళే మీ అల్లుడు దగ్గరనించి నాలుగు వందలు మనియార్డరు వచ్చింది. దీంతో ఈ నోటు బాకీ పూర్తిగా తీరిపోయింది. వడ్డీ ఏమీ వద్దు అని చెప్పినా వినకుండా నీ అల్లుడు వడ్డీతో సహా లెక్కకట్టి పంపాడయ్యా. నిజంగా అటువంటి మనిషిని అల్లుడుగా పొందడం నీ అదృష్టం" అంటూ ప్రోనోటుని ప్రభాకరరావు గారికి ఇచ్చేసి వెళ్ళిపోయాడు శంకరం గారు.

శోభకి ఇదేమీ అర్థం కాలేదు. "మీ అల్లుడు డబ్బు పంపడం ఏమిటి నాన్నా?" అంటూ అడిగింది తండ్రిని.

"అదేనమ్మా! ఈ నోటు తాలూకుడబ్బు, ఆఖరి ఇన్‌స్టాల్‌మెంటు మీ ఆయన పంపించాడుట. దానితో అప్పు పూర్తిగా తీరిపోయింది. శంకరం నోటు తిరిగి ఇచ్చేశాడు."

శోభకి అంతా అయోమయంగా వుంది. "నాకేం అర్థం కాలేదు నాన్నా! ఆయన డబ్బు పంపారా?"

ప్రభాకరరావు గారు ఆశ్చర్యంగా చూశారు. "అదేమిటమ్మాయ్! ప్రతినెలా పంపిస్తున్నాడుగా. ఏడాది పైనించి ప్రతినెలా మూడు వందలకి తక్కువ లేకుండా పంపిస్తున్నాడు. నీకు తెలియనే తెలియదా!"

ఈ సారి ఆశ్చర్యపడటం శోభ వంతయింది. "నువ్వు చెప్పే దేమిటో అర్థం కావటం లేదు నాన్నా! ఆయనెందుకు పంపిస్తున్నారు? నోటు రాసింది నువ్వు కదా! ఆయన పంపడం ఏమిటి? నాకేం అర్థం కావటం లేదు, విషయ మేమిటో విపులంగా చెప్పు నాన్నా!"

తండ్రీ కూతుళ్ళు ఒకళ్ళని మించి ఇంకొకళ్ళు ఆశ్చర్యంలో మునిగిపోయారు. ప్రభాకరరావుగారు కూతురి వంకే చూస్తూ "అయితే మీ ఆయన డబ్బు పంపుతున్నట్లు నీకు ఇన్నాళ్ళ నించి తెలియనే తెలియదా! మీ ఆయన నీ కెప్పుడూ చెప్పలేదూ!" అన్నాడు.

"నేను అడగలేదు. వారు చెప్పలేదు. ఆ ప్రస్తావనే ఎప్పుడూ రాలేదు."

ప్రభాకరరావుగారు నమ్మలేనట్లు చూశారు. "అయితే ఈ వ్యవహారం నీకేం తెలియదన్నమాట!"

"నాకేమీ తెలియదు నాన్నా! అసలు విషయ మేమిటో త్వరగా చెప్పు."

"ఇన్నాళ్ళ నించి నీకు తెలుసను కుంటున్నానమ్మా! నీకు అస్సలు తెలియదం టే చాలా ఆశ్చర్యంగా ఉంది!" ప్రభాకరరావుగారు ఇంకా ఆశ్చర్యంలో నించి తేరుకోలేదు.

"అసలు విషయం చెప్పు నాన్నా" శోభ హృదయంలో చెప్పలేని ఆందోళన ప్రారంభమయింది.

ప్రభాకరరావుగారు జరిగిన విషయమంతా చెప్పడం మొదలెట్టారు. "మీ ఆయన చాలా ఉత్తముడమ్మా! అటువంటి మనిషిని నేనెక్కడా చూడలేదు. అతనికి కట్నాలు తీసికోడమంటే చాలా అసహ్యం అన్న విషయం నీకు తెలుసుగా. నిన్ను చేసుకోడానికి అతను ఒప్పుకున్నాడని తెలుసుకుని చాలా సంతోషించాను. కాని అతని తల్లిగారు ఒక షరతు పెట్టారు. 'మా వాడు మీ అమ్మాయిని చేసుకోడానికి సంతోష పడుతున్నాడు. మాకూ అభ్యంతరం లేదు. కాబట్టి కట్నం ఓ అయిదు వేలు ఇవ్వండి. అసలు మా వాడికి ఇరవై వేలు ఇస్తామని వస్తున్నారు. కాని మావాడు మీ అమ్మాయినే చేసుకోవాలని ఆత్రుత పడుతున్నాడు కాబట్టి ఓ అయిదు వేలు ఇవ్వండి చాలు. అయిదు వేలు చాలా తక్కువే అనుకోండి. కాని ఏదో మా వాడు ఏరికోరి చేసుకుంటానంటున్నాడు కాబట్టి అయిదు వేలు ఇవ్వండి' అంది.

నా గుండెల్లో రాయి పడింది. అయిదు వేలు వాళ్ళకి లెక్కలోకి రాకపోవచ్చు గాని నాబోటి వాడికి అయిదు వేలంటె మాటలా!

అందుకని నా పరిస్థితి పూర్తిగా విడమర్చి చెప్పాను. అయిదు వేలు ఇవ్వలేనన్నాను. కాని మీ అత్తగారు



ఒప్పుకోలేదు. 'అయిదు వేలైనా లేకపోతే ఎట్లా! మా పరువు ఉండాలా! అయిదు వేలకి ఒక్క పైసా తగ్గితే లాభంలేదు' అంటూ నిక్కచ్చిగా చెప్పింది. నాకేం చెయ్యాలో అర్థం కాలేదు. అయిదు వేలు ఎక్కడ నించి తేగలను? తెచ్చినా మళ్ళీ ఎట్లా తీర్చ గలను?

ఈ సంబంధం వదులుకోడం తప్ప గత్యంతరం లేదనుకున్నాను.

మరునాడు మీ ఆయన స్వయంగా వచ్చాడు. ముందర ఎందుకొచ్చాడో తెలియలేదు. 'అట్లా పోదాం రండని' చెప్పి నన్ను బయటికి తీసికెళ్ళాడు. ఇద్దరం పార్కులో కూర్చున్నాం. అక్కడ అసలు విషయం చెప్పాడు. 'చూడండి. మా వాళ్ళు అయిదు వేలు కట్నం అడిగారుట. ఆ విషయం రాత్రి తెలిసింది. నాకు కట్నం తీసికోడం ఏమాత్రం ఇష్టం లేదు. కాని మా అమ్మ చాలా పట్టుదల మనిషి. ఏదో పూర్వకాలంది. అయిదు వేలైనా తీసికోకపోతే ఏదో పరువు తక్కువ అనుకుంటున్నది. నేను మీ అమ్మాయిని చేసుకోడానికే నిశ్చయించుకున్నాను. అవసరం అయితే మా వాళ్ళని ఎదర్చగలను కూడ. కాని అనవసరంగా తల్లికొడుకుల మధ్య మనస్పర్థలు రావడం నాకిష్టం లేదు. కొడుకుగా తల్లిని సంతృప్తి పరచడం కూడ నా విధి కదా! కాబట్టి దయచేసి నేను చెప్పినట్లు చెయ్యండి.'

'శంకరంగారు మీకు తెలుసుగా. ఆయన దగ్గర కెళ్ళి నోటు రాసి అయిదు వేలు అప్పుగా తీసికోండి. అది కట్నంగా మా వాళ్ళకి ఇవ్వండి. కాని ఆ అప్పు మీరు తీర్చవలసిన పనిలేదు. నాకు ఏడు వందలు జీతం వస్తుంది. మా ఇంటికి డబ్బు పంపవలసిన పని కూడ లేదు. నా జీతంలోంచి శంకరం గారికి ప్రతినెలా మూడునాలుగు వందలు పంపిస్తూ వుంటాను. ఆ అయిదువేలు తీరేంత వరకు పంపిస్తాను. దయచేసి మరో విధంగా అనుకోకుండా ఇట్లా చెయ్యండి' అన్నాడు.

నా కెంతేని ఆశ్చర్యం వేసింది. ఏం చెప్పాలో అర్థం కాలేదు. మాట్లాడకుండా ఆలోచిస్తూ కూర్చున్నాను.

నేను మాట్లాడకపోవడం చూసి మీ ఆయన నా చేతులు పుచ్చుకుని బ్రతిమాలడం మొదలెట్టాడు. 'చూడండి. పెండ్లి చేసుకుంటే మీ అమ్మాయినే చేసుకోడానికి నిర్ణయించుకున్నాను. నాకు కావలసినవన్ని మీ అమ్మాయిలో కనపడ్డాయి. మీ అమ్మాయిని చేసుకోలేకపోతే ఇక నేను పెండ్లే చేసుకోనేమో! కనీసం నా కోసమైనా ఈ విధంగా చెయ్యండి' అన్నారు.

అతను అట్లా చేతులు పుచ్చుకుని బ్రతిమాలుతూ వుంటె నా కెంతేని సిగ్గేసింది. బ్రతిమాలవలసిన వాడిని నేనే బ్రతిమాలించుకుంటున్నానని నా మీద నాకే అసహ్యం వేసింది.

కాని మరుక్షణంలోనే నాకో అనుమానం వేసింది. శంకరంగారు అయిదువేలు ఎట్లా ఇస్తారు! ఏం చూసి ఇస్తారు? ఆ విషయమే చెప్పాను.

'మీ కా భయం అక్కరలేదు. మీరు రేపు ఆయన దగ్గర కెళ్ళండి. ఆయన అయిదు వేలు ఇస్తారు. అవి తీసుకుని మా ఇంటికి వచ్చి కట్నం డబ్బు ముందరే ఇస్తున్నానని చెప్పి మావాళ్ళ కిచ్చి సంబంధం ఖాయం చేసుకుని వెళ్ళండి' అన్నాడు మీ ఆయన.

నేను ఒప్పుకోక తప్పలేదు. మరునాడు శంకరం గారి దగ్గర కెళ్ళాను. నన్ను చూస్తూనే ఆయన 'రండి' అంటూ ఆహ్వానించి లోపలకి తీసికెళ్ళాడు. 'ప్రకాశరావు మీ అల్లుడు అవడం నిజంగా మీ అదృష్టం. అతనంత ఉత్తముడు ఇంకోడు లేడు' అంటూ అయిదు వేలు నా చేతిలో పెట్టాడు. ఆయనకి నోటు రాసి ఇచ్చాను.

మీ వివాహం జయప్రదంగా జరిగిపోయింది. అప్పట్నుగానే మీ ఆయన ప్రతినెలా మూడునాలుగు వందలు పంపుతూ వచ్చాడు. ఈ నెలతో ఆ బాకీ పూర్తిగా తీరిపోయింది. అందుకనే శంకరంగారు నోటుని తిరిగి ఇచ్చేశారు.

కాని నాకు చాలా ఆశ్చర్యంగా ఉందమ్మాయ్! నీకు అల్లుడు చెప్పకే లేదా? ఈ విషయం నీకు ఇంతవరకు తెలియదా?''

విషయమంతా విన్న శోభకి నెత్తిన పిడుగు పడినట్లయింది.

* * *

ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చున్న ప్రకాశరావు తలుపు చప్పుడవగానే వెళ్ళి తలుపు తీశాడు.

ఎదురుగా శోభ నిలబడి వుంది!

''వచ్చావా శోభా!'' అన్నాడు ఎంతో సంతోషంగా.




"సుచీ"

"సుచీ!" సారథి మళ్ళీ పిలిచాడు.

"ఊ..."

"నిద్రపోయావా?"

"ఊహూఁ" కళ్ళు తెరవకుండానే బద్ధకంగా పలికింది సుచిత్ర.

"ఏమిటో చెప్పండి" సారథి మళ్ళీ మౌనంగా ఉండిపోయేసరికి సుచిత్ర అడిగింది.

"విశ్వం వస్తున్నాడు రేపు" సారథి మెల్లిగా అన్నాడు.

విశ్వం! ఒక్కక్షణం సుచిత్ర హృదయం వివశంగా కొట్టుకుంది. ఎందుకు వస్తున్నాడు! ఏం జరుగుతుంది? నిద్రమత్తు వీడిపోయింది. అందమయిన నేత్రాలు ఒకసారి అల్లల్లాడి విశాలంగా తెరుచుకున్నాయి.

తల ప్రక్కకి తిరిగింది. సారథి తలక్రింద చేతులు పెట్టుకుని మందంగా వెలుగుతున్న నీలిరంగు బల్బుకేసి చూస్తున్నాడు.

ఒకక్షణం భర్త ముఖంలోకి చూసింది సుచిత్ర.

"టెలిగ్రాం యిచ్చాడు" సారథి అన్నాడు.

మాట్లాడకుండా దిండుమీదికి వాలింది.

"నీకు ముందుగా వస్తున్నానని ఉత్తరం వ్రాయలేదా?"

సుచిత్ర అస్పష్టంగా చూసింది. ఇన్నాళ్ళుగా విశ్వం తనకి ఉత్తరాలు వ్రాస్తున్నట్లుగా ఆ మాట అనేశాడేమిటి? తనకి తెలియని విషయమా? ఎందుకో ఒక మూల విన్నంగా బాధ కలిగింది. జవాబు చెప్పాలని కూడా అనిపించలేదు.

"సాయంకాలం రేపు త్వరగా వస్తాను. తయారుగా ఉంటే స్టేషనుకి వెళ్దాం" సారథి అన్నాడు.

"నేను రాను" సుచిత్ర దిండులో ముఖం దాచుకుంది.

సారథి మాట్లాడలేదు.

సుచిత్ర మనసు అల్లకల్లోలమయిపోయింది. "విశ్వం వస్తున్నాడు! మనసు పదేపదే స్మరిస్తోంది. తనని నమ్ముతాడా? ప్రశాంతంగా నడిచిపోతున్న జీవితంలో మళ్ళీ తుఫాను చెలరేగుతుందా?

సుచిత్ర వణికిపోయింది. తను ఎవరినుంచి దూరంగా పారిపోవాలనుకుందో వారే తనకి అతి సమీపంగా వస్తున్నాడు. విశ్వాన్ని చూసిన తరువాత తన మనోనిశ్చలత దృఢంగా నిలబడగలదా? అసంభవం! హృదయపు లోతులను అన్వేషించే ఆ కళ్ళలోని ఆకర్షణని తను భరించలేదు. తను వివాహిత. తనువు, మనసు కూడా వేరొకరికి అర్పితమయిపోయాయి. కాదు! తను స్వయంగా సమర్పించింది.

"సుచీ!"

ఏమిటన్నట్లుగా చూసింది.

"నిన్నొక విషయం అడగనా? యేమీ అనుకోకూడదు!"

"అడగండి" కొంచెం ఆశ్చర్యంగా అంది సుచిత్ర.

ఒక క్షణం ఆగాడు సారథి.

"ఈమూడేళ్ళలోను విశ్వంని మరచిపోగలిగావా?" ఎక్కడో చూస్తూ అడిగాడు.

సుచిత్ర ఉలిక్కిపడింది. 'ఏమిటీ ప్రశ్న! ఏం జవాబు చెప్పాలి?' మనసు ఆలోచించే శక్తిని కోల్పోయింది.

"చెప్పు సుచీ!"

"ఏమో, నేను చెప్పలేను." అనాలోచితంగా అనేసింది. ఈనాటివరకూ సారథి తన నీ విషయం ఎప్పుడూ అడగలేదు. గతం ఎప్పుడూ తమ మధ్య అడ్డుగా నిలవలేదు. యిప్పుడెందుకు కదిలినట్టు? విశ్వం రాకుండానే తుఫానుకి సూచనయింది! సారథి మనసులో యేముంది?' సుచిత్రకి భయం వేసింది.

"సుచీ!" భార్య భుజాలుపట్టి దగ్గరకు లాక్కున్నాడు సారథి.

సుచిత్ర కనులు క్రిందకి వాలిపోయాయి.

"నీ మనసులో నా ప్రతిబింబం చెరిగిపోలేదు సుచీ!" సారథి ముఖం విచారంగా మారిపోయింది.

ఒక క్షణం సుచిత్రకి మతిపోయింది. ఏమని మాట్లాడాలో తోచలేదు.

ప్రక్కమీద లేచి కూర్చుంది. సారథి తన మనసూ విన్నాడా?!! కనులలో నీరు నిండింది.

"నీకు నా తరఫున ఏదైనా కోరిక ఉందా?" భార్య అంది.

సారధి ముఖం ప్రక్కకి త్రిప్పుకున్నాడు.

"సుచీ! నిన్ను వివాహం చేసుకోడంలో నా స్వార్ధం యేమయినా ఉందా?" మెల్లిగా అడిగాడు.

"మనిద్దరు సంవత్సరాలు నాతో కలిసి సంసారం చేసిన తరువాత కలిగిందా మీ కీ అనుమానం."

బాధతో మిళితమయిన కోపంతో ప్రశ్నించింది సుచిత్ర.

సారధి మౌనంగా ఉండిపోయాడు.

అతని మనసులో బాధ వెంటనే అర్ధమయింది సుచిత్రకి. ఈ పాటు అంతకి ముందుట్లోనే త్రుంచి వెయ్యాలని మనసు హెచ్చరించింది.

"వినండి. విశ్వం ఒకప్పుడు నాకు ఆత్మీయుడే. ఇందులో నేను ప్రపంచానికి కాని, మీకుగాని దాచిన విషయమేమీ లేదు. కాని నా మనస్ఫూర్తిగా వాంఛించి విశ్వానికి దూరమయ్యాను. నా జీవితం మీతో ముడిపడింది. అది నా అదృష్టమని ఈనాటికీ అనుకుంటున్నాను. మన సంసారంలో ప్రశాంతతను నా మనసులో అనుకుని కోపం ఏ మాత్రం ఎరగలేదు." సుచిత్ర ఒకసారి ఆగింది.

"విశ్వం మీకేమిటంగా స్నేహితుడో, నాకూ అంతే. అంతకుమించి మరేమీ లేదు. మీ మనస్సులో యేదో ఉంచుకుని బాధపడవద్దు. ఇలాగనాన్ని వదలండి."

సుచిత్ర సారధి మొహం తన వైపుగా త్రిప్పుకుంది.

"ఈ ప్రవర్తనలో మీకేమయినా లోపం కనిపించిందా?"

"ఛ! అటువంటి దేమీలేదు సుచీ!" భార్య ఒడిలో ముఖం దాచుకున్నాడు సారధి. ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు చాలా సేపు.

"సుచీ! నిన్ను వివాహం చేసికోడంలో ఏదో త్యాగం చేసానని నే నెప్పుడూ అనుకోలేదు. నిజానికి అందులో నిన్ను మనసులో ప్రతిష్ఠించుకోవాలనే స్వార్ధమే ఎక్కువ. కాని నీవు నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించటంలేదని అనుకుంటూ ఉంటాను. అది నా బలహీనతకి నిదర్శనమేమో! కాని నిజంగా నీవు నన్ను నీ మనసులో దాచుకోకపోతే నేను జీవించలేను సుచీ! నీవు నాకు పూర్తిగా కావాలి." సారధి ఆవేశంగా అన్నాడు.

"సార్థా" సుచిత్ర భర్త హృదయంలో ఒదిగిపోయింది.

"ఆ నిరీ భరించలేను. విశ్వాన్ని యింటికి తీసికొని రావద్దు. ఏదో చెప్పి పంపించివెయ్యండి. సుచిత్ర వెళ్ళిపొమ్మంది అనయినా చెప్పండి." సుచిత్ర వెక్కి వెక్కి ఏడ్చేసింది.

"నా పిచ్చితనంతో నిన్ను మరింత బాధ పెడుతున్నాను. అంతా మరచిపో సుచీ!" సారధి ప్రేమగా భార్య కనులు తుడిచాడు.

*   *   *

జనతా ఎక్స్‌ప్రెస్ ముందుకి నడుస్తోంది. కాలం వెనక్కి తిరుగుతోంది. విశ్వం ఆలోచనలు ఉన్న చోటనే సుడిగుండాలుగా తిరుగుతున్నాయి.

'సుచిత్ర ఎందుకిలాగ చేసింది? ఎందుకు తొందర పడింది? ఒక సంవత్సరం ఆగివుంటే స్వప్నం వాస్తవికతలో ఎదురుగా నిలిచేది కనుక ముందు; తనమీద ప్రేమపోయిందా? తను తను ఊరికి వెళ్ళేముందు ఆఖరిసారిగా అన్న మాటలు అసత్యమేనా?

"బావా! నీకోసం రెండు సంవత్సరాలు కాదు. యుగాలయినా నిరీక్షిస్తా" నని అన్న సుచిత్ర మనసు ఎలాగ మార్చుకుంది?

ఒక సంవత్సరం ఉత్తరాలకి జవాబులు వ్రాసింది. ఒక్కసారి అవి ఆగిపోయాయి.

ఆఖరి ఉత్తరంలో యింట్లో అస్వస్థతగా ఉందని వ్రాసింది. అంతే, తను కంగారు పడిపోయాడు. తను యెన్ని ఉత్తరాలు వ్రాయుగా చివరకి తొమ్మిది నెలల తరువాత మావయ్య జాబు వ్రాసాడు. రెండే రెండు వాక్యాలు. "సుచిత్రకి వివాహమయింది. వరుడు నీ స్నేహితుడే. సారధి!"

ఆ క్షణాన మతిపోయింది తనకి. యేకారణం సుచిత్రను తననుంచి దూరంచేసింది? సుచిత్ర యిష్టపడే చేసుకుందా? బలవంతంగా అయిష్టంగా జరిపించారా! ఏమోకాని సుచిత్ర స్వభావం తనకు తెలుసు. ఆమె యిష్టానికి వ్యతిరేకంగా ఎవరూ, ఏమీ చేయలేరు!

రైలు ఒక్క కుదుపుతో ఆగింది. విశ్వం యీ లోకంలోకి వచ్చాడు. కిటికీలోనుంచి బయటకు చూసాడు. విశాఖాంత సూర్యుడిని కొండలు మాటుకు తరుముతోంది. జేబులు తడుముకుని సిగరెట్టు పెట్టె బయటకు తీసాడు విశ్వం.

'బావా! నాకోసం యీ పాడు సిగరెట్లు మానెయ్యలేవా?' అని అడిగిన సుచిత్ర అభ్యర్థనలోని అనురాగానికి లొంగి ఒకప్పుడు మానుకున్నాడు.

యిప్పుడు అటువంటి ఆలంబన లేవి లేవు. విశ్వం విషాదంగా నవ్వుకున్నాడు. యింజను ఆవిరి వదిలిపెడుతోంది కాబోలు చల్లని జల్లు కిటికీలో నుంచి ముఖంమీద పడింది. దూరంగా లైట్లు మిణుకు మిణుకుమని కనిపిస్తున్నాయి. యింతదాకా వచ్చి కొంప మునిగినట్లు అవుటరులో ఆగిపోయింది రైలు. విశ్వం విసుక్కున్నాడు. దూరంగా లైటు హౌస్ కాంతి గుండ్రంగా ప్రదక్షిణాలు చేస్తోంది.

'సుచిత్ర వివాహమయిపోయింది! తనకి మిగిలిందేమీ లేదు. సారధి! తనని మోసంచేసి తననుంచి సుచిత్రను వేరుచేసాడనే కోపం తనకి లేదు. సుచిత్ర తనంత తాను యిష్టపడితే తనేమని అనగలడు? తన దురదృష్టానికి నిందించుకోడం తప్ప.

అసలిదంతా ఎలాగ జరిగింది? అంతా తనను వెలివేసినట్లు దూరం చేసారు.

సుచిత్ర సుఖపడుతోందా? ఏమో! సారధి ఏ విషయంలోనైనా తన కేవిధంగానూ తక్కువ కాడు. తనని ఎప్పుడయినా మనసులో గుర్తు తెచ్చుకుంటుందా ఆఖరికి? మరచిపోయి ఉంటుందేమో ఎవరు చెప్పగలరు! కాలం మనిషిలో అనుక్షణం వేయి మార్పులు తెస్తుంది. సుచిత్ర యింత జరిగాక యింకా తన గురించి ఆలోచిస్తుందనుకోడం తన పేరాశ! స్వార్థం!

సారధి అదృష్టవంతుడు.

ఆలోచనలలో రైలు ప్లాట్‌ఫారం ప్రవేశించడం కూడా గమనించలేదు విశ్వం.

జనం హడావుడితో, పోర్టర్ల కేకలతో ఉలిక్కిపడి లేచాడు.

సూట్‌కేస్ ప్లాట్‌ఫారం మీదపెట్టి చుట్టూ కలయజూసాడు.

సారధి, సుచిత్ర రాలేదు! విశ్వం మనసు నిరుత్సాహంగా మూలిగింది. తనకేం మిగిలిందని యిక్కడికి వచ్చాడు! ఏం చెయ్యాలి? హోటలులో దిగి యిల్లు వెతకడానికి ప్రయత్నించడమా? లేకపోతే తిరుగుబండిలో ఎక్కేయ్యడమా" విశ్వం చికాకుగా ఆలోచిస్తున్నాడు.

"విశ్వం! రా! బయటకి వెళ్దాం. భుజంమీద బరువుగా పడింది చెయ్యి. వెనక్కి తిరిగి చూసాడు. సారధి నవ్వుతూ నిలబడ్డాడు.

"యింకా వెదుకుతున్నాను. రాలేదేమో, ఏం చేద్దామా అని ఆలోచిస్తున్నాను" విశ్వం నవ్వుతూ చెయ్యి కలిపాడు.

టాక్సీలో కూర్చుంటూ ప్రశ్నించాడు విశ్వం. "సుచిత్ర రాలేదేం?" వెంటనే మనసు ప్రశ్నించింది నీకేం పాక్కుంది?" అని.

"యింట్లో అంతగా బాగా లేదు విశ్వం! వచ్చానంది. నేనే వద్దన్నాను" సారధి అన్నాడు. విశ్వానికి మర్మమేం మాటల్లో తోచలేదు. సారధి స్నేహితుడిగా సన్నిహితంగానే కనిపిస్తున్నాడు కాని సుచిత్ర భర్త అని తలచుకుంటే అదోలా ఉంది.

"వైజాగ్ చాలా మారినట్టుందే" విశ్వం అనంగతంగా అన్నాడు.

"వూ. మనం చదువుకున్నప్పటిలా లేదు" సారధి కూడా ఏదో నిర్లిప్తంగానే ఉన్నాడు. ఇంట్లోకి అడుగు పెడుతూనే విశ్వం కళ్ళు ఆశ్చర్యంగా ముట్టి వెదికాయి.

"సుచీ!" సారధి పిలిచాడు.

సారధి పిలుపు విశ్వానికి ఎగతాళిగా తోచింది. మరు నిముషంలో సుచిత్ర గదిలోకి వచ్చింది. విశ్వం కాళ్ళు నిలిచిపోయాయి. కనులు రెప్పలు వేయటం మరచిపోయాయి.

సుచిత్ర అప్పుడే ప్రొద్దున్న స్నానంచేసింది కాబోలు. విడివడిన కేశములు చిందర వందరగా చెవులను కప్పుతూ చెంపలమీదకి జారి గాలికి నృత్యం చేస్తున్నాయి. పచ్చని నుదుటిమీద ఎర్రని కుంకుమ ప్రకాశిస్తోంది. పమిటకొంగు భుజాలచుట్టూ త్రిప్పి నిలుచుంది.

విశ్వం అలాగే చూస్తూ ఉండిపోయాడు.

సుచిత్ర ఒకక్షణం చూసి చిన్నగా నవ్వింది.

"నీ యింటికి అతిథిగా వచ్చాను" విశ్వం కూడా ప్రయత్నపూర్వకంగా నవ్వాడు.

"కూర్చో. ఎంతసేపని నిల్చుంటావు?" మెల్లిగా అంది. విశ్వం మాటలలోని విరుపు హృదయంలో నాటుకుంది.

సారధి మౌనంగా తలదించుకుని షూలేసులు విప్పుకుంటున్నాడు. అప్పటికి విశ్వానికి సారధి ప్రక్కనే ఉన్నట్టు గుర్తుకి వచ్చింది.

"వచ్చి యెన్నాళ్లయింది?" సుచిత్ర ప్రశ్నించింది.

"నాలుగవ తేదీన"

"అయితే హైదరాబాదులో అసలు దిగలేదా?"

"లేదు."

"నాన్న స్టేషనుకి వచ్చి కలుసుకున్నారా?"

"నేను ఇండియాకి వచ్చేసినట్టు మావయ్యకి తెలియదు. తిన్నగా యిక్కడికే వచ్చాను" విశ్వం అన్నాడు.

# మిగిలిందేమిటి?

సుచిత్ర యింకేమీ అడగలేదు.

"చాలా ఆలస్యమయింది. భోజనాలకి ఏర్పాట్లు చూస్తాను" సుచిత్ర లోనికి వెళ్ళిపోయింది. విశ్వం చూపులనుంచి తప్పించుకుంటూ.

విశ్వం నిట్టూర్చాడు. "సుచిత్ర ఏంతమాత్రం మారలేదు. తనుమాత్రమే దూరమయి పోయింది."

విశ్వం మర్నాడు నిద్రలేచేటప్పటికి సూర్యుడు అప్పుడే తన జైత్ర యాత్ర ప్రారంభించేసాడు. కిటికీలోనుంచి ఎండ తీక్షణంగా మీదపడుతోంది. విశ్వం దుప్పటి ప్రక్కకి లాగేసి వాచీ చూసుకున్నాడు. ఎనిమిదవుతుంది. లేచి హాలులోకివచ్చాడు.

సారధి సోఫాలో కూర్చున్నాడు. సుచిత్ర ప్రక్కనే కూర్చునిఉంది, సారధి మీదకి వంగి.

"అబ్బబ్బ! ఎందో చూసుకోకూడదూ! షర్టు తొడుక్కుని కూర్చుని బటన్స్ లేవంటే ఎలా కుడతా ననుకున్నారు?" నోటితో దారం త్రెంపుతూ అంది సుచిత్ర.

సారధి ముందుగా విశ్వాన్ని చూసాడు.

"బాగా నిద్ర పట్టిందా?" నవ్వుతూ పలకరించాడు.

"రాత్రి త్వరగా నిద్రపట్టలేదు సారధీ! మెలకువ రాలేదు ప్రొద్దున్నే. మీరిద్దరూ స్నానం కూడా చేసేస్తున్నారే!" విశ్వం అన్నాడు.

"అయ్యబాబోయ్! ఆరయే సరికల్లా లేచి స్నానం చేయకపోతే సుచిత్రాదేవి వూరుకుంటుందా? నేనూ ఒకప్పుడు హాయిగా ఎనిమిదింటికి లేచేవాడిని విశ్వం! ఏం చేయను? చేసుకున్నవారికి చేసుకున్నంత అని సామెత" సారధి నవ్వాడు.

విశ్వం మనస్ఫూర్తిగా నవ్వలేకపోయాడు.

"మీరింకా కాఫీ కూడా త్రాగలేదా? నాకోసం కూర్చున్నారేమిటి?" విశ్వం కొంచెం సిగ్గుపడుతూ అడిగాడు.

"ఫర్వాలేదు కాని, నీ సంగతేమిటి? బెడ్ కాఫీ తీసుకుంటావా?" సారధి అడిగాడు.

"ముఖం కడుక్కుని వస్తాడు. ఇంతలో అయే అంత సేపేముంది?" సుచిత్ర విశ్వం ముఖంలోకి చూసి లోనికి వెళ్ళిపోయింది.

"ఇదీ వరస. ఆవిడ మాటకి తిరుగులేదు విశ్వం!" సారధి నవ్వాడు.

"సుచిత్ర మాటలలో ఆనిశ్చయం, శాసనం యేమీ మారలేదు." విశ్వం అనుకున్నాడు.

విశ్వం ముఖం కడుక్కుని టవలుతో తుడుచుకుంటూ వచ్చి కూర్చున్నాడు. సుచిత్ర ప్లేటులో టిఫిను అమర్చి కూర్చుంది.

సారధి ఒకప్లేటు విశ్వం ముందుకి త్రోసి తాను ఒకటి తీసుకున్నాడు.

"ఒక క్షణం ఆగండి. యిప్పుడే వస్తాను." సుచిత్ర హడావిడిగా లోనికి వెళ్ళింది. మరు నిముషంలో చిన్న పళ్ళెంతో మళ్ళీ ప్రవేశించింది. అందులో నుంచి నాలుగు మల్లెపూవులు తీసి దోసిలి పట్టిన సారధి చేతులలో వుంచింది.

సారధి వాటిని ఒకసారి వాసన చూసి, అంతలోనే కళ్ళకద్దుకున్నాడు.

"ఎన్నిసార్లు చెప్పాలి మీకు? దేవుని పుష్పాలు ఆఘ్రాణించకూడదని." సుచిత్ర పళ్ళెం టీపాయ్ మీద ఉంచి విశ్వంవైపు తోసింది.

"మరచిపోయాను. సారధి టిఫినుప్లేటు అందుకున్నాడు.

"ఈ అలవాటు యింకా ఉందన్నమాట నీకు. నా స్నానం అవలేదుగా యింకా." విశ్వం తప్పించుకున్నాడు.

"ఎక్కడికి పోతుంది? పుటకతో పుట్టిన బుద్ధి." సుచిత్ర అంది.

"ఆవిడ చేయడం సరే. చేస్తున్నంతసేపూ నేను కూడా బుద్ధి మంతుడిలా మరంచే చేతులు జోడించి కూర్చోలేదని రోజూ నా ప్రాణం తీస్తుంది." సారధి అన్నాడు.

సుచిత్ర మాట్లాడకుండా కాఫీ కలపడంతో నిమగ్నమయింది.

"ఎక్కడ స్థిరపడదామనుకుంటున్నావ్? ఉద్యోగము, అదీ." సారధి అడిగాడు.

"కాన్పూరులో ఆఫర్ వచ్చింది." విశ్వం క్లుప్తముగా అన్నాడు.

"మన వైపేమీ వీలులేదేమిటి?"

"నా కిష్టంలేదు."

సారధి సంభాషణ మరింక పొడిగించలేదు. ఖాళీ అయిన కాఫీకప్పు బల్లమీద పెట్టేసాడు.

"బట్టలు వేసుకో. మా హాస్పిటల్ అదీ చూద్దుగాని." సారధి కుర్చీ వెనక్కి జరిపి లేచాడు.

"పోనీ యివాళ్టికి ఇంట్లో కూర్చోండి హాయిగా కబుర్లు చెప్పుకోవచ్చు." సుచిత్ర అంది.

"అమ్మో! నాకోసం యీపాటికి అక్కడ ఎంత మంది ఎదురు చూస్తూ ఉంటారో ఏమైనా తెలుసా? నీకంటే తెలియక పోయావు కాని." సారధి హాస్యంగా అన్నాడు.

"అంతా బడాయి కబుర్లు. ఎవరికీ తెలియని సంగతి." సుచిత్ర నవ్వింది.

"ఎలా వుంది ప్రాక్టీసు?" లేస్తూ అడిగాడు విశ్వం.

"ప్రస్తుతానికి సుచిత్రాదేవి స్నో, పౌడర్లకి సరిపోతోంది." సారధి పకపకా నవ్వేసాడు.

సుచిత్ర మౌనంగా కూర్చుంది.

సారధి ఒక్కొక్కమాట విశ్వంకి తన దురదృష్టాన్ని వెక్కిరిస్తున్నట్లుగా అనిపించింది. సారధి గంభీరంగా మారిపోయాడు.

"పద. చేసేదేముంది కనుక." విశ్వం డ్రెస్ చేసికోడానికి గదిలోకి వెళ్ళిపోయాడు. హాస్పిటల్లో బారులు తీర్చి కూర్చున్నారు జనం. విశ్వం ఆశ్చర్యపోయాడు.

"మూడు, నాలుగేళ్ళలో చాలా పేరు సంపాదించావు." విశ్వం అన్నాడు.

సారధి నవ్వి వూరుకున్నాడు. ఇద్దరూ వెళ్ళి సారధి కన్సల్టింగ్ రూమ్‌లో కూర్చున్నారు.

"లోపలికి పంపించమంటారా?" కాంపౌండరు విష్ చేసి అడిగాడు సారధిని.

"వూఁ. పంపించండి. ముందు అర్జెంట్ కేసెస్ చూస్తాను". సారధి కుర్చీలో వెనక్కి వ్రాలి కూర్చున్నాడు.

ఒక గంట గడిచి పోయింది. విశ్వంకి అంతా చికాకుగా ఉంది. ఎవరో రావడం! జబ్బులు, బాధలు, ఏడుపులు!

"ఏమిటి? విశ్వం! బోరుకొడుతోందా?" సారధి ప్రశ్నించాడు.

"రెండు మూడు రోజులనుంచి నిద్రలేదు సరిగా కొంచెం తల దిమ్ముగ ఉంది." విశ్వం అన్నాడు.

"మరి చెప్పావుకాదేం? ఈ టాబ్లెట్ వేసుకో!" సారధి మంచినీళ్ళు తెమ్మని కుర్రాడితో చెప్పాడు.

"నేనింటికి వెళ్తాను." విశ్వం అన్నాడు. మనసుతో సుచిత్రతో యేకాంతంగా మాట్లాడాలని వుంది. తన మనసులోని మాట అడగాలి. మరు నిముషం వీరందరికీ దూరంగా వెళ్ళిపోవచ్చు.

"ఉండయితే. నేనూ వచ్చేస్తాను. నా అసిస్టెంటు



వస్తాడు. మిగిలినవి అటివికి అప్పజెప్పేస్తాను." సారధి అన్నాడు.

విశ్వం మౌనంగా ఏవో మెడికల్ జర్నల్స్ తిరగేస్తూ కూర్చున్నాడు. కడుపులో అదోలా వుంది.''

పది నిముషాల తరువాత సారధి అసిస్టెంటు వచ్చాడు.

"విశ్వం! లే! వెళ్దాం.'' సారధి లేచాడు.

యింటికి చేరుతూనే విశ్వం వాంతి చేసుకున్నాడు. తరువాత యేమీ తెలియలేదు. విశ్వంకి అంతా మగతగా ఉంది.

సారధి కంగారు పడ్డాడు. "సుచీ! నీళ్లు తీసుకురా'' గట్టిగా పిలిచాడు ప్రక్కకి వాలిపోతున్న విశ్వంని గట్టిగా పట్టుకుంటూ.

"యేమిటి? యేమయింది?'' సుచిత్ర కంగారుగా వస్తూ అడిగింది.

"యేమీ లేదు. నిద్రలేక, ప్రయాణాలు అవీ కదూ. నీరసం అంతే.'' సారధి మెల్లిగా విశ్వంని మంచం మీద పడుకోబెట్టాడు.

"కాస్త వేడి కాఫీ తీసుకురా.'' సారధి భార్య ముఖంలోకి చూసి అన్నాడు.

సుచిత్ర లోనికి వెళ్లింది.

"కంపరేచరేమీ లేదు.'' సారధి స్పూన్‌తో కాఫీ విశ్వంచేత త్రాగిస్తూ అన్నాడు. సుచిత్ర ప్రక్కనే నిలబడింది చూస్తూ. విశ్వం కళ్లు మూసుకుని పడుకున్నాడు.

మళ్లీ విశ్వంకి మెలకువ వచ్చి కళ్లు తెరచేటప్పటికి గది అంతా చీకటిగా ఉంది. కిటికీ తలుపులు వేసి వున్నాయి. ఒక క్షణం తనెక్కడ ఉన్నాడో కూడా మరచిపోయాడు.

నుదుటిమీద చల్లని చేతి స్పర్శ కలిగింది.

"ఎవరు? సుచీ!'' విశ్వం నీరసంగ అన్నాడు.

"ఎలాగ ఉంది బావా! యిప్పుడు.'' సుచిత్ర కనుల మెరపు చీకట్లో కూడా చూడగలిగాడు విశ్వం.

"టైమెంతవుతుంది?'' తల ప్రక్కకి త్రిప్పుకుంటూ అడిగాడు.

"ఒంటి గంటవుతోంది.'' సుచిత్ర కిటికీ తలుపులు తెరుస్తూ అంది. ఒక్కసారి వెలుగు గదిలోకి ప్రవేశించింది. విశ్వం కనులు చిట్లించాడు.

"అబ్బ. ఉక్కగా వుంది.'' విశ్వం మెడవరకూ కప్పిన దుప్పటి కాళ్ళక్రిందకి లాగేసాడు.

"ఆకలేస్తోందా? భోజనం చేస్తావా?'' ఫాన్ ఆన్‌చేస్తూ అడిగింది సుచిత్ర.

"వూ సారధి యేడీ?'' విశ్వం లేచి కూర్చుంటూ అడిగాడు.

"ఎవరో వచ్చారు ఆయనకోసం. బయటికి వెళ్లారు. చాలా సేపయింది. యింకవచ్చేస్తూవుండాలి''

"భోజనం చేసాడా లేదా?'' విశ్వం లేచి నిలుచోబోయి తూలాడు.

సుచిత్ర గభాలున వచ్చి పట్టుకుంది. "ఈ చేయి ఆసరా జీవితాంతం ఉంటే ఎంత బాగుండేది.'' విశ్వం మనసు ఆక్రోశించింది.

"భోజనం యిక్కడికే తెస్తాను. ఆయన భోజనము అయిపోయింది.'' కుర్చీలో కూర్చోబెట్టి సుచిత్ర వెళ్లిపోయింది.

విశ్వం కనులు మూసుకుని ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

అయిదు నిముషాల తరువాత సుచిత్ర వచ్చింది, కంచం గ్లాసుతో మంచినీళ్లు పట్టుకుని. విశ్వం కన్నార్పకుండా సుచిత్ర కనులలోకి చూస్తూ వుండిపోయాడు. సుచిత్ర ఒకక్షణం చూసి తల దించుకుంది. టీపాయ్ విశ్వం దగ్గరగా లాగి దానిమీద కంచం, గ్లాసు పెట్టి తనింకొక కుర్చీ దగ్గరకు లాక్కుని కూర్చుంది.

తలయెత్తి చూసేసరికి విశ్వం దృష్టి యింకా తనమీదే వుండటం గమనించి కంగారు పడింది.

"బావా!''

"వూఁ.''

"భోజనం చెయ్యి."

విశ్వం దృష్టి మరల్చాడు. "తనంటే యింత ఆప్యాయత చూపించే సుచిత్ర తననెందుకు దూరం చేసింది?'' విశ్వం ముఖం ఎర్రబడి పోయింది. 'సుచిత్ర యిలాగ ఎందుకు చేసింది?' విశ్వంచూపులు తీక్షణంగా సుచిత్ర కనులలోకి చూసాయి

సుచిత్ర ఒక సెకను చూసి తలదించుకుంది.

'సుచీ!' విశ్వం పెదవులు కదిలాయి.

సుచిత్ర మనసుకి విశ్వం మనసులోని యత్నం అర్థమయి పోయింది. ఒకసారి తలయెత్తి విశ్వం కనులలోకి చూసింది. ఆ చూపులోని ఆవేదన, అనురాగం, అభ్యర్థన విశ్వంని ఉక్కిరి బిక్కిరి చేసేసాయి.

'లాభం లేదు. యిప్పుడు తనడుగలేడు.' విశ్వం అనుకుంటూ దృష్టి భోజనం వైపు మరల్చాడు మాట్లాడకుండా.

"వెరీగుడ్! భోజనం కూడా చేస్తున్నావన్నమాట.'' సారధి అప్పుడే హడావుడిగా లోపలికి వచ్చాడు. సుచిత్ర లేచి నిల్చుంది.

"ఒక్కసారి అలాగ పడిపోయేసరికి నిజంగా గాభరా పడ్డాను సుమా! యిప్పుడెలాగ ఉంది?'' సారధి కుర్చీలో కూర్చుంటూ అడిగాడు.

"బాగానే వుంది. ప్రొద్దున్న మీకు చాలా శ్రమ యిచ్చినట్టున్నాను.'' విశ్వం కొంచెం సిగ్గుపడుతూ అన్నాడు.

"దానికే ముంది? పరాయివాడివి కనుకనా. యివాళ్టికి పూర్తిగా విశ్రాంతి తీసుకో వూరు తిరగడానికి బోలెడు టయిముంది. ఆదివారం సరదాగా సింహాచలం వెళ్దాం.'' సారధి అన్నాడు.

"అలాగే.'' విశ్వం చేయి కడుక్కుని కుర్చీలో వెనక్కి వ్రాలాడు.

"వెంటనే నిద్రపోవడం అంత మంచిదికాదు. కొంచెంసేపు పేక వేద్దామేమిటి?'' సారధి అడిగాడు.

విశ్వం సరేనన్నట్టుగా తల వూపాడు.

"పేక తీసుకురా సుచీ!'' బల్ల అవీ తడిగుడ్డతో శుభ్రం చేస్తున్న సుచిత్రతో అన్నాడు సారధి.

రెండు గంటలు ఆడారు. ఆట యేమాత్రం ఉత్సాహంగా సాగలేదు. ఎవరి ఆలోచనలలో వారి మనసులు నిమగ్నమయి పోయాయి.

చివరికి సారధి లేచాడు 'హాస్పిటల్‌కి వెళ్లాలంటూ'

"కాఫీ పెడతాను.'' సుచిత్ర కూడా లేచింది.

"ఇవాళ్టికి దారిలో హోటలులో త్రాగుతాను. మీరిద్దరూ ఆడుకోండి.'' సారధి భార్యను బలవంతంగా కూర్చోబెట్టి వెళ్లిపోయాడు.

విశ్వం పేక కలుపుతున్నాడు. వీధి తలుపు చప్పుడయింది సారధి వెళ్లిన సూచనగా. విశ్వం పేక ముక్కలు సుచిత్రకి వెయ్యబోయి ఆగాడు.

సుచిత్ర కనులలో తత్తరపాటు! అనుమానం! ఏదో భయం.

వెంటనే పేక తీసి ప్రక్కకి పడేసాడు.

"నీ పని చూసుకో వెళ్ళు.'' లేచి మంచంమీదికి ఒరిగాడు విశ్వం.

సుచిత్ర లేచి గుమ్మంవరకూ వెళ్లింది. విశ్వం మనసు మళ్లీ హెచ్చరించింది 'యింతకు మించి యేకాంతం లభించదంటూ.'

"సుచీ!'' పిలిచాడు.

ఆగి వెనక్కి తిరిగింది.

"ఇలాగిరా!''

సుచిత్ర దగ్గరగా వచ్చి నిల్చుంది.

"కూర్చో.'' ఎదురుగా కుర్చి చూపించాడు.

కోడు పట్టుకుని నిల్చుంది.

"సుచీ! నీ నుంచి ఒక్క విషయం తెలుసుకోవాలని యింతదూరం వచ్చాను నేను.'' విశ్వం తీక్షణంగా అన్నాడు.

సుచిత్ర నుదుటినిండా చెమటలు పట్టాయి. కుర్చీని పట్టుకున్న వ్రేళ్లు బిగుసుకున్నాయి. "బావా! యిప్పుడు నేనేమీ చెప్పలేను.'' ఒక నిముషం తరువాత నిర్లిప్తంగా వచ్చాయి సుచిత్ర పెదవులనుండి మాటలు.

విశ్వం ముఖంలో జుగుప్స, కోపం చోటు చేసుకున్నాయి.

"పో! యిక్కడి నుంచి పొండు'' తీవ్రంగా అన్నాడు. సుచిత్ర ఉలికి పడింది. కంఠం పూడుకుపోయినట్లుయింది. పెదవులు వణికాయి.

మరు నిముషంలో ఆమె ఆ గదిలోనుంచి వెళ్ళిపోయింది. విశ్వం దీర్ఘంగా నిట్టూర్చి కనులు మూసుకున్నాడు.

*　　　*　　　*

చలిగాలి రివ్వుమని వీచింది. సుచిత్ర లేచి కిటికీ తెరలు దగ్గరగా లాగింది. చల్లగా వానజల్లు చెంపలకి తాకింది. చీకటి పడుతోంది.

కిటికీ తలుపు వెయ్యబోయి మళ్లీ కొంచెం తెరచి చూసింది. విశ్వం దూరంనుంచి పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ వస్తున్నాడు.

గది అంతా చీకటిగా ఉంది. గదిలో లైటు వేసి, వీధి తలుపు తీసేంతలోనే డోర్ బెల్ మ్రోగింది. తలుపు తీసింది. విశ్వం లోనికి వచ్చాడు. కొద్దిగా తడిసిన వెంట్రుకలు నుదుటి మీద అతుక్కుని పోయాయి.

"ఎక్కడికి వెళ్లావు?'' సుచిత్ర అడిగింది.

"బీచ్‌కి.'' విశ్వం బూట్లు విప్పి ప్రక్కకి పడేస్తూ అన్నాడు.

"సారధి యింకా రాలేదేమిటి?''

"ఊహూ. యివాళ ఆలస్యమయింది."

"ఒంటరిగా నాతో ఉండటానికి భయంకాబోలు" విశ్వం నవ్వుతూనే వెటకారంగా అన్నాడు. సుచిత్ర మాట్లాడకుండా వెళ్లిపోయింది.

విశ్వం కిటికీలో నుంచి బయట వర్షాన్ని చూస్తూ కూర్చున్నాడు. సుచిత్ర కొంచెం సేపటికి కాఫీ కప్పుతో మళ్లీ వచ్చింది.

"చేతి కందిస్తే పవిత్రతకి భంగమా'' విశ్వం అన్నాడు.

కాఫీ కప్పు బల్ల మీద పెట్టబోతున్నదల్లా

ఆగింది సుచిత్ర. విశ్వం మాటలు ఆమె మనసును ఛేదించి ముక్కలుగా చేస్తున్నాయి.

చేయి వణకింది. కప్పు చేతిలో నుంచి జారి బల్ల మీద నుంచి క్రిందపడి ముక్కలయింది.

విశ్వం సుచిత్ర భుజాలు పట్టి ఎదురుగా సోఫాలో కూర్చోబెట్టాడు.

"ఇదంతా శుభ్రం చెయ్యాలి" క్రింద ఒలికిన కాఫీ, గాజుముక్కల కేసి చూస్తూ అంది సుచిత్ర.

"ఫర్వాలేదు. ముందు నా ప్రశ్నకి జవాబు చెప్పు యిదంతా ఎందుకు జరిగింది? మావయ్య నిన్ను బలవంత పెట్టాడా? నీ యిష్టంతోనే జరిగిందా?" విశ్వం కఠినంగా ప్రశ్నించాడు.

సుచిత్ర వంచిన తలయెత్త లేదు.

"మాట్లాడవేం. యివాళ తప్పించుకోవద్దు. నన్ను మరచిపోయానని అను. నేను నిన్నెన్నడూ ప్రేమించలేదని చెప్పు. నా దంతా మోసం అని చెప్పు." విశ్వం గట్టిగా అరచినట్టుగా అన్నాడు.

"నాన్న నీకేమీ వ్రాయలేదా?" మెల్లిగా అంది.

"వ్రాసాడు. సుచిత్రాదేవి వివాహం పార్థసారథితో వైభవంగా జరిగిందని" సుచీ! ఒక్కమాట చెప్పు. నిన్నింక బాధించను. నానుంచి తప్పించుకో వలసిన అవసరం నీకుండదు. నేనెన్నడూ నిన్ను ప్రేమించలేదు. నీవు నాకు తగవు' అని ఒక్కమాట అను. ఇక నీకళ్లకి కనపడకుండా వెళ్లిపోతాను. నా నీడ కూడా నీ మీద పడదు. విశ్వం విసురుగా సుచిత్ర భుజాలు పట్టి కుదిపాడు.

ఇక మనసులో దుఃఖానికి ఆనకట్ట వేయడం సుచిత్రకి శక్యం కాలేదు. చెక్కిళ్ల మీదుగా కన్నీరు జాలువారింది.

విశ్వం లేచి విసురుగా కిటికీ దగ్గర బయటకు చూస్తూ నిలబడ్డాడు.

"బావా! చిన్నప్పటి నుంచి నీకు పిల్లలంటే యిష్టం. ఎప్పుడూ వాళ్లతోనే ఆడేవాడివి. కనపడిన పసివాడినల్లా ఎత్తుకుని త్రిప్పేవాడివి. నేనెప్పుడయినా వేళాకోళం చేస్తే 'పిల్లలు లేనిచోట నేను ఉండలేను. పిల్లలు లేని వారు ఎలా జీవిస్తారో వారి జీవితం దుర్భరం' అనే వాడివి గుర్తుందా?" సుచిత్ర ఆగింది.

# మిగిలిందేమిటి?

"దానికీ యిప్పుడు నేనడిగిన ప్రశ్నకు సంబంధమేమిటి?" విశ్వం వెనక్కితిరిగి చూడకుండానే ప్రశ్నించాడు.

"భగవంతుడు నన్ను శపించాడు బావా! నాకీ జీవితంలో పిల్లలు కలిగే అర్హత లేదు." సుచిత్ర నిశ్చలంగా మనసులో పొంగిపొరలే దుఃఖాన్ని మునిపంటితో పెదవి నొక్కిపెట్టి ఆపింది.

విశ్వం విభ్రాంతుడయ్యాడు.

"ఏమిటంటున్నావు? సుచీ! అసలేం జరిగింది?" విశ్వం కంగారుగా ప్రశ్నించాడు.

"అవును బావా! నీవు వెళ్లబోయే ముందు అయిదారేళ్ల నుంచీ కూడా ఎప్పుడూ కడుపు నొప్పితో బాధపడేదాన్ని నీకు తెలిసే ఉంటుంది. చివరకి ఒకసారి బాగా ఎక్కువయిపోయింది. హాస్పిటల్‌లో జాయిన్ చేసారు. ఆపరేషన్ జరిగింది. నా బ్రతుకులో పుట్టుకలోనే ఏదో లోపముందట!" సుచిత్ర యింతవరకూ చెప్పి చేతులలో ముఖం దాచుకుంది.

విశ్వం మౌనంగా చూస్తూ కూర్చుండిపోయాడు రెండు నిముషాలు.

"సారధికి యీ విషయం తెలుసా?"

సుచిత్ర తెలుసునన్నట్లుగా తల వూపింది.

"ఆ సంఘటనతో నా జీవితమే మారిపోయింది. నాకున్న యీ మచ్చతో నీ జీవితంలో ప్రవేశించి నీ సౌఖ్యం దూరం చేయడానికి నాకు ధైర్యం చాల లేదు బావా! నేను వాసనలేని పూవును. యింక వివాహేచ్ఛను పూర్తిగా విడిచిపెట్టిన నన్ను వివాహం చేసుకుంటానని ఆయన తనంత తాను నాన్నని అడిగారు. నేను కాదనలేకపోయాను. నా మనస్ఫూర్తిగా యిష్టపడి వివాహం చేసికొన్నాను. యిందులో ఎవరి నన్నా నిందించవలసివుంటే అది నన్నే. ఒకవేళ నిన్ను మోసం చేసి పెళ్లి చేసుకుని ఉన్నా నువ్వు ప్రతి రోజూ విచారించవలసి ఉండేది నా కోసం. అదంతా వూహించే నేనిలా చేసాను." సుచిత్ర ఆగింది.

"పొరబడ్డావు సుచీ! ఈనాటికి కూడా నన్ను పూర్తిగా అర్థంచేసికోలేకపోయావు" విశ్వం మనసులో బాధగా అనుకున్నాడు.

"చివరకి నాకు ఉత్తరంలో వ్రాయడానికి కూడా నీకు మనస్కరించలేదా సుచీ!" విశ్వం నీరసంగా అన్నాడు.

ఆ సమయంలో నాకు నిజంగా నా కలలన్నీ నాశనమయిపోయేసరికి పూర్తిగా నిరాశ ఆవరించింది. నీవు నన్ను తిరస్కరిస్తావనే నా మనసు ఘోషించింది. పోనీ యిప్పుడు చెప్పు బావా! అడుగుతున్నాను. నీకు తెలిసి ఉంటే ఈ అభాగ్యురాలి కోసం ఏం చేసి ఉండేవాడివి? నీ కోరికలు, కలలు త్యాగం చేయగలిగి ఉండేవాడివా?" సుచిత్ర నిర్లిప్తంగా ప్రశ్నించింది.

"అనవసరం సుచీ! నీవు నన్ని ప్రశ్న ఆనాడే అడిగి ఉంటే ఏం జరిగేదో నేనిప్పుడు చెప్పలేను. నీవు నాకు కనీసం అవకాశంకూడా యివ్వలేదు. నా దురదృష్టం." విశ్వం నుదుటి మీద కొట్టుకున్నాడు.

బయట వర్షం బాగా పెద్దదయిపోయింది.

"చిన్ననాటి నుంచీ నేను నిర్భాగ్యుడినే సుచీ! అమ్మా, నాన్న ముఖమే ఎరుగను. మిగిలినదల్లా మావయ్యా, నీవూ. చివరకి నందనవనంలో ఎడారి సృష్టించి నా మీద కసి తీర్చుకున్నాడు భగవంతుడు" విశ్వం కంఠంలో ఆవేదన సుచిత్రను ముంచివేసింది. పదినిముషాలు మౌనంగా గడచిపోయాయి.

ఆకాశంలో పెద్ద మెరుపు మెరిసింది. దూరంగా ఎక్కడో పిడుగు పడింది. లైట్లు ఆరిపోయాయి.

అంతా గాడాంధకారం. ఏమీ కనబడటంలేదు.

విశ్వం తంటాలుపడి అగ్గిపుల్ల గీసాడు. ఎర్రని కాంతిలో సుచిత్ర చెక్కిళ్ల మీద కన్నీరు మెరిసింది.

విశ్వం చేతిలో అగ్గిపుల్ల గాలికి ఆరిపోయింది.

మానవుడు సాధన చేస్తే తన మనసును అదుపులో ఉంచుకోడం అంత కష్టంకాదు. కాని ప్రకృతి ఆ ప్రయత్నానికి ఎదురుగా నిలిస్తే ఎవరు నెగ్గుతారో చెప్పడం కష్టం.

విశ్వం యీ ప్రయత్నంలో పూర్తిగా ఓడిపోయాడు. అతని చేతులు అప్రయత్నంగా సుచిత్ర చెక్కిళ్లపై కన్నీరు తుడిచాయి. దూరంగా మెరుపు మెరిసి ఒక సెకను కళ్లు జిగేలు మనిపించింది. సుచిత్ర చెక్కిళ్ళు అద్దంలా మెరసిపోయాయి. మూసికొని ఉన్న కనులు అదొక వింత అందాన్ని కూర్చాయి.

విశ్వం ప్రాపంచిక మైకంలో మునిగిపోయాడు. జాగ్రదావస్థ నశించింది. మనసు శరీరానికి దాసోహమంది.

విశ్వం చేతులు సుచిత్ర కోమలమయిన శరీరం చుట్టూ బిగుసుకున్నాయి.

"బావా! వదలిపెట్టు." నీరసంగా నూతిలో నుంచి మాట్లాడినట్లుగా అంది సుచిత్ర. ఆమె వదరించుకోవాలని ప్రయత్నించేసరికి చుట్టూ ఉన్న బంధం మరింతగా బిగిసింది.

విశ్వం పెదవులు నవ్యానుభూతి కోసం శోధిస్తున్నాయి.

'బావా!' అంటూ హెచ్చరించబోయిన సుచిత్ర పెదవులపై వెచ్చని స్పర్శ!! ఒక్కసారి లైట్లు వెలిగాయి. వీధి తలుపులు గభాలున తెరచుకున్నాయి. విశ్వం తలత్రిప్పి చూసాడు.

గుమ్మంలో సారధి! కళ్లు అగ్నిగోళాల్లా నిప్పులు కురుస్తున్నాయి. విశ్వం దేహంలో రక్తం గడ్డ కట్టినట్టయింది. మత్తు దిగిపోయింది. సుచిత్ర చుట్టూ

మీకో దువ్వెన బహూకరించాలని అనుకుంటున్నాం!











Binaca®
Fluoride
toothpaste

ఉన్నపట్టు వదిలింది. సుచిత్ర విడివడింది. అదే సమయంలో ఆమె కనులు సారథి చూపులతో కలుసుకున్నాయి.

ఆమె కనులలోని భావం ఏ కవీ కాగితం మీద పెట్టలేడు వూహించడం తప్ప.

సిగ్గు! విచారం! అభ్యర్థన! భయం! అన్నీ ఒకసారిగా ఆమె కనులలో చోటు చేసుకున్నాయి.

సారథి ఒకక్షణం యిద్దరి కనులలోకీ తీక్ష్ణంగా చూసాడు. విశ్వం (మ్రాన్పడి నిలుచున్నాడు.

"తలుపులు వేయటం మరచిపోయారు" సారథి నోటమ్మట కర్కశంగ వచ్చాయి మాటలు.

వెంటనే వడివడిగా తన గదిలోకి వెళ్లిపోయాడు.

విశ్వంకి పిచ్చెత్తినట్టయింది! 'ఏం జరిగింది? తనేం చేసాడు?' మరుక్షణం కుండపోతగా కురుస్తున్న వర్షంలోకి వీధిలోకి వెళ్లిపోయాడు తడబడే అడుగులతో.

సుచిత్ర స్థాణువులా నిలబడిపోయింది. మనసులో వేయి పిడుగులు ఒక్కసారిగా పడినట్టుగా ఉంది. ప్రపంచం అంతా చుట్టూ తిరుగుతున్నట్టనిపించింది. 'సర్వనాశనం జరిగిపోయింది. సారథి తనని క్షమించడు. తనకా అర్హతలేదు కూడాను. యింక జీవితంలో చీకటి తప్ప ఏమి మిగులలేదు' సుచిత్ర ప్రాణం లేనిదానిలా కుప్పలా కూలిపోయింది.

మళ్లీ స్పృహ వచ్చేసరికి ఎవరో తనని యెత్తుకుని మంచం మీద పడుకోపెట్టడం లీలగా గుర్తు ఉంది సుచిత్రకి. చేతి మీద ఏదో గుచ్చుకున్న బాధకి చిన్నగా మూలిగి కనులు పూర్తిగా తెరచింది.

సారథి యింట్రావీనస్ యింజెక్షను యిస్తున్నాడు. పూర్తిచేసి ప్రక్కనే కుర్చీలో కూర్చున్నాడు.

"నేను చాలా అల్పుణ్ణి సుచీ! నేను తగనని తెలిసినా అత్యాశతో నిన్ను వివాహం చేసికొని నిన్ను బాధపెట్టాను. నీ ప్రేమ పొందాలని కలలు కన్నాను. నా పొరపాటు యీనాటికి తెలిసింది. నేను నిన్ను సుఖపెట్టలేను. నీవు నన్ను ప్రేమించగలిగినా భరించలేను. నా ప్రపంచంలో నీకు తృప్తి అనేది ఉండదు. ఎక్కడికయినా వెళ్లిపో సుచీ! నా నుంచి దూరంగా." సారథి తలవంచుకుని మెల్లగా అన్నాడు.

# మిగిలిందేమిటి?

సుచిత్ర ఆఖరికి ఏడ్చే శక్తిని కూడా కోల్పోయింది. గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయింది. చెవులు మాత్రం వింటున్నాయి.

సారథి తన గదిలోకి వెళ్లిపోయాడు.

సుచిత్ర నీరసంగా మంచం పట్టుకుని లేచి నిలుచుంది. కాళ్ళు తేలిపోతున్నాయి. యిప్పుడేం జరుగబోతోంది? ప్రళయం వచ్చి తనని ముంచేసిన బాగుండును. యింత కష్టం పోయిగా ఉండేది. అయిపోయింది! తన జీవితంలో సుఖం అనేది అనుభవించి ఉంటే అది యీనాటితో సరి. ఆకులు కూడ రాలిపోయి మోడయిపోయింది తన బ్రతుకు.'

'సారథి తనని తిట్టలేదు. కొట్టి చంపేసినా బాగుండేది యీ శిక్ష కన్న. ఈ నికృష్టపు జీవితం నుంచి విముక్తి లభించేది. సారథి అంతకన్న పెద్ద శిక్ష విధించదలచాడు తనకి.'

హృదయం పగిలి వెయ్యి ముక్కలుగా విరిగిపోతున్నట్టుగా అనిపించింది. తలంతా వేడిగా కాలిపోయింది. చెవులలో క్రొత్త క్రొత్త ధ్వనులు! కనుల ముందు వింత వింత రంగులు నాట్యమాడాయి.

సుచిత్ర కాళ్ళు స్వాధీనం తప్పాయి. ఒక వెర్రికేక పెట్టి నేల మీదకి ఒరిగిపోయింది. సారథి పరుగెత్తుకుని వచ్చాడు.

వర్షం పూర్తిగా వెలసిపోయింది.

సుచిత్ర కనులు మెల్లిగా తెరుచుకున్నాయి. అంతా నిశ్శబ్దంగా ఉంది కీచురళ్ల చప్పుడు తప్ప. ప్రక్కనే సోఫాలో వెనక్కి వాలి ముఖానికి చేయి అడ్డం పెట్టుకుని పడుకుని ఉన్నాడు సారథి. గది అంతా చీకటి. సారథి ముఖం మీద మాత్రం ఎక్కడి నుంచో కీనీడ పడుతోంది.

గడియారం గంటలు కొట్టింది.

సుచిత్ర అప్రయత్నంగా లెక్కపెట్టింది. పది!

"నేను వెళ్తున్నాను." నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ వచ్చాయి గుమ్మం దగ్గర నుంచి మాటలు. సారథి ఉలికిపడి లేచి టేబిల్ లైటు వేసాడు.

విశ్వం గుమ్మంలో నిలబడ్డాడు. బట్టలన్నీ తడిసి నీళ్ళు కారుతున్నాయి. తల మీద నుంచి నీరు బొట్లు బొట్లుగా ముఖం మీదకి పడుతున్నాయి.

"బావా!" హీనస్వరంతో పిలిచింది సుచిత్ర.

విశ్వం వెనక్కితిరిగిన వాడల్లా ఆగిపోయాడు కాళ్లకు బంధాలు వేసినట్టు. సారథి లేచి విశ్వం ప్రక్కనుంచే ప్రక్కగదిలోకి వెళ్లిపోయాడు.

"నన్ను కూడ నీతో తీసికొని వెళ్ళు." సుచిత్ర నిర్జీవంగా అంది.

"వద్దు. సుచీ! కలలో కూడా యిక నా పేరు తలవకు. ఈ దౌర్భాగ్యుడి నీడ కూడా నీవాయలకి రాకూడదు." విశ్వం అన్నాడు ఎటో చూస్తూ.

"నేనిక్కడ ఒకక్షణంకూడా ఉండలేను. నా మనసు చిత్రహింసలకి ఆహుతి అయిపోతుంది. యిక్కడ చావు కూడా నా దగ్గరికి రాదు. నన్నెక్కడికయినా దూరంగా ఈ ధ్వనులేవీ వినపడని చోటుకు తీసికొని వెళ్ళు. లేదా ముందు నన్నిక్కడ చంపివేసి వెళ్ళు. బావా!" సుచిత్ర తూలుతూ వచ్చి వెక్కుతూ విశ్వం కాళ్ల మీద పడిపోయింది.

విశ్వం దిగ్భ్రాంతుడయి వెనుకకి జరిగాడు. ఒకక్షణం నిలబడి మెల్లగా సారథి గదిలోకి నడిచాడు. సారథి తలుపు వైపు వీపు ఉంచి నిలబడ్డాడు కిటికీలో నుంచి బయటకు చూస్తూ.

"సారథి!" విశ్వం పిలిచాడు.

"నాతో యేమీ చెప్పనవసరంలేదు విశ్వం! ఆమెకెలా యిష్టమయితే అలాగే చెయ్యి అందులో నా ప్రమేయం యేమీలేదు." సారథి వెనక్కితిరగకుండానే అన్నాడు.

వీధిలో టాక్సీ హారన్ మ్రోగింది.

సుచిత్ర వెనుక సీటులో జారగిలబడి కూర్చుంది. విశ్వం డ్రైవరు ప్రక్క తలుపు తెరచి ముందు సీటులో కూర్చున్నాడు.

సారథి వచ్చి మెట్ల దగ్గర నిలబడ్డాడు.

టాక్సీ సాగిపోయింది నీళ్ళు చిమ్ముకుంటూ.

"హైదరాబాదుకి టిక్కెట్టు తీసుకోనా?" విశ్వం స్టేషనులో అడిగాడు.

"వద్దు. వద్దు, మరెక్కడికయినాసరే." సుచిత్ర అంది.

"ఎక్కడికి వెళ్తున్నాం?" నీరసంగా ప్రశ్నించింది సుచిత్ర, రైలు కిటికీలో నుంచి వెనక్కి పరుగిడుతున్న చెట్లను చూస్తూ.

"కాన్పూర్."

సుచిత్ర కొంగు చెవుల చుట్టూ కప్పుకుంది. 'జీవితంలో ఒక మజిలీ ముగిసింది' మనసు చెవిలో రహస్యం చెప్పింది.

* * *

కాలచక్రం మామూలుగా దొర్లిపోతూ ఉంది. నెలరోజులు గడచిపోయాయి. విశ్వం కాన్పూర్‌లో ఉద్యోగంలో జాయిన్ అయ్యాడు. బంగళా ఒకటి అద్దెకు తీసుకున్నాడు. వంటకు మనిషి. యింకా పైపనికి నౌకర్లు. విశ్వంకి ఇటువంటివేవీ క్షణం మాత్రం కూడా తృప్తి కలిగించలేకపోయాయి. అనుక్షణం జరిగినదంతా కళ్ల ముందు గిర్రుకి వస్తోంది. మనసు వేయి ఆలోచనలతో సతమతమవుతోంది.

విశ్వం, సుచిత్ర ఒకే యింట్లో ఉన్నా మాట్లాడుకునే మాటలు తక్కువ. ఎవరో అపరిచితులు! సుచిత్ర



పరిస్థితి విశ్వం మనసుకి మరింతగా బాధ కలిగి స్తోంది. ఎక్కడికీ బయటకు రాదు. తనకతి ప్రియ మైన అన్నిరకాల పుస్తకాలు కొనిపడేసాడు. వాటిని ముట్టుకోలేదు. తన వైపు కన్నెత్తి చూడదు. పిచ్చిదానిలా ఎక్కడో చూపులు స్థిరంగా నిలిపి కళ్లార్పకుండా చూస్తూ కూర్చుంటుంది. ఎప్పు డయినా కిటికీలో నుంచి బయట ప్రపంచాన్ని చూడటం కూడా అరుదు.

'తను చదువుకున్నాడు ప్రయోజనమేముంది? పశువు కన్న హీనంగా ప్రవర్తించాడు. తన వివేకం యేమయింది? అసలు తను అక్కడికి వెళ్లకపోయినా బాగుండేది! సుచిత్ర జీవితమయినా సుఖంగా ఉండి ఉండేది. ఒకక్షణం ఆవేశానికి శిక్ష—ముగ్గురి నిండు జీవితాలు! దీనికి మరొక పరిష్కారంలేదు. అంతే బ్రతికి ఉన్నంత వరకు యిలా బాధ అనుభవించ వలసిందే' విశ్వం మనసులో వాపోయాడు.

"బావా!"

విశ్వం తల యెత్తి చూసాడు.

సుచిత్ర! ఒక నెలరోజులలో ఎంత మార్పు! చెక్కిళ్లు లోపలికి నొక్కుకొనిపోయాయి. కనులు లోటుకుపోయి చుట్టూ భయంకరంగా నల్లని నీడలు పరచుకున్నాయి.

"ఈ యింట్లో నాకు పిచ్చెత్తుతోంది ఎక్కడి కయినా వెళ్దాం" సుచిత్ర తనంత తాను అడిగింది.

విశ్వం సంతోషించాడు. ఈ విధంగా నయినా సుచిత్ర మనసులో పేరుకున్న విచారం నెమ్మదిగా కరుగుతుందేమో.

విశ్వం వెంటనే బయలుదేరాడు కనపడిన బస్ ఎక్కించాడు సుచిత్రను. బస్ ఎంతవరకూ వెళ్తుందో అంతవరకూ టిక్కెట్లు కొన్నాడు.

సుచిత్ర కిటికీ ప్రక్కన బయటకు చూస్తూ కూర్చుంది. విశ్వం ఎదురుగా కూర్చున్నాడు సుచిత్ర వంక చూస్తూ.

చివరకి ఒకచోట దిగి నడుద్దామని అంది సుచిత్ర. విశ్వం దిగాడు. సుచిత్ర ఒకగంట కాళ్లు ఎటు తీసుకెడితే అటు నడిచింది. చుట్టూ రకరకాల మనుష్యులు! వింత వింత భాషలు! విశ్వం ఎటూ చూడకుండా సుచిత్ర ననుసరించాడు.

"కాళ్లు నెప్పులు పెడుతున్నాయి బావా! యిక యింటికి పోదాం." సుచిత్ర ఆయాసంగా అంది. విశ్వం అగి ప్రక్కనే పోతున్న టాక్సీని ఆపాడు.

యిల్లు చేరేసరికి మెల్లిగా చీకటి పడింది.

మరునాడు విశ్వం ఆఫీసుకి వెళ్లబోతుండగా దగ్గరగా వచ్చి నిలబడింది సుచిత్ర.

"ఏమిటి? సుచీ! ఏమయినా కావాలా?" విశ్వం ప్రశ్నించాడు.

"ఈ వూరు నాకు నచ్చలేదు బావా! యిక్కడ బాగాలేదు. మరెక్కడికయినా వెళ్దాం."

విశ్వం ఆశ్చర్యపోయాడు. "పోనీ అంతకంటె కావలసిన దేముంది? ఎక్కడయినా సుచిత్ర ఆనం దంగా ఉంటే తన పాపం కొంత ప్రక్షాళనం అవు తుంది."

"అలాగే హైదరాబాదు డబ్బు పంపమని వ్రాస్తాను. ఒక నాలుగురోజులు ఆలస్యమవుతుంది." విశ్వం మర్నాడే ఉద్యోగానికి రాజీనామా యిచ్చేశాడు. మూడురోజుల తరువాత డబ్బు అందింది.

"కాశీ వెళ్దామా?" విశ్వం అడిగాడు.

సుచిత్ర తల వూపింది.

కాశీలో సరిగా ఒకరోజు ఉన్నారు. ఇరుకు వీధులు! నిండా యాత్రీకులు. బెనారస్ సిటీ ఒక పాడుపడ్డ దేవాలయ ప్రాంగణంలా అనిపించింది విశ్వంకి. వీలయితే ఉత్తర హిందూదేశమంతా చూపించాలి సుచిత్రకి. విశ్వం అనుకున్నాడు.

మళ్లీ రాత్రే అలహాబాదు ప్రయాణం చేసాడు.

దారిలో విశ్వం అడిగాడు "సుచీ! విశ్వనాథుణ్ణి ఏమని ప్రార్థించావు? ముందు జన్మలోనయినా యిటువంటి ఆవేశ పూరితుల నుంచి దూరంగా ఉంచమని కోరావా?"

సుచిత్ర ముఖం మ్లానమయింది.

"లేదు బావా! యికముందు స్త్రీ జన్మ ప్రసా దించ వద్దని ప్రార్థించాను." నిర్వికారంగ అంది.

అలహాబాదు నుంచి చాలావూళ్లు త్రిప్పాడు విశ్వం సుచిత్రను. నిండు పున్నమినాడు వెన్నెలలో మంచులా మెరసిపోయే తాజమహలు కూడా సుచిత్ర మనసుకి ఎక్కువ ఆనందం కలిగించలేకపోయింది. విశ్వంకి మరింక తనేం చేయగలడో అర్థం కాలేదు. ఒక్కటే మార్పు! సుచిత్ర పూర్వం అంతగా ముభావంగాలేదు. చివరకి ఢిల్లీ చేరుకున్నారు. విశ్వం పెద్ద హోటలులో గదులు తీసుకున్నాడు. చేతిలో డబ్బు నీళ్లలా ఖర్చు పెడుతున్నాడు విశ్వం ఏమాత్రం లక్ష్యపెట్టకుండా.

ఎన్నాళ్ల తరువాతో విశ్వం మొదటిసారిగా సుచిత్ర ముఖంలో ఉత్సాహం చూసాడు. విశ్వం కంటె ముందు సిటీ చూడటానికి తయారయి పోయింది సుచిత్ర.

'సుచిత్ర మనసులో మార్పు వస్తోంది. గతం మరచిపోతోంది.' విశ్వం మనసులో అమితంగా సంతో షించాడు.

సిటీ అంతా త్రిప్పి చూపడానికి టాక్సీ మాట్లా డాడు విశ్వం.

చిత్రంగా కనిపించినదల్లా ఆగి చూసారు.. చాలా భాగం సుచిత్ర దిగి కాలి నడకనే నడిచింది, దారిలో కనపడిన వస్తువల్లా కొంది. టాక్సీ పువ్వులు, పండ్లు, పుస్తకాలు విచిత్రమయిన వస్తువులతోను నిండిపోయింది.

విశ్వం ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాడు. 'ఒక్కరోజులో యింత మార్పెలా వచ్చింది?' మధ్యాహ్నం హోటలుకి మళ్లీ వెళ్లలేదు. అప్పటికి కనపడిన హోటలులో భోజనం చేసి మళ్లీ టాక్సీ ఎక్కారు.

సాయంకాలం యేదో ఎగ్జిబిషనులో తిరిగారు. సుచిత్ర అంతా విచిత్రంగా చూసింది. ఆడవారు, మగవారు కూడా హుషారుగా 'స్కైవీల్' ఎక్కి తిరిగి వస్తున్నారు.

సుచిత్ర 'మనం కూడా ఎక్కుదాం బావా!' అంది విశ్వంతో.

"వద్దు సుచీ! కళ్లు తిరుగుతున్నాయంటావు మధ్యలో. అసలే నీరసంగా ఉన్నావు అలసిపోయి" విశ్వం అన్నాడు.

"పో! బావా! ఉత్తపిరికి. చిన్నప్పుడు మన వూర్లో నవరాత్రికి రంగులరాట్నం ఎక్కి మూడు రోజులు జ్వరపడ్డావు గుర్తుందా!" సుచిత్ర నవ్వింది.

విశ్వం కూడా నవ్వాడు. అతని మనసు దూదిలా తేలికయిపోయింది. 'సుచిత్ర నవ్వింది! ఎంతోకాలం తరువాత! ఈ ఆనందం చాలు జన్మకి.' విశ్వం తేలికగా నిట్టూర్చాడు.

తరువాత దారి పొడుగునా వాళ్లనీ వీళ్లనీ చూపించి నవ్వుతూనే ఉంది సుచిత్ర. చివరకి సినిమాకి వెళ్దాం అంది.

టాక్సీని ఉండమని దగ్గరలో ఉన్న సినిమా హాలులో కూర్చున్నారు. అది యేదో హిందీ సినిమా. అదీ మొదటిసారి కాదు. విశ్వంకి ఎప్పుడో చూసిన ట్లే అనిపించింది. జనం బాగా ఎలుచగా ఉన్నారు.

యింటర్వెల్ అయి లైట్లు వెలిగాయి.

"బావా! తలనొప్పిగా ఉంది." సుచిత్ర వెనక్కి వ్రాలింది.

"హోటలుకి వెళ్ళిపోదామా?" విశ్వం అడిగాడు.

"ఊఁ" నీరసంగా తల వూపింది సుచిత్ర.

హోటలు గదిలోకి అడుగు పెడుతూనే మంచం మీద ఒరిగిపోయింది సుచిత్ర, చీరయినా మార్చు కుండా.

"సుచీ! తలనొప్పేనా! మరేమి లేదు కదా బాధ!" విశ్వం ఆదుర్దాగా అడిగాడు. లేదన్నట్లుగా తల త్రిప్పింది.

బాయ్‌ని పిలిచి కాఫీ తెమ్మని పంపించాడు విశ్వం. టాక్సీలో నుంచి కొన్న వస్తువులన్నీ మోసుకుని ఎప్పుడు హోటలు కుర్రాడు. వాటిని చూస్తూనే సుచిత్ర ముఖం చిట్లించింది.

"అవన్నీ ఎవరు తెమ్మన్నారు లోపలికి? వీధిలో పారేయండి." శక్తి కొద్దీ అరిచింది. విశ్వం ఆశ్చర్య పోయాడు. హోటలు కుర్రాడు నిర్ఘాంతపోయి నిలుచున్నాడు. వాడికేమీ అర్థంకాలేదు. వాడికి తెలుగు రాదు.

చివరకి విశ్వం ఒకమూలగా పెట్టమని సంజ్ఞ చేసాడు. వాడు అలాగే పెట్టి వెళ్లిపోయాడు. సుచిత్ర రోషాలున లేచింది ఒక్కొక్క వస్తువు తీసి నేలకేసి కొట్టింది. పుస్తకాలు చింపేసింది. గాజువస్తువులు పొడి అయిపోయాయి. సుచిత్ర ముఖం నిండా స్వేదము చేరింది. వచ్చి బెడ్ మీద వ్రాలిపోయింది ఆయాసపడుతూ.

విశ్వం మాట్లాడకుండా కూర్చున్నాడు. ఆమెను అడ్డు పెట్టే ప్రయత్నమేమీ చెయలేదు.

"సుచీ!" మెల్లిగా పిలిచాడు. "నీ మనసు బాగా లేదు. కాఫీ త్రాగు కొంచెం తలనొప్పి అయినా తగ్గు తుంది."

మరునిముషంలో విశ్వం చేతిలో కాఫీ కప్పు విసిరి గజం దూరంలో క్రింద పడింది.

"ఎందుకు బాగా లేదు నామనసు? నీకు తెలుసా? నువ్వే కారణం. నీ ముఖం నాకు చూపించకు." సుచిత్ర శరీరంలోని రక్తమంతా ముఖంలోకి ప్రవహించినట్లుగా ఎర్రబడపోయింది.

విశ్వం నిశ్శబ్దంగా తలవంచుకుని బయటకు వచ్చేసాడు. కాళ్లు వీధులలో ఎక్కడికో దారితీసాయి. చీకటిలో సిటీ అంతా లైట్లతో మెరసిపోతోంది.

'సుచిత్ర యివాళ యిలాగ ఎందుకయింది? తనేం తప్పు చేసాడు యీరోజు?' విశ్వం తల పగిలి పోతోంది ఆలోచనలతో. 'తనకి కావలసిన శిక్షే యిది' చివరకి అనుకున్నాడు. పిచ్చెత్తిన వాడిలా ఎక్కడెక్కడో తిరిగాడు. క్లాక్ టవర్ దూరంగా పదిగంటలు కొట్టింది.

'సుచిత్ర ఎక్కడికీ పోదు గదా! విశ్వంకి భయం వేసింది. గబగబా హోటలు చేరుకున్నాడు. గది తలుపు తీసి ఆత్రుతగా చూసాడు. గది అంతా తెల్లా చెదురుగా అలాగే ఉంది. క్రింద ఒలికిన కాఫీ ఎండిపోయింది. సుచిత్ర బెడ్ మీద నిద్రపోతోంది. విశ్వం బాయ్‌ని పిలిచి చప్పుడు చెయ్యకుండా గది అంతా క్లీన్ చెయ్యమని చెప్పాడు. పాడవకుండా మిగిలిన వస్తువులు వాడికే యిచ్చి పంపేసాడు.

విశ్వం బట్టలు మార్చుకున్నాడు. మంచినీళ్ళు త్రాగి లైటు ఆర్పి ప్రక్క మీదికి ఒరిగాడు. ఆలోచనలతో అలసిపోయిన మనసు త్వరగా నిద్రపోయింది.

అర్ధరాత్రి ఉలికి పడి లేచాడు విశ్వం ప్రక్కన శబ్దం విని. సుచిత్ర ప్రక్క మీద బోర్లా పడుకుని వెక్కి వెక్కి యేడుస్తోంది. విశ్వం లేచి కూర్చున్నాడు. సుచిత్ర వీపు ఆయాసంతో యెగిరి పడుతోంది.

విశ్వం మనసు నీరుగిపోయింది.

"సుచీ!" విశ్వం పిలుపులో ఆర్ద్రత పొంగి పొరలింది. సుచిత్ర విశ్వం వైపు తిరిగింది. కనులు యేడ్చినందువల్ల పొంగాయి. విశ్వంని చూసి తన యేడ్పు ఆపుకుందామనే ప్రయత్నం యేమీ చెయ్యలేదు.

"యెందుకు? నాతో చెప్పు సుచీ!" విశ్వం బాధగా అడిగాడు.

"బావా! నాకు ఆయనని చూడాలని ఉంది." సుచిత్ర మనసులో వేదన వరదలా గట్లు త్రెంచుకుంది.

'మనసులో యింతగా ప్రజ్వరిల్లుతున్న అగ్ని గోళాన్ని దాచుకుని పగలల్లా అలాగ తిరిగింది.' విశ్వం మనసు సానుభూతి, జాలితో నిండిపోయింది.

సారధి అదృష్టవంతుడు. విశ్వం ఆ క్షణాన ఒక నిర్ణయానికి వచ్చేసాడు.

"అంతేనా? యిప్పుడే ట్రంక్‌కాల్ చేస్తాను. రేపు ప్రొద్దున్న బయలుదేరి వైజాగ్ వెళ్ళిపోదాం." విశ్వం షర్టు వేసికొని బయటకు నడిచాడు.

కౌంటర్ దగ్గర నైట్ డ్యూటీ క్లర్కు నిద్రపోతున్నాడు. అతన్ని లేపి ఫోన్ తీసుకున్నాడు విశ్వం. వైజాగ్ సారధి యింటి అడ్రస్ చెప్పాడు. ఒకగంట తరువాత ఎవరో మాట్లాడారు. సారధి కాదు.

విశ్వం వివరాలడిగాడు. మనసు విచారంగా మూలిగింది. గదిలోకి రాగానే సుచిత్ర తల యెత్తి చూసింది.

"సారధి ఆ యిల్లు ఖాళీ చేసి ఎక్కడికో, స్వంత వూరేనా వెళ్ళిపోయాడుట." విశ్వం నీరసంగా అన్నాడు.

సుచిత్ర దిండులో తలదూర్చింది.

ఎప్పుడో తెలతెల వారుతుండగా నిద్రపట్టింది విశ్వంకి.

మెలకువ వచ్చేసరికి సుచిత్ర అప్పుడే లేచి స్నానం పూర్తయింది కాబోలు జుట్టు ఆరబెట్టుకుంటోంది.

విశ్వం లేచి ముఖం కడుక్కుని, స్నానం పూర్తి చేసాడు. ఇంతలో బాయ్ కాఫీ, టిఫిను తెచ్చాడు.

బల్ల మీద వ్రేలితో పిచ్చిగ రాస్తూ తలవంచుకుని అంది సుచిత్ర "రాత్రి నీ మనసు బాగా కష్టపెట్టాను. నన్ను క్షమించు బావా!"

"సుచీ! నిన్ను క్షమించగలిగే అర్హత నాకు వెయ్యి జన్మలెత్తినా రాదు." మెల్లిగా అని సుచిత్ర ముఖంలోకి చూసాడు.

తుఫాను వెలసిన తరువాత ప్రశాంతత లాగ సుచిత్ర ముఖం, నిర్మలంగా వుంది.

"మధ్యాహ్నం గ్రాండ్‌ట్రంక్‌లో వెళ్దాం. కాజీపేటలో హైదరాబాద్ పూరీ ఎక్స్‌ప్రెస్ అందుకుంటే ఆదివారం మధ్యాహ్నంకి వైజాగ్‌లో ఉంటాం." విశ్వం అన్నాడు.

"వద్దు." స్థిరంగా పలికింది సుచిత్ర.

విశ్వం ఆశ్చర్యంగా చూసాడు. 'రాత్రి అంతగా యేడ్చిన సుచిత్రేనా యిలా అంటున్నది?' మౌనంగా వూరుకున్నాడు.

"బావా! యీ జనం నిండిన చోట నేనుండలేను. ప్రశాంతంగా ఉండే చోటుకి ఎక్కడికయినా నన్ను తీసుకొని వెళ్ళు." సుచిత్ర అంది.

"ఎక్కడికి?" విశ్వం అడిగాడు.

"బదరీ వెళ్దాం."

"చాలా కష్టమయి పోతుంది. చలికి తట్టుకోలేవు."

"పర్వాలేదు. నేను భరించగలను."

సుచిత్ర కంఠంలోని నిశ్చయాన్ని గ్రహించిన తరువాత విశ్వం అడ్డు చెప్పలేదు. ఆరోజే బయలుదేరారు. దారిలో మిగిలిన యాత్రికులతో కలిసారు. విశ్వం సుచిత్రను డోలీ ఎక్కమన్నాడు. వద్దంది సుచిత్ర. యిద్దరూ కాలినడకనే అంతా పూర్తి చేసారు. చలికి స్వెట్టర్ వేసికొని పైన రగ్గులు కప్పుకున్నా విశ్వం శరీరం గజగజ లాడింది. దైవ దర్శనం చేసికొని క్రిందకు మళ్ళీ ప్రయాణమయ్యారు

దారి ప్రక్కగా చిన్న సెలయేరులాంటిది ప్రవహిస్తుంది.

"దాహం వేస్తుంది బావా! ఆనీళ్ళు త్రాగుతాను." సుచిత్ర అంది.

"మతిపోయిందేమిటి? చలికి పళ్ళు కరచుకుపోతాయి" విశ్వం అన్నాడు.

"అటు చూడు బావా!" సుచిత్ర నీటికి దగ్గరగా నడిచింది. అప్పుడే ఒక సాధువు కంఠం వరకు నీటిలో మునిగి స్నానం చేస్తున్నాడు.

విశ్వం వింతగా చూస్తూ ఉండిపోయాడు.

సుచిత్ర ఒకప్రక్క గజగజ లాడుతూనే దోసిళ్ళతో నీరుపట్టి త్రాగింది.

"పదు పోదాం. అందరూ చాలా దూరం వెళ్ళిపోయారు." విశ్వం అన్నాడు.

"కొంచెం సేపు యిక్కడే ఉందాం బావా! ఈ నిశ్శబ్దం అదీ ఎంతో ప్రశాంతంగా ఉంది. ఇక్కడున్న వాతావరణంలోని నిర్మలత్వం మరెక్కడా ఉండదనిపిస్తుంది." సుచిత్ర తృప్తిగా అంది.

"అవును తల్లీ! భగవంతుడు ఉన్న ప్రదేశమేదయినా ప్రశాంతంగానే ఉంటుంది." నీటిలో స్నానం పూర్తి చేసి బయటకు వస్తూ అన్నాడు ఆ సాధువు.

సుచిత్ర, విశ్వం ఆశ్చర్యపోయారు.

"యింత దూరంలో మీ భాష మాట్లాడుతున్నానని ఆశ్చర్యంగా ఉందా నాయనా?" సాధువు అడిగాడు. ఆయన వయసు అరవయికి పైన ఉంటుందేమో. గడ్డం, మీసాలు ముఖాన్ని చాలా వరకు మరుగుపరచాయి. విశాలమయిన ఫాలభాగం వింత వర్చస్సుతో వెలిగి పొరలుతోంది. నీళ్ళు కారుతున్న కాషాయ వస్త్రంతో అలాగే నిలబడ్డాడాయన కొంచెమైనా బాధపడకుండా.

అప్రయత్నంగా యిద్దరూ చేతులు జోడించి నమస్కరించారు. ఆయన ముఖంలోని పవిత్రత, నిర్మలత్వం వారి మనసులనలా ప్రేరేపించాయి.

"రండి. నేను కూడా మీతో ఆ కనపడే గ్రామం వరకూ వస్తాను. సాధువు అడుగు ముందుకి వేసాడు.

సుచిత్ర, విశ్వం ప్రక్కగా నడిచారు

"నేను జన్మించినది కేరళ దేశంలో తల్లీ! కాని చాలా సంవత్సరాలు ఆంధ్రదేశంలో పెరగడం వల్ల నాకు తెలుగు భాష బాగా వచ్చింది." సాధువు వివరించాడు.

"మీరు రోజూ యిక్కడ స్నానం చేస్తారా?" విశ్వం అడిగాడు.

"అవును తండ్రీ. స్నానం చేసి పైకి వెళ్ళి స్వామి దర్శనం చేసుకుంటాను. దిగివచ్చేటప్పుడు మరలా స్నానం చేసి నా ఆశ్రమానికి వెళ్ళిపోతాను. భగవంతుని దర్శనం సంవత్సరం పొడుగునా వీలుకాదు యిక్కడ." సాధువు ఆగి కాలిలో గ్రుచ్చుకున్న ముల్లు, రాయో తీసి దూరంగా విసిరాడు.

సుచిత్ర బాధగా ముఖం చిట్లించింది.

"ఈ శరీరం సుఖానికి అలవాటు చేస్తే కష్టమనేది కలుగుతుంది. చిన్నతనం నుంచి కష్టాలకే అలవాటు చేస్తే బాధ అనేది కలుగదమ్మా." ఆయన నవ్వాడు.

సుచిత్ర మనసు ఆయన యెడ గౌరవభావంతో నిండిపోయింది.

"ఇది నేనుండే స్థలం. రండి లోనికి. కొంచెం సేపు విశ్రమించి మళ్ళీ ప్రయాణం చేయవచ్చు. బడలిక తీరుతుంది." సాధువు ప్రక్కకి దారితీసాడు. సుచిత్ర విశ్వం అనుసరించారు.

అదొక చిన్న కుటీరంలా ఉంది గడ్డితో కప్పబడి. చుట్టూ చిన్న చిన్నపువ్వుల మొక్కలేవో ఉన్నాయి.

విశ్వం, సుచిత్ర జోళ్ళు ఎక్కడ విప్పడమా అని సందిగ్ధంలో పడ్డారు.

"భగవంతునికి అపవిత్రత అంటదు నాయనా, లోపలకి రండి. సాధువు లోనికి నడిచాడు. ఇద్దరూ జోళ్ళు గుమ్మంలోనే విడిచి పెట్టారు. సాధువు క్రింద పరచిన గడ్డి చాప చూపించాడు కూర్చోమని. విశ్వం చుట్టూ చూసాడు. ఒకే ఒక గది. ఒక మూలగా దేవుని పీఠం ఎత్తుగా అమర్చి ఉంది. ప్రక్కన పూజకి కావలసిన సామగ్రి. అంతకు తప్ప అక్కడ మరేయితర సామానులేదు.

"స్వామీ! మీకు భార్యాపిల్లలూ మరెవరూ లేరా?" సుచిత్ర అడిగింది.

"ఉన్నారు తల్లీ. నా దేశంలో అందరూ ఉన్నారు."

"మరయితే" సుచిత్ర అనుమానంగా ఆగిపోయింది.

"నీ అనుమానం అర్థమయిందమ్మా. ఏనాడు యీ బంధాలన్నీ నిజమయినవి కావని తెలుసుకొన్నానో ఆనాడే అందరినీ విడిచి యీ పుణ్యస్థలానికి వచ్చాను. నిజమయిన బంధం ఒక్క పరమాత్మునితోనే. ఆయన సృష్టించినవే మిగిలిన

తల్లీ, తండ్రీ, పిల్లలూ అన్నీ బంధాలుగా"

"అంతే నంటారా స్వామీ! భర్త, మిత్రుడు, అనురాగం అన్నీ మానవ సృజితాలేనా?" విప్పారిన సుచిత్ర కనులలో దైన్యం కొట్టుమిట్టాడింది.

"ఒక్కసారి పరిపూర్ణమయిన మనసుతో ఆలోచిస్తే అంతే తల్లీ. ఈ ప్రేమలు, అనురాగం కలకాలం నిలువవు. శరీరంతో నశిస్తాయి. అన్నీ భౌతికకాయానికి మాత్రమే. ఆత్మను చేరుకోవు."

"అలాగనకండి స్వామీ! నా భర్త నన్ను ప్రేమిం చారు. నా బావ ప్రేమించాడు. నేను కూడా వారిని ప్రేమించాను హృదయ శుద్ధిగా. ఇవన్నీ అసత్య మనకండి.' సుచిత్ర చిన్నపిల్లలా అంది. మనసులో వేదన ఉప్పెనే అయింది. కనుల నుండి రెండు కన్నీటి బిందువులు నేల మీదను జారి యింకి పోయాయి.

విశ్వం తలవంచుకుని కూర్చున్నాడు. వింటు న్నాడు కాని ఆమాట లేవీ అతని మీద ఏ విధమయిన ప్రభావం చూపలేకపోయాయి.

సాధువు ఒకక్షణం ఆగాడు. ఆయన చల్లని హస్తస్పర్శ సుచిత్ర బాధను మరింత వెల్లగక్కి ద్విగుణీకృతం చేసింది.

"నీ మనసులో కరడు కట్టిన దుఃఖం నీ ముఖం చూస్తేనే గ్రహించానమ్మా. ముందు నీ హృద యంలో బాధ కడిగి వేయి. నీకు మనశ్శాంతి లభి స్తుంది." ఆయన అన్నాడు. అయిదు నిముషాల తరువాత కాని సుచిత్ర తేరుకోలేకపోయింది.

"నాకు శాంతి లభిస్తుందా స్వామీ!" దీనంగా అడిగింది.

"సరయిన స్థలానికి వచ్చావమ్మా. అనుక్షణం భగవంతుని ప్రేమించు. అంతే తల్లీ నీకు చెప్ప తగినది."

"మేమిక్కడ నివసించడానికి అనువయిన స్థలం లభిస్తుందా?" సుచిత్ర మాటలకి విశ్వం తలెత్తాడు.

"సుచీ!" ఏదో చెప్పబోయాడు.

"అమ్మాయి మనశ్శాంతిని కోరుతోంది తండ్రీ. కొన్నిదినాలు యిక్కడ ఉండండి. అంతా శుభమవు తుంది. ప్రయత్నిస్తే ఏదో చిన్న యిల్లయినా లభించకపోదు." సాధువు విశ్వంతో అన్నాడు.

విశ్వం మౌనంగా లేచి నిలుచున్నాడు. సుచిత్ర కూడా లేచింది.

"ఒక నిముషం ఆగండి." సాధువు లేచి పూజా పీఠం మీద నుంచి రెండు పండ్లు తీసి యిద్దరి చేతుల్లోనూ ఉంచాడు

"మీ మేలు మరువలేను." సుచిత్ర వంగి పాదా లంటి నమస్కరించింది

"నారాయణుడు నీకు మార్గం చూపిస్తాడు." ఆయన ఆశీర్వదించాడు. విశ్వం ముఖంలో ఎట్టి భావమూ లేదు. ఎప్పుడు వెళ్ళిపోదామా అన్నట్లుగా చూస్తూ నిలబడ్డాడు.

"మళ్ళీ తమ దర్శన భాగ్యం నాకు కలుగుతుందా స్వామీ!" గుమ్మం దగ్గర సుచిత్ర వెనక్కితిరిగి ప్రశ్నించింది.

"నేను రోజూ భిక్షకు యీ గ్రామంలోకి వస్తాను. మీరిక్కడ ఉండటం జరిగితే నీయింటికి రోజూ వస్తానమ్మా." సాధువు అన్నాడు.

విశ్వం రోడ్డు మీదకి రాగానే అడిగాడు. "సుచీ! నిజంగానే యిక్కడ ఉందామనుకుంటున్నావా?"

"అవును బావా!" స్థిరంగా అంది సుచిత్ర.

"నీకు తెలుసా యింకొక రెండునెలలలో యిక్కడ నీరు కూడా గడ్డకట్టిపోతుంది." విశ్వం చిరాకుగా అన్నాడు.

"అంతవరకూ నేను జీవిస్తే కదా!" సుచిత్ర అంది.

"సుచీ! ఏమిటా మాటలు? నీ యిష్టం వచ్చినట్లు చేయి. మళ్ళీ అటువంటి మాట నా ముందు అనకు." విశ్వం బాధగా అన్నాడు.

ఆ సాయంకాలం విశ్వం కష్టపడి చిన్నయిల్లు సంపాదించగలిగాడు. మర్నాడు తనొక్కడే వెళ్ళి హోటలులో ఉంచేసిన సామాను తీసికొని వచ్చాడు. సుచిత్ర గ్రామంలో ఎక్కడి నుంచో వంటకు కావలసిన సామగ్రి యింకా ఏవో విగ్రహాలు పటాలు మోయించుకుని వచ్చింది.

రోజులు క్షణాలుగా గడిచిపోతున్నాయి. విశ్వం మళ్ళీ రెండుసార్లు డబ్బు తెప్పించుకున్నాడు.

విశ్వంకి అంతా అయోమయంగా ఉంది. సుచిత్ర దినచర్య పూర్తిగా మారిపోయింది. తెల్లవారి ఎప్పుడూ లేస్తుందో తెలియదు. ప్రొద్దున్న, రాత్రి తలస్నానం. అలాగ దేవుని ముందు కూర్చుని విరాగి నిలా కూర్చుంటుంది. మధ్యాహ్నం సాధువు వచ్చి ఒకగంట కూర్చుంటాడు ఏవో ఉపదేశిస్తూ. రాత్రి అసలు నిద్రపోతుందో లేదో తెలియదు. విశ్వం ఎప్పుడు మెలకువ వచ్చి చూసినా కళ్ళు, విప్పుకుని చీకటిలోకి చూస్తూ ఉంటుంది.

విశ్వంకి విసుగెత్తిపోయింది. ఏమి తోచదు. ఒకరోజు సుచిత్రను నిలదీసి అడిగాడు.

"ఎన్నాళ్ళిలా యిక్కడ? యింక ఒకక్షణం కూడా ఉండద్దు. పోనీ నీకు వైజాగ్ యిష్టం లేకపోతే మరేదయినా నీ యిష్టం వచ్చిన చోటు చెప్పు. అంతేకాని యిక్కడ వద్దు. సుచీ! నిన్ను చూస్తే నాకు పిచ్చెత్తుతోంది" విశ్వం అన్నాడు.

"బావా! యిన్నాళ్ళు నేను కోరినవన్నీ సమ కూర్చావు. యింక యిదొక్కటే నిన్ను కోరేది. నేనిక్కడే ఉండిపోతాను. నన్ను బలవంతం పెట్టకు" సుచిత్ర అంది. విశ్వం కోపంగా చూసాడ.

"బావా! ఎన్నాళ్ళని నన్నిలా కనిపెట్టుకు ఉంటావు? నన్ను యిక్కడ వదలి వెళ్ళిపో. నాకోసం నీ జీవితం నాశనం కావడం దేనికి? నేనిక్కడే ఉండ లేకపోను. ఎందరో ఉన్నారు. నేనొకర్తినే." సుచిత్ర మెల్లిగా అంది.

"నన్ను వెళ్ళిపొమ్మంటున్నావా? సుచీ!" విశ్వం కొంతసేపు వరకూ మళ్ళీ మాట్లాడలేక పోయాడు. "పోనీ యిక్కడే ఉండాలనుకుంటే ఉండిపో. నేను కూడా నీతో ఉంటాను. నన్ను వెళ్ళిపొమ్మనకు సుచీ!" విశ్వం మొదటిసారిగా కన్నీరు కార్చాడు.

సుచిత్ర మౌనంగ అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

రానురాను సుచిత్ర ప్రవర్తన విశ్వంకి భరించ శక్యం కాకుండా తయారయింది. విశ్వంతో మాట్లా డదు. వేళకి మాత్రం భోజనం కంచంలో పెట్టి పిలుస్తుంది. తను అసలు తింటోందో లేదో దేవుడికి తెలియాలి. కంటినిండా నిద్రపోదు. విశ్వంకి మతిపోయింది.

"సుచీ! ఒకసారి నా వంక యిలా చూడు." విశ్వం భోజనం చేస్తున్న వాడల్లా ఆగి అన్నాడు. "ఏమిటీ ఉపవాసాలు? ఎందుకు? రాత్రిళ్ళు ఎందుకని భోజనం చేయడం లేదు? యిదంతా దైవ ప్రార్థనలో భాగమా? రోజుకి ముప్పయిసార్లు స్నానం! తుడుచు కోను కూడా చేయవు. ఒకసారి అద్దంలో చూసుకో, కళ్ళు ఎలాగ గుంటలు పడ్డాయో చేతులు చీపురు పుల్లలా అయాయి."

సుచిత్ర మౌనంగా కూర్చుంది.

"నీ ఆరోగ్యం కూడా చూసుకో సుచీ! నీ కోసం కాకపోతే నా కోసం. యిలాగ చలిలో స్నానాలు, ఉపవాసాలు చేస్తే నలభయి ఏళ్ళు జీవించే వారయినా నాలుగురోజులలో దైవ సన్నిధి చేరుకుంటారు." విశ్వం ఆఖరి మాట చిరాకుగా అన్నాడు.

"అందరికీ అంతటి అదృష్టం పస్తుందా బావా!" నిర్లిప్తంగా అంది సుచిత్ర.

"అబ్బబ్బ! నన్ను చిత్రవధ చేయడం కంటె నీకు మరొకటి చేతకాదు." విశ్వం కంచంలో నీళ్ళు పోసి లేచిపోయాడు.

నాలుగురోజులు విశ్వం సుచిత్ర వంక కన్నెత్తి కూడా చూడలేదు. ప్రొద్దున్నే లేచి ఎక్కడెక్కడో తిరిగి అర్ధరాత్రి యిల్లు చేరేవాడు

ఒకరోజు రాత్రి మామూలుగా తలుపు తీసి లోపలికి అడుగు పెట్టాడు. తలుపు నుండు సుచిత్ర



వేల మీద కున్నగా పడిపోయి ఉంది.

విశ్వం గుండెల్లో అగ్నిపర్వతాలు ప్రేలాయి. గబగబా నీళ్లు తెచ్చి ముఖం మీద కొట్టాడు.

కొంచెం సేపటికి సుచిత్ర నీరసంగా కళ్లు తెరచింది.

"లేగలవా?" విశ్వం ఆసరా యిచ్చి మంచం మీద పడుకోబెట్టాడు నుదుటిమీద చేయి ఉంచి చూసాడు. అగ్ని కలికలా కారిపోతోంది.

"నాతో యిన్నాళ్లుగా చెప్పకుండా దాచుకున్నావా?" ఆదుర్దాగా ప్రశ్నించాడు.

సుచిత్ర మౌనంగా నీరసించిన కనులు మూసికొని పడుకుంది. విశ్వం చీకటిలో మళ్లీ బయటకు నడిచాడు. ముందు సాధువు ఆశ్రమానికి వెళ్లి లేపాడు. ఆయనొక్కడే తెలిసినది. ఆయనని యింట్లో సుచిత్రకి సాయం ఉండమని పంపి గ్రామంలోకి నడిచాడు. ఎవరినో లేపి అడిగితే డాక్టరు అయిదు మైళ్ల దూరంలో అదేదో గ్రామంలో ఉన్నాడని చెప్పారు. విశ్వం డబ్బిస్తానని చెప్పి గుర్తు చెప్పడానికి ఒక మనిషిని తోడు తీసికుని బయలుదేరాడు.

విశ్వం డాక్టరుతో యింటికి తిరిగి వచ్చేటప్పటికి తూర్పు తెలతెలవరుతోంది. సాధువు దగ్గరే కూర్చుని ఉన్నాడు.

డాక్టరు పరీక్ష చేసి చూసాడు. "న్యూమోనియా లక్షణాలు కనపడుతున్నాయి. బాగా నిర్లక్ష్యం చేసినట్లున్నారు.' డాక్టరు యింగ్లీషులో అన్నాడు.

విశ్వం నెత్తి కొట్టుకున్నాడు చేత్తో "మీరొక్క పరిసిన ఫీజు యిస్తాను. ఏమాత్రం అలక్ష్యం చేయకండి. పూర్తిగా తగ్గేవరకు యిక్కడే వుండిపొండి." విశ్వం బ్రతిమాలాడు.

"ఫర్వాలేదు. ప్రొద్దున్న సాయంకాలం వేసి వచ్చి చూస్తాను. ఎందుకయినా మంచిది కావలసిన వాళ్లెవరయినా ఉంటే పిలిపించండి దూరం అన్నారు కూడాను." డాక్టరు అప్పటికి యింజెక్షను యిచ్చి మందుల కోసం తనతో రమ్మన్నాడు.

విశ్వం భయపడి పోయాడు. "సుచీ! సారధి స్వంత వూరు ఎడ్రసు చెప్పు టెలిగ్రాం యిస్తాను." సుచిత్ర ముఖం మీదకి వంగి అడిగాడు. సుచిత్ర కనులు విప్పలేదు. పెదవి కదల్చలేదు.

విశ్వం గబగబా సుచిత్ర సూట్‌కేస్ తిరగేసి చూసాడు. చివరకి చీర మడతల్లో దొరికింది ఒక డైరీ. అందులో కనపడింది ఎడ్రసు. అది జేబులో పడేసుకుని డాక్టరు వెంట పరుగెత్తాడు విశ్వం.

"డాక్టర్! యిక్కడ దొరుకుతాయా యాడ్రగ్స్ యింజక్షన్స్?" విశ్వం భయంగా అన్నాడు.

"దొరుకుతాయనే అనుకుంటున్నాను. యివాళ నా మనిషిని పంపించి తెప్పిస్తాను. అయినా నా దగ్గర కొన్ని ఉన్నాయి." డాక్టరు సానుభూతిగా అన్నాడు.

మందులు పట్టుకుని వస్తూ ఆ వూళ్లో ఉన్న పోస్టాఫీసులో ట్రంక్‌కాల్ చేసాడు సారధి ఎడ్రసు చెప్పి. సారధి విశాఖపట్నంలో లేడు. స్వంత వూర్లో ఉన్నాడేమో. అక్కడ అసలు ఫోను ఉందో లేదో? విశ్వం హతాశుడయిపోయాడు.

దేవుని మీద భారం వేసి ఎక్స్‌ప్రెస్ టెలిగ్రామ్‌లు రెండు ఎడ్రసులకీ యిచ్చాడు. తన యెడ్రసు పూర్తి వివరాలు యిస్తూ.

# మిగిలిందేమిటి?

యింటికి తిరిగివచ్చిన తరువాత గుర్తుకి వచ్చింది విశ్వంకి. సుచిత్ర తండ్రికి తెలియపరచ లేదని. 'మరునాడు' అంతగా ఎక్కువయితే యిద్దాం అనిపించింది. ఆయనకి జరిగిన సంగతులేవీ తెలియవు ' విశ్వం అనుకున్నాడు.

మరునాడు, తర్వాతరోజు గడచిపోయాయి. కాని సుచిత్ర పరిస్థితిలో మార్పేమీ రాలేదు. విశ్వం సుచిత్ర తండ్రికి కూడా టెలిగ్రాం యిచ్చాడు సాధువు రాత్రింబగళ్ళు సుచిత్ర ప్రక్కనే కూర్చుని ఉంటున్నాడు ! ప్రార్థనలు చేస్తూ. డాక్టరు యింజక్షనుల ఫలం యేమీ కనపడటంలేదు.

సుచిత్ర వూపిరి తీసుకోడానికి ఆయాస పడటం ఎక్కువయిపోయింది.

"హాస్పిటల్ ఏదయినా దగ్గరలో ఉందా! జాయిన్ చేయటం మంచిదేమో?" విశ్వం డాక్టరుని అడిగాడు.

"ఇక్కడికి చాలా దూరంలో కాని ఒక మోస్తరు సౌకర్యంగా ఉండే హాస్పిటల్ లేదు. అయినా యిప్పటి పరిస్థితిలో చలిలో కదలటం అంత మంచిది కాదను కొంటున్నాను. చుట్టుప్రక్కల టాక్సీ కూడా దొరకదు." డాక్టరు అన్నాడు.

విశ్వం నిరాశగా తలవంచుకున్నాడు.

"కంగారు పడకండి. రేపు నాతో స్పెషలిస్టుని తీసుకువస్తాను. అతనిటువంటి కేసులు చాలా ట్రీట్ చేసాడు." డాక్టరు ధైర్యం చెప్పి వెళ్లిపోయాడు.

మర్నాడు డాక్టరు అతనిని తీసికొని వచ్చేసరికి పరిస్థితి యింకా దిగజారిపోయింది. ఒక్కొక్కసారి శ్వాస తీసుకోడానికి శరీరం ప్రక్క మీద ఎగిరి పడుతోంది. వచ్చిన డాక్టరు కూడా పరీక్షించాడు.

విశ్వం నీరు నిండిన కళ్లతో డాక్టరు చేతులు పట్టుకున్నాడు.

"ఈ రాత్రి గడిస్తే ఫర్వాలేదు. మేమేం చెప్పలేము." యిద్దరూ కూడబలుక్కుని అన్నారు.

విశ్వం వారిద్దరినీ ఆరాత్రికి అక్కడే ఉండి పొమ్మని బ్రతిమాలాడు.

"మేము ఉండి చేయగలిగింది కూడా యేమీ లేదు తెల్లవారి ఏమయినా తగ్గితే చెప్పండి. తప్పకుండా ప్రయత్నించవచ్చు" డక్టర్లిద్దరూ వెళ్లిపోయారు. సూర్యుడు అస్తమించాడు.

సుచిత్ర స్పైకంలో పడిపోయింది. కనులు మూతపడితే మళ్లీ ఎంతో సేపటికికాని తెరచుకోవటం లేదు. చూపులు మార్చి విశ్వం వైపు, సాధువు కేసి చూస్తోంది. రాత్రి పదిగంటలయింది. విశ్వం మంచం దిగువ కూరుని సుచిత్ర పాదాల మీద తల ఆన్చి పడుకున్నాడు.

వీధిలో మాటలు విని చివాలున లేచి తలుపు తీసాడు విశ్వం. సుచిత్ర పెదవులు వేడిశ్వాసతో తడుపుకున్న సాధువు ఆగి తలయెత్తి చూసాడు.

ఎదురుగా సారధి నిల్చున్నాడు. విశ్వం ముఖంలో ఒక ఉప్పొంగిన తృప్తి నిండింది. యిల్లు చూపించడానికి వచ్చిన వాళ్ళు వెళ్లిపోయారు.

"విశ్వం! నా సుచి నేం చేసావు? యింకా జీవించి ఉందా?" సారధి గట్టిగా విశ్వం భుజాలు పట్టి కుదిపి అడిగాడు. పెదవులు వణకుతున్నాయి. పెరిగిన గడ్డానికి సంస్కారం లేదు. ముఖం పీక్కుపోయింది.

విశ్వం మౌనంగా లోనికి దారితీసాడు.

ఒకక్షణం సారధి మంచం ప్రక్కన నివ్వెరపోయి చూస్తూ ఉండిపోయాడు. మరుక్షణం నేల మీద కూలబడిపోయాడు.

"సుచీ! నేను వచ్చాను చూడు. సారధిని. నీకోసం వచ్చాను. సుచీ! ఒకసారి కనులు తెరచి చూడు." తన అరిచేతులతో శుష్కించిన సుచిత్ర చెంపలు రాస్తూ ఒకప్రక్క కంఠం రుద్ధమయిపోతూండగా పిలిచాడు సారధి.

సుచిత్రలో చలనం లేదు. కనులు తెరువలేదు.

సారధి నిస్పృహగా తలమంచం పట్టీకి బాదుకున్నాడు. విశ్వం సారధిని గట్టిగా పట్టుకున్నాడు.

"నా సుచి నన్ను చూడటంలేదు విశ్వం!" సారధి విశ్వంని కౌగలించుకుని బావురుమన్నాడు.

"అమ్మా! నీ భర్త వచ్చాడమ్మా. ఒక్కసారి చూడు తల్లీ!" సాధువు వంగి సుచిత్ర చెవితో అన్నాడు.

రెండుసార్లు అన్న తరువాత సుచిత్ర కనులు బలహీనంగా తెరచుకున్నాయి. చూపులు అటూ యిటూ వూగిసలాడి సారధి ముఖంపై నిలిచాయి. సారధి ముందుకి వంగి సుచిత్ర నుదుట మీద ముద్దు పెట్టుకున్నాడు.

ఒక క్షణం సుచిత్ర కనులలో జీవం వచ్చింది. మళ్లీ ప్రశాంతంగా మూసికొని పోయాయి కనురెప్పలు.

ఎవరూ మాట్లాడకుండా కూర్చున్నారు. సాధువు తనలో తానే ఏవో ప్రార్థనలు చేస్తున్నాడు.

విశ్వం మనస్సులో యేముందో వూహించడం కష్టం. నిశ్చలంగా నిలబడ్డాడు.

ఒకొక్కక్క క్షణం మానవుడి చేతిలోంచి జారి పోతోంది.

సుచిత్ర శరీరంలో ప్రాణం కొట్టు మిట్టాడుతోంది.

ఆకాశంలో చంద్రుడిని మబ్బులు కమ్మివేశాయి. ఒకనక్షత్రం వెలుగుతూ నేలరాలింది. సుచిత్ర శరీరం ఆఖరిసారి దీర్ఘంగ నిశ్వసించింది. సృష్టికర్త మరొకసారి తన నాటకం ముగించాడు. ఆమె ఆత్మజ్యోతి పరమాత్మలో విలీనమయిపోయింది.

సారధి కనులనుండి కన్నీరు క్రిందకి జారింది.

'ఎక్కడ పుట్టి పెరిగిన పుష్పమో యిక్కడ రాలిపోయింది. భగవంతునికి కైంకర్యం' అయిపోయింది. ' సాధువు తనలో తానే గొణుక్కున్నాడు.

విశ్వం మౌనంగా తలుపుతీసి బయటకునడిచాడు. కాళ్లుతిన్నగా తీసికొని పోతున్నాయి. ఒక సిగరెట్టు తీసి పెదవుల మధ్య ఉంచాడు. అగ్గిపుల్లగీసి చేతిలో పట్టుకున్నాడు. ఒకక్షణం. గాలికి అది ఆరిపోయింది.

రెండడుగులు వేసి విశ్వం సిగరెట్ అగ్గిపెట్టెతో పాటు దూరంగా విసిరేసాడు. క్రమంగా అతని నీడ నిశీధిలో కలిపి పోయింది. ●

# బేగం హజ్రత్ మహల్

(1857 వ సంవత్సరం మే నెల 30 వ తేదీన సరిగ్గా అర్ధరాత్రి పన్నెండు గంటలకు రహస్యమైన సూచనలిస్తూ లక్నో రాజప్రాసాదంమీద ఫిరంగి మోగింది. ఆ రాజభవనంలో వున్నది అయోధ్యా నగరానికి పూర్వరాజ్ఞి బేగమ్ హజ్రత్ మహల్.

స్వదేశాభిమానంతో, అత్యంత పరాక్రమంతో పోరాడిన వీర వనిత బేగమ్ హజ్రత్ మహల్. లక్నో కోట గోడలమీద ఫిరంగులు శబ్దం చేస్తున్నప్పుడు ప్రపంచ చరిత్ర సరికొత్త మలుపు తిరిగింది. తర తరాలు కీర్తించ తగిన సాహసాన్ని ఆమె ప్రదర్శించారు!)

"వజీద్ అలీషాహ్‌ను ఖైదుచేసి, లార్డ్ డల్‌హౌసీ అయోధ్యానగరాన్ని వశపరచుకున్నప్పటి నుంచి గత నాలుగేళ్ళుగా నేను అయోధ్యానగరాన్ని ఏలుతున్నాను. పుర్దా వేసుకున్న ఒక యువతికి ఇంత సాహసం వుంటుందని నేనెప్పుడూ కలగనలేదు. ఇంతకాలం నుంచి బేగమ్ నివురుగప్పిన నిప్పుగా వుండిపోయింది. నేడు విజృంభించేవరకు నేనెంత అజాగ్రత్తగా వున్నానో తెలియనేలేదు. బేగమ్ భవనం నుంచి వెలుపడ ఫిరంగు మోత నన్ను మేల్కొల్పింది. అర్ధరాత్రిలో మొదలైన ఫిరంగులు తెల్లవారేసరికి బ్రిటిష్ బృహత్పథకాన్ని పేకమేడలా కూల్చేశాయి. సైన్యమే కాకుండా, ముఖ్యమైన పరివారమంతా బేగమ్ వైపుకు తిరిగిపోయింది. అయోధ్యను స్వతంత్ర రాజ్యం చేయడానికి, ఆంగ్లేయుల్ని రిక్తహస్తుల్ని చేయడానికి, ప్రజలందరూ ఆమె ఆశ్రయాన్ని పొంది కంకణం కట్టుకున్నారు."

— హెన్రీలారెన్స్.

(హైందవరాజు బాలక్రిష్ణసింగ్‌ను బ్రిటిషు వారు దోపిడీ చేసేశారు. బేగమ్ అతన్ని ముఖ్య మంత్రిగా నియోగించింది. తమకు వ్యతిరేకమైన చర్యల్లో కలగచేసుకుంటున్నాడని మవుల్వీ మహమ్మద్ షాహ్‌ను బ్రిటిషువారు జన్మాంతమూ కారాగార శిక్ష విధించారు. అతన్ని విడిపించి సైన్యాధికారిని చేసింది బేగమ్. గుర్రపుస్వారీ, తుపాకీ ప్రేల్చడం, కత్తియుద్ధం లాంటివి బేగమ్‌కు వెన్నతో పెట్టిన విద్యలు. వారం రోజుల్లో బ్రిటిషు సైన్యాన్ని అంతమొందించి, తన కుమారుడు కదీర్‌ను అయోధ్యానగరానికి యువరాజుగా ప్రకటించింది. ఆమెను ఎదిరించే శక్తి బ్రిటిష్ సైన్యానికి లేక పోయింది. సర్ కాంబెల్ ఆధ్వర్యం వహించాడు. ఆరు సేనల్ని ఒకటిగా చేసి వివిధ కోణాల్లో కోటను ముట్టడించి వశపర్చుకున్నాడు!)

"సెబాష్, వీర పురుషులారా సెబాష్! యుద్ధ భూమిలో మీరు చిందించిన వేడిరక్తం యొక్క ఫలితమే ఈ విజయం. బ్రిటిష్ చీఫ్ కమేండర్ కాంబెల్‌ను ఎదిరించేందుకు కూడా వెనుతీయవద్దని మీరు నాకు ఉత్సాహాన్నిచ్చారు. అయోధ్యను మాత్రమే కాకుండా ఆసేతుహిమాచలం సర్వస్వతంత్రం చేయడానికి మనం కృషి చేద్దాం. విదేశీయుల్ని తరిమేద్దాం. రండి, నాకు చేయూత నివ్వండి!"

— బేగమ్ హజ్రత్ మహల్.

(అన్ని భాగాల నుంచి బ్రిటిష్‌వారిపై తిరుగుబాటు ప్రారంభమయింది. శక్తి చూపించి సాహసం ప్రదర్శించగల్గుతున్నారే గాని అనుకున్నంత విజయాన్ని సాధించలేక పోతున్నారు భారతీయులు. అయినా కొత్త ఉత్సాహంతో, పట్టుదలతో కష్ట నష్టాల్నన్నిటినీ మరచిపోగల్గుతున్నారు.)

"ఓ తల్లీ, బేగమ్‌సాహెబా! మనసాటి యోధులైన ఝాన్సీ లక్ష్మీబాయి, నానాసాహెబ్ పీష్వా, తాంత్యాటోపీలకు నేనప్పుడే వర్తమానాలు పంపాను. మనం పడుతున్న కష్టాలను చూసి నిరుత్సాహపడ వద్దని చెప్పాను. ఈ కాంబెల్‌ను ఓడించిన వెంటనే దక్షిణానికి ప్రయాణమై వచ్చి మీతో చేతులు కలుపుతామని, బ్రిటిషువారి పొగ రణచడానికి మనమందరం కలిసి పనిచేద్దామని నేను కబురంపాను."— మవుల్వీ మహమ్మద్ షాహ్.

((బ్రిటిషువారు ఢిల్లీని చుట్టుముట్టి బహదూర్ షాను, ఆయన రాణిని బందీ చేశారనే వార్త వీరి నందర్నీ కలత పరచింది. రాజదంపతుల్నిద్దర్నీ బందీ చేయడమే కాకుండా బహదూర్‌షా పసిపిల్లల్ని జనరల్ హడ్సన్ హత్య చేశాడని తెలిసినప్పుడు మరింతగా విచారించారు. ఈ ఘోరకృత్యంతో అందరి రక్తం ఉడికిపోయింది.)

"జీనత్‌మహల్‌కీ జై! మా తల్లి బేగమ్ సాహెబాకు జై!! మా వీరమాత జనరల్ హడ్సన్‌ను చంపేసింది. క్రూరుడు, రాక్షసుడయిన జనరల్ హడ్సన్‌ను చంపేసింది. భలే. ఢిల్లీ పీడ విరగడయింది. వెంటనే వెళ్ళి ఖైదులోవున్న బహదూర్ షాకు, బేగమ్ జీనత్‌మహల్‌కు ఈ శుభవార్త తెలియజేయాలి. వారి కన్నీటిని తుడవాలి. జై, బేగమ్ సాహెబా.........!" — హజ్రత్ మహల్ సైనికులు.

(1857 లో మొదలైన తిరుగుబాటు 1858 వచ్చేసరికి అంతమయింది. చాలమంది వీరులు ఇంగ్లీషు వారి దెబ్బకు ఆగలేక పోయారు. కాని, బేగమ్‌సాహెబా 1859 వరకు తన జెండాను ఎగుర వేసే వుంచింది. తర్వాత నానాసాహెబ్ పీష్వా, తక్కిన యోధులు ఆమె తరఫున బ్రిటిషు వారి నెదిరించారు. ఈస్టిండియా కంపెనీవారు చేస్తున్న అన్యాయాలను తెలుసుకుని బ్రిటిష్ పార్లమెంటు సభ్యులు భారతదేశానికి వచ్చారు. ఈస్టిండియా కంపెనీ నుంచి దేశాన్ని కైవశం చేసుకుని విక్టోరియాను మహారాణిగా ప్రకటించారు.)

"భారతదేశాన్ని ఈస్టిండియా కంపెనీ దారుణ హస్తాల నుంచి తొలగించాను. భారత దేశ ప్రజల యాతి బాధల్ని గమనిస్తూ దేశాన్ని సంక్షోభరహితంగా సురక్షితంగా పాలన చేస్తానని వాగ్దానం చేస్తున్నాను. ప్రజలు విశ్వసించాలని నా కోరిక."

— విక్టోరియా మహారాణి.

(విక్టోరియారాణి ప్రకటన విన్న బేగమ్ హజ్రత్ మహల్ తానొక ప్రకటన చేసింది. తన ప్రజల కోరికగా, తన అభిప్రాయంగా గట్టిగా చెప్పింది.)

"విక్టోరియా మహారాణి కూడా విదేశస్థురాలే. ఆంగ్లేయవనితే. మనుష్యుల్ని పాలించడానికి అర్హురాలు కాదు. భారతదేశాన్ని పరిపాలించడానికి ఒక ఆంగ్లేయ యువతికి అధికారం ఎవరిచ్చారు? మా స్వంత ప్రజలకంటె ఆమె ఎక్కువేమిటి? మా రాజ్యాన్ని మేము ఏలుకోలేమా? నా భర్తను అసమర్థుడుగా ఎంచి ఖైదులో పెట్టి అయోధ్యను ఇష్టారాజ్యంగా పాలిస్తున్నారు. గత రెండేళ్ళనుంచి ఇంత పోరు ఎందుకు సాగుతున్నట్టు? అయోధ్యను మళ్లీ స్వతంత్ర రాజ్యం చేసేవరకూ, ఆంగ్లేయుల్ని పారదోలేంతవరకూ మేము నిద్రపోము. విక్టోరియా మహారాణిని అంగీకరించము. ఇది ప్రజల తరఫున నా ప్రకటన." — బేగమ్ హజ్రత్ మహల్.

(ఈ అసాధారణ ప్రకటన ఆమె సాహసానికి నిదర్శనం. ప్రజలందరు ఒక్కుమ్మడిగా ప్రోత్సాహాన్నివ్వడానికి, ఆమె చెప్పుచేతల్లో నడవడానికి ఆమె ధైర్య సాహసాలే కారణం. సర్ కాంబెల్ సైన్యం మొత్తం ఒక లక్షన్నర వరకు వుంది. అయినా అయోధ్యానగర సైన్యం ధాటికి తట్టుకోలేక పోయారు. బేగం రణరంగంలో వీరవిహారం చేసింది. రస్సెల్, మోల్‌సన్, చాన్సెబాల్ యుద్ధ వార్తల్ని విని ఆశ్చర్యపడ్డారు. లార్డ్ కన్నింగ్‌హామ్ కూడా బేగమ్, ఆమె ప్రజల దేశభక్తికి నమోవాకాలు అర్పించాడు.)



# బేగం హజ్రత్ మహల్

"బేగం, ఆమె ప్రజలు అద్భుతమైన సాహసాన్ని ప్రదర్శించారు...... కోనకోనల్లోనుండి, వాడ వాడల్లోంచి ఎంతో మంది వీరులు మమ్మల్ని ఎదిరించారు!" — 'ఇండియన్ మ్యూటినీ' అనే పుస్తకంలో మోల్‌సన్.

( రోజురోజుకీ కాంబెల్ సైన్యం పెరిగిపోతొచ్చింది. విపరీతమైన బలగంతో ఎట్టకేలకు లక్నో చేరుకుని కోటను వశపరచుకున్నాడు. ఇంత జరిగినా బేగం ధైర్యాన్ని కోల్పోలేదు. ఆడవాళ్ళు కూడా ఆమెకు తోడయ్యారు. రేయింబవళ్ళు యుద్ధం చేశారు! )

"తిరుగుబాటు సంగ్రామాల్లో ఎక్కడా ఇంత బలాన్ని మేము ఎదుర్కోలేదు. ఒక్క అయోధ్యలోనే చూశాం. జనానాల్లో వుండే ఆడవాళ్ళు ఇంతటి ధైర్యంతో శత్రువుల్ని చెండాడుతారని వూహించుకోలేకపోయాం. భారత స్త్రీలు వీర వనితలు!" — తన చరిత్ర గ్రంథంలో, రస్సెల్.

( కొద్ది మంది సైన్యం మాత్రమే మిగిలివున్న తనకు జయమనేది అసాధ్యమని బేగంకు తెలుసు. లక్నో నగరంలోని అమాయక ప్రజలు హింసింపబడుతున్నారు. స్త్రీలు, పసిపిల్లలు చంపబడుతున్నారు. ఈ హత్యాకాండను చూసి ఎవరు మాత్రం ఎలా సహించగల్గుతారు? ప్రతీకారంతో పగ తీర్చుకుందామనుకున్న ప్రజల్ని శాంత పరచింది బేగం. )

"ప్రజలు పెచ్చురేగి ఆంగ్లేయవనితల్ని చెరలో పెట్టారు. బేగం వారినందర్నీ విడిపించి తన సంరక్షణలో వుంచుకున్నది. ఎంత కష్టంలో వున్నా ఆమె యిలాంటి దయాదాక్షిణ్యాలు చూపిస్తూనే వచ్చింది. స్త్రీ లోకానికే ఆమె పవిత్రత చేకూర్చింది."— తన పుస్తకంలో సర్ చార్లెస్ బాల్.

( బేగం కోటను విడచిపెట్టేశారు. సైన్యాధికారి మవుల్వీ మహమద్ షాహ్ కోపానలంలో భస్మీపటలమైపోతున్నాయి బ్రిటిష్ సైన్యాలు. గ్రామ గ్రామాల్లోనుంచి అతను సేనను పోగు చేస్తున్నాడు. ఎంతచేసినా లాభంలేకపోయింది. చివరికి 1859 లో అయోధ్య పూర్తిగా బ్రిటిషువారి చేతికి చిక్కిపోయింది. అపజయాన్ని సహించలేని బేగం నేపాల్ వరకు వెళ్ళింది. అక్కడ జెండా నెగురవేసి తన ప్రజలకు శ్రేయోదాయకమైన మార్గాన్ని ఏర్పరచింది!)

అయోధ్యలోని మవుల్వీలు, పండితులు, పేదలు, ధనికులు, కర్షకులు, జమీందార్లు, స్త్రీలు, పురుషులు ఒకరేమిటి మొత్తం అరవై వేల మంది ఆమెను అనుసరించారు. వారంతా దాస్యశృంఖలాల నుంచి తప్పించుకోవడంకోసం బేగం వెంట హిమాలయా అడవుల్లో నుంచి ప్రయాణం సాగించారు. తలవంచకుండా విజయగర్వంతో గుర్రం మీద మార్గదర్శినిగా వెళ్తోంది బేగం. అనుచరులకు ఆకలి దప్పులెలా వుంటాయి?

"అయోధ్య ప్రజలకు బేగం అంటే ఎనలేని భక్తి విశ్వాసాలున్నాయి. ఆమె అడిగినప్పుడు ప్రాణముతో సహా సర్వస్వం ధారపోసేందుకు సన్నద్ధమై వుండేవారు ప్రజలు. ఆమె జీవితం ధన్యం!"
— గవర్నర్ జనరల్, లార్డ్ కన్నింగ్‌హామ్.

—ఏ. ను.

# వారఫలం

## 17-3-1967 శుక్రవారం మొదలు 23-3-1967 గురువారం వరకు.

**మేషం** : భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో నూతన వకాశాలు లభిస్తాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. కోర్టు వ్యవహారాల బాగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా వుంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**వృషభం** : వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగి పోతాయి. నూతన వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు వారం మధ్యలో బాగా ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మిథునం**: వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. ఉద్యోగంలో సెప్పుకురాని కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

**కర్కాటకం** వృత్తి వ్యాపారాల్లో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకుల యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం వుంది. పోటి వారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం** : కొన్ని వ్యవహారాల్లో మీకంటె పెద్దవారు కూడ మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాలు వారం మధ్యలో బాగా ఉంటాయి. వృత్తిలో పోటివారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. విద్య వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కన్య** : ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. నూతన వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు ఫలించగలవు. ఉద్యోగంలో అధికారులు కూడా మీ అభిప్రాయాలను గౌరవిస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**తుల**: లాభం రావలసిన వ్యవహారల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. నూతన వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. వారం మధ్యలో అనుకూల పరిస్థితులు యేర్పడతాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారలు అనుకూలంగా ఉంటాయి

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**వృశ్చికం** ఫలితం మాట యెలాగవున్నా ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**ధనుస్సు** : వ్యాపారంలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసి వస్తుంది. ఇతరుల మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. ఉద్యోగంలో యితరులది తప్పు అయినా మీరే సర్దుకొని పోవలసి వస్తుంది. వృత్తిలో శ్రమ అధికంగా ఉంటుంది. పోటివారితో వాద ప్రతివాదాలు తగవు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మకరం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు లాభించగలవు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల బాగా ఉంటాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కుంభం** . కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. రావలసిన డబ్బు మీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగానే ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం** : వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. కొన్ని వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడంవలన శ్రమ కలుగుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు నిరాటంకంగా నెరవేరుతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.




మిత మైన
ధర













# వైజయంతి

హారిస్



"ఎట్లా చచ్చేదిరా నీతో మొగుడా? ఎంత చెప్పినా నా మాట వినిపించుకోవాయె? పెళ్ళాన్ని కనా? ప్రొద్దున్న లేచి వొస్తివి గదా? రోడ్డు మీగ పోయ్యే ఆడపిల్లల మీదే చూపుగాని, నా ముఖమన్నా చూడవు గదా?" వరద ఆపసోపాలు వరండాలో నుంచి విని పిస్తున్నాయి.

తూర్పు తెల్లవారినా, దృశ్యాదృశ్యంగా కని పిస్తున్న మంచు తెర మాటున్న అందాల భామలు వరవశించి పోతున్న ప్రకృతిని చూస్తూ, లోపలి గది పెరటి గుమ్మంలో నించున్న రాజాకి, నవ్వు ఆగటంలేదు. అతను వూరు వొచ్చి నాలుగురోజు లైంది. పదహారేళ్ల పడుచుపిల్ల, రెండేళ్ల పసికుంక సరసాలాడటం అతనిలో కలిగించిన మధురోహ లను కాయితం మీద పెట్టటం కష్టమే.

వరద ఆపసోపాలు కొనసాగుతున్నాయి: "అబ్బ! వొద్దన్న కొద్దీ ముద్దొస్తున్నావురా నాయనా! అయినా, నేను ముద్దు పెట్టుకుంటే నా నలుపురంతా అంటుతుందేమో? దూరంగానే వుండు."

తాను నల్లగా వుంటానన్న చింత, ఆ లేతవయసు చిన్నదాన్లో, ఏదో మూల అంతర్గతంగా వున్నదన్న బాధాకరమైన నిజం రాజాకి అవగతం కాకపోలేదు.

అతను చిన్నగా నవ్వుకున్నాడు.

తనూ నల్లగానే వుంటాడు! తను అందమైన వాడు కాదు! పోనీ, అందమైన ఆడపిల్లల్ని ఆకర్షించ గలశక్తి కూడా అతనిలోలేదు. కాని, అతనికి ఏనాడూ అర్థంకాని, మనసును ఆర్ద్రమూ ఆహ్లాదమూ, చేసే నిజం మాత్రం ఒకటి ఉంది. అతను చదువు కున్న కాలేజీలో అప్సరస లాంటి అందాల భామ ఉండేది. కట్టుకున్న చీరెకూ, కాలి చెప్పులకూ కూడా నూతన సోయగాన్ని సంతరింపజేయగల సౌందర్యం ఆమెది. మాట్లాడితే వీణ మీటినట్టు వుండేది. ఆ పిల్ల రాజా అంటే పంచప్రాణాలిచ్చేది. జీవితంలో ఎన్నడూ విడిపోరాదని ఆ యిద్దరూ ఒకనాడు తీర్మా నించుకున్నారు. కాని, దేవతా వస్త్రాల్లాగా, కంటికి కనిపించని సూత్రాలు, వారిద్దర్నీ విడదీసిన రోజున, తనకన్నా ఆపిల్ల ఎక్కువ దుఃఖపడుతూంటే, రాజాకి, బాధ కన్నా ఆశ్చర్యం ఎక్కువగా కలిగింది. ఏముంది తనలో?

రాజా మెల్లిగా వరండాలోకి పోయే గుమ్మం దగ్గరకి వచ్చేసరికి, వరద, వానిగాడి చేతికి ఒక చామంతి పువ్వు యిచ్చి "లోపల యిచ్చి ఒస్తావా?" అంటు న్నది. రాజని చూడంగానే, గుంట వెధవ పరుగు పరుగున వచ్చి, పువ్వు చేతికిచ్చి కాళ్లకు చుట్టేసు కున్నాడు.

"థాంక్స్" అన్నాడు రాజా.

నాలిక కొరుక్కుని యింట్లోకి పారిపోయిన వరద ముఖాన్ని తల్చుకుంటూ, చిన్నగా నవ్వుకుంటూ వెనక్కి తిరిగాడు రాజా. చేతిలో పువ్వుని తదేకంగా చూస్తూ, తనను మేనమామ విస్మరించటంతో, వానిగాడు అతన్ని విడిచి తల్లి దగ్గరకి పోయాడు.

అప్రయత్నంగా ఆ పువ్వును కళ్ల కద్దుకున్నాడు రాజా. 'వాసనలేని పువ్వు' పద్యం అతనికి గుర్తొ చ్చింది. చామంతిలో సుగంధం లేదు. కాని ఆ పువ్వుకు పూజార్హత ఉంది. ముత్తయిదు తనాన్ని సూచించే రంగు ఉంది. నిరాడంబరంగా, అనాయకంగా ఉండే ఆ పువ్వులో........

రాజాకి చటుక్కున సావిత్రి గుర్తొచ్చింది.

సావిత్రి ఎవరు? పాతిక వసంతాల వయస్సూ అందులో సగం కూడా వయసులేని మనసూ ఉన్న సావిత్రి అతనికి 'ఒకనాడు' స్నేహితురాలు. పరి స్థితులూ, పక్కనున్న మనుష్యులూ కచ్చగట్టి పోరాడుతున్నా, తనను కన్నందు వల్ల అహోరాత్రాలూ తన కోసం తన బాబు కోసం తపించిపోతున్న తల్లి, దేవాలయంలో దుర్గాదేవి మూర్తిలా కళకళ లాడుతూ ఉండే మాతృమూర్తి, నొసటి కుంకుమ చెరిగి, దుర్భర మనోవేదనాగ్రస్తురాలు కాగా, తత్ఫ లితంగా తన మనసులో బడబాగ్ని ప్రజ్వరిల్ల, ఈ లోకం మీద, తదితర సమస్తం మీదా తనకి విశ్వాసం పోయి ద్వేషం రగులుకుంటున్న వేళ, సావిత్రి తనకి పరిచయమైంది. తనలో, తన తల్లి పోలిక రూపానికి, తాను చిత్రరూపంలో చేసిన కల్పన ఆ పిల్లని ఆకర్షించిందని రాజాకి ఆనాడు తెలియకపోయినా, అందులో అతిశయోక్తి ఉన్నదన్న

అనుమానం అవశేషం కలిగినా, రాజాకి ఆపిల్ల కేవలం పరిచయస్తురాలిగా మిగిలిపోయేది. ఆ రెండూ సంభవించకపోవటం రాజా దురదృష్టం.

'మోసం చేశావా సావిత్రీ?' అనుకున్నాడతను బాధగా.

రాజా అలా అనుకోవటం అది మొదటిసారి కాదు. కాని, అదే చివరిసారి కావాలన్న బలమైన కోరికతో, ఉద్యోగానికి సెలవు పెట్టి అతను చెల్లెలి యింటికి వచ్చాడు. అక్కడనుంచి అన్నవరం వెళ్ళాడు. ద్రాక్షారామం వెళ్ళాడు. కోటిపలి వెళ్ళాడు. ఆయా దేవాలయాల్లో, దైవమూర్తుల ముందు నిలిచి, మనస్ఫూర్తిగా, ఏకాగ్రచిత్తంతో తన కోరిక సఫలం కావాలని మొక్కుకున్నాడు. వెటకారంగా, తుస్కారంగా తాను మాట్లాడిన దేవాలయాల్లో, తాను అంతటి నిర్మల హృదయంతో, భక్తిభావంతో నిలవగలగటం అతనికే ఆశ్చర్యాన్ని కలిగించింది. అనంతమైన, మహాసాగర సదృశమైన ఈ విశ్వంలో తన స్థానం స్వల్పాతిస్వల్పమన్న నిజమూ, అయినా తనకూ ఒకస్థానం ఉన్నదన్న గర్వమూ, ఆక్షణాలలో అతన్ని ముప్పిరిగొన్నాయి.

అయినా సావిత్రి మరపు రాలేదు!

రెండు సంవత్సరాల క్రితం, ఎవరో స్నేహితు డింటికి పెళ్ళికి వెళితే, అక్కడ సావిత్రి తారస పడ్డది. సాదారకం నేత చీరె కట్టుకుని, దాదాపు బోసిగా వున్న మెడతో, చేతులతో, ఆ లోపాన్ని పూర్తిగా కప్పిపుచ్చుతున్న మందహాసం వదనంతో, ఆడపెళ్ళి వారి తాంబూలాకు వొక యువతితో కబుర్లు చెబుతూ నిలబడి వున్న ఆ పిల్లని చూడంగానే, ఒక్కక్షణం రాజా చిత్రమైన కలవరానికి లోనైనాడు. ఆ అమ్మాయి అందంగాలేదు. కాని, పువ్వులో కనిపించే కోమలత్వం, తెలుపులో గోచరించే నైర్మల్యం ఆ అమ్మాయిలో అగుపడ్డాయి.

సుముహూర్తం అయిపోయి, పెళ్ళికొడుకు వెంకట్రావు, తీరుబాటుగా తన దగ్గరకి రాగానే అడిగాడు "ఎవర్రా ఆ అమ్మాయి?" అని.

"అడిగావూ? దానికి మేం పెట్టుకున్న పేరు అగ్గిభరాటా అని. పరిచయం చేయనా?" అన్నాడు వెంకట్రావు.

"అంత అల్లరి చేస్తుందా?" అన్నాడు రాజా.

"అల్లరా? నీలాంటి వెర్రిబాగుల వెధవైతే మూడు నిమిషాల్లో పరారీ అయిపోతాడు."

"అయితే చూడవలసిందే."

"జాగ్రత్తరోయ్! అసలే కవికుమారుడివి."

"ఏడ్చావుగాని..పరిచయం సంగతి చూడు."

ఆ సాయంత్రమే రాజాకి ఆ పిల్లని పరిచయం చేశాడు వెంకట్రావు. ఫలానా పత్రికలో ఫలానా బొమ్మ వేసింది తనేనని తెలియటంతో, ఆ పిల్ల కళ్ళు పెద్దవి చేసి "మీరా?" అన్నది. ఆతర్వాత ఒక్కక్షణం అతన్ని ఎగాదిగా చూసి, తలవంచుకొని, మెల్లిగా "మీ బొమ్మ నాకు చాలా యిష్టమండీ" అన్నది.

రాజా బిడియపడ్డాడు.

"మన యిద్దరిదీ వొక వూరేగనుక అప్పుడప్పుడు కలుసుకుంటూ ఉండవచ్చు" అన్నది.

"అలాగే" అన్నాడు రాజా.

"మా యిల్లు.." ఎక్కడో చెప్పి "రేపు వూరు వెళ్ళిపోతున్నాను. వీలున్నప్పుడు రండి." అన్నది.

వెంకట్రావు కలిగించుకుని "పాడి తిక్క నీకు తెలీదేమో? పట్టుకున్నాడంటే జిడ్డులాగా వదలడు, వదిలాడా యిక నీకు కనిపించడు." అన్నాడు.

"రెండు చేతులూ కలిస్తేనే గాని చప్పట్లు రావు" అని రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది సావిత్రి....

పెద్ద మేనల్లుడు హోరుహోరుమంటూ కేకలు వేస్తూ రావటంతో రాజా ఆలోచనలు తెగిపోయాయి. ఆరేళ్ళ ఆ కుర్ర వెధవకీ, అంతకు అయిదు రెట్లు వయసు నిండబోతున్న రాజాకీ క్షణం కూడా పడదు. 'కంసుడికీ, కృష్ణుడికీ లాగా మీ యిద్దరికీ బద్ధ వైరమేమిట్రా?' అంటుంది చెల్లెలు కాత్యాయని. ఇంట్లోకి రాంగానే చేతిలో వున్న పుస్తకాల సంచీ మంచం మీద గిరవాటు వేసి "ముక్కు గిల్లేస్తాను" అన్నాడు వాడు.

"తంతాను వెధవా?" అన్నాడు రాజా.

"నాన్నగారితో చెప్పి నిన్ను చింతకాయ పచ్చడి చేయిస్తాను."

"నోర్మూయ్" గుడ్లురిమి చేశాడు రాజా.

కుర్ర వెధవ ఒక్కక్షణం భయపడి ఆతర్వాత "నన్ను పట్టుకో చూద్దాం." అంటూ తూనీగలా పారిపోయాడు.

రాజాకి ఉక్రోషం ముంచుకొచ్చింది. వాడు కుర్ర వెధవన్న ఆలోచన కన్నా, తన పెద్దరికం ఎందుకూ కొరగాకుండా పోయిందే అన్న బాధ అతనికి ఎక్కువగా కలిగింది. తనబావ వాడికి చేస్తున్న గారం వల్లనే వాడట్లా తయారవుతున్నాడనీ, పెద్దవాడయి ఎందుకూ కొరగాకుండా తయారవుతాడనీ నమ్మ దలుచుకున్నాడు. పడకకుర్చీ లోంచి లేచి, వంటింట్లో కొచ్చి "మొత్తంమీద కొడుకుని బాగానే తయారు చేస్తున్నావే?" అన్నాడు.

కాత్యాయని నవ్వి "మామూలేగాని, అలా పీట వాల్చుకు కూచో" అన్నది.

రాజా కూచున్నాడు.

"ఒక్కమాట అడుగుతాను చెబుతావుట్రా ?" అన్నది కాత్యాయని.

"అడుగు."

"దాచుకోవుగా ?"

"ఉహూ."

"వచ్చిన రోజునుంచీ చూస్తున్నాను. ఏమిటో ఆలోచిస్తూ కూచుంటున్నవు. దేన్ని గురించి?"

"అలాంటిదేమీ లేదే?"

కాత్యాయని నిట్టూర్చింది. "పోనీగాని, ఒక్క సంగతి అడగనా?"

రాజా నవ్వాడు.

"నీకు నవ్వుగానే ఉంటుందిరా!.. ఎవర్నన్నా పెళ్ళి చేసుకోవాలని వుందా?"

రాజా ఆశ్చర్యంగా చూసి "ఎవరూ లేరే?" అన్నాడు.

"సరే! లేచి కాళ్ళు కడుక్కో, అన్నం తిందువు గాని" అన్నది.

రెండునిముషాల్లో కాళ్ళు కడుక్కుని వచ్చి కంచం ముందు కూచున్నాడు రాజా. అతను అన్నం కలుపుకున్నాక "ఇరవై ఎనిమిది సంవత్సరాల వయస్సుంది. తెలియనివీ, అయోగ్యుడివీ కావు. నీ పెళ్ళి చూడాలని, అమ్మా, అమ్మమ్మా ఎంత ఆరాటపడుతున్నారో ఎరగవా? ఎవర్ని చూపించినా వద్దంటావు. నీ మనసు చెబితే మేం మాత్రం కాదన్నామట్రా? అమ్మతో చెప్పటం యిష్టం లేకపోతే నాతో చెప్పు. నేనూ మీ బావా నీ కోరిక తీరుస్తాం" అన్నది కాత్యాయని.

"నీ కూతుర్ని చేసుకోవాలని వుంది. సరేనా?"

"అయ్యో బాబోయ్! అయితే మా ఆడపడుచు పిచ్చి ఆయిపోతుందన్నమాట?"

వెనక గదిలో నుంచి సరస అన్నమాటలకి అన్నా చెల్లెళ్ళిద్దరూ ఉలిక్కిపడి, పగలబడి నవ్వుకున్నారు. రాజా వెనక్కితిరిగి "బాబాయి నంటావు? అలా తలుపు చాటు నుంచి మాట్లాడతావేమమ్మా? యిలా వచ్చి కూచో" అన్నాడు. సరస జవాబు వినిపించలేదు. క్షణం తర్వాత ఆపిల్ల అడుగుల చప్పుడు మాత్రం వినిపించింది.

"నాకు అలాంటి కూతురు వుడుతుందిటే?" అన్నాడు రాజా.

"బావుంది! సామెత చెప్పినట్టుంది నీ వరస."

రాజా నవ్వాడు.

కాత్యాయని వాత్సల్యంతో అన్నది: "ఉత్త అమాయకురాలురా! అత్తయ్య, అత్తయ్య అంటూ కూడా కూడా ఉంటుంది. ఎంత హాస్యారనుకున్నావు? వెడిపిల్లేననుకో."

"నీ కోడలు కూడా నీలాంటిదే నన్నమాట?"

కాత్యాయని నవ్వింది.

చేతులు కడుక్కొని లేచిన రాజా, వంటింటి పెరటి గుమ్మం లోంచి ఒక అందమైన దృశ్యం చూసి పాటంతో ఒక్కక్షణం ఆగాడు. పెరట్లో ఒక మందార చెట్టు ఉన్నది. ఆ చెట్టునున్న పువ్వును, సుతారమైన తన వేళ్ళతో అలవోకగా తుంచి ఒక అందమైన యువతి, సిగలో తురుముకుంటున్నది. ఆ పిల్ల ఎవరో రాజా ఎరుగును. ఆ అమ్మాయి పేరు అన్నపూర్ణ, కాత్యాయని పొరుగింటి పిల్ల. అతనిక్కడ ఉన్న నాలుగు రోజుల్లోనూ నీ అరడజను సార్లు ఆపిల్ల కనిపించింది. అపూట, తలంటి పోసుకున్నది కబోలు, పట్టుకుచ్చుల్లా వున్న శిరోజాలు, పసిమి రంగులో వున్న నుదుటిపై అల్లరిగా అల్లల్లాడు తున్నాయి. 'ఎవరో అదృష్టవంతుడు' అన్న వూహ ఒక్కక్షణం అతనిలో కలిగింది.

"ఏమిట్రా చూస్తున్నవ్?" అన్నది కాత్యాయని.

"ఏంలేదు" అని తిరిగి ముందు గదిలోకి వచ్చాడు రాజా. అతనికి, కొద్ది సంవత్సరాల క్రితం, తన మనసుని ఆక్రమించుకున్న యువతి మాలతి గుర్తు కొచ్చింది. ఆపిల్ల కూడా, యిలాగే ప్రతి శుక్రవారమూ తలంటి పోసుకునేది. కాలేజీలో చదువుకుంటున్న ఆడపిల్ల, పసుపు రాసుకుని తలంటి పోసుకోవడం అప్పట్లో అతనికి చిత్రంగా ఉండేది. పూర్తిగా పోని పసుపు ఛాయలతో ఆపిల్ల కాలేజీకి వస్తే, అతను కన్నార్పకుండా ఆమె వంక చూసేవాడు. బంగారానికి మెరుగు పూతలా ఉండే అది ఆశ్చర్యపోయేవాడు.

అన్నపూర్ణ కూడా అలాగే వుంది.

అర్థశూన్యంగా కనిపించే ఆ ఆలోచనలతో, మంచం మీద వాలి కళ్ళు మూసుకున్న రాజాకి, కొద్దినిముషాలలోనే నిద్రపట్టి పోయింది. తిరిగి తెలివి వచ్చేసరికి "అన్నపూర్ణాదేవి! ఓ కాశీవిశ్వేశ్వరి" అంటూ సరస రోడ్డు మీది నుంచే కేకలు పెట్టటం వినిపించింది. వంటింట్లో ఏదో పని చేసుకుంటున్న

కాత్యాయని పరుగుపరుగున బైటికి వచ్చి "ఓహో కోడలా! కాస్త పనుంది యిలారా" అని కేకపెట్టింది.

"ధన్యురాలను అత్తగారూ!" అంటూ ఆపిల్ల, తన చెల్లెలి వెనక వంటింట్లోకి వెళ్ళటం చూసి నవ్వుకుంటూ స్నానాల గదివేపు నడిచాడు రాజా.

ముఖం కడుక్కుని తిరిగివచ్చిన రాజాకి, తిరిగి సావిత్రిని గురించిన ఆలోచనలు కమ్ముకున్నాయి. సావిత్రి ఈవేళప్పుడు ఏంచేస్తూ ఉంటుంది? కాబోయే భర్తతో కులాసాగా కబుర్లు చెబుతూ ఉంటుంది. అందుకు తాను అసూయపడుతున్నాడనీ, ఆ భర్త స్థానం తనకే కావాలని వుందనీ, ఆలోచించిన స్వీకృత్ని తెల్సుకుని అతను జాలిపడ్డాడు.

సావిత్రితో తన స్నేహం అంత కృత్రిమంగా ఉండి ఉన్నట్లయితే తనకీ నాడు ఈ మనోవ్యాధి లేకపోయేదని రాజా అనుకున్నాడు. ఆ పిల్లదీ తనదీ ఒక కులంకాదు. వర్ణాంతర వివాహాల పట్ల తనకి వ్యతిరేకాభిప్రాయం ఎన్నడూ లేదు. మనసులు కలిసిన నాడు, సాంఘికంగా, వ్యావహారికంగా ఉండే విభేదాలు భార్యాభర్తల అన్యోన్యానికి అడ్డురావని అతను హృదయపూర్వకంగా విశ్వసించాడు. సావిత్రిని వివాహం చేసుకోవాలన్న కోరిక ఉన్నంతమాత్రాన, ఆ పిల్లకి మనసైన మనిషి మరొకడున్నప్పుడు అడ్డుపడేటంత క్రూరత్వం తనలో లేదు. ఆ సంగతి గ్రహించటానికి, అనుభవం కన్నా సంస్కారం ముఖ్యమేమో ననుకున్నాడతను.

తన పుట్టినరోజు నాడు జరిగిన సంఘటన గుర్తొచ్చింది రాజాకి. తల్లి ప్రోద్బలంమీద, ఆనాడు అతను సత్యనారాయణ వ్రతం చేసుకున్నాడు. జీవితంలో మొదటిసారిగా, చిత్తశుద్ధితో, ఏకాగ్రతతో అతను భగవధ్ధ్యానం చేసింది ఆరోజున. తన వారి సుఖం కోసం సావిత్రి భవిష్యత్తు కోసం అతను దైవాన్ని ప్రార్థించాడు. వ్రతం అయిపోయిన తర్వాత అరగంటకి సావిత్రి వచ్చింది. ఆపిల్ల పక్కన కూచుని తాను భోజనం చేయటం తన తల్లికి ఇష్టం ఉండదేమోనన్న అనుమానం వున్న రాజా, ఆమెనే వడ్డించమని తాను ఆమె పక్కనే కూచుని కబుర్లు చెప్పటానికి ఉపక్రమించాడు.

ఆరోజున కాత్యాయని అక్కడే ఉంది. దాని రెండో కొడుకు, అక్కడే అటూయిటూ తిరుగుతూ ఉంటే, సావిత్రి వాడివంక ఎగాదిగా చూడటం చూసిన రాజాకి కొద్దిగా నవ్వొచ్చింది. ఆపిల్ల వరసన కూచుని, విస్తట్లో అన్నం ముద్దలు కలిపి, తినిపించా లనిపించింది!

కాని, అందుకు ధైర్యం చాలలేదు!

సావిత్రిని కొంతదూరం సాగనంపటానికి వెళ్ళినప్పుడు రాజా ఆమెను అడిగాడు: "నీకు నానిగాడి లాంటి కొడుకు కావాలని వుంది కదూ?" అని.

సావిత్రి సిగ్గుపడి నవ్వింది.

"దిగులు పడకు. తప్పకుండా నీకలాంటి కొడుకు పుడతాడు. వాడి కెవరి పేరు పెడతావు?"

సిగ్గు అన్న సంగతి కూడా విస్మరించి పకపక నవ్వింది సావిత్రి. నవ్వు ఆగాక "నీ పేరే పెడతాను" అన్నది.

"నిజంగా?"

"అక్షరాలా!"

పాతిక వసంతాల వయసూ, కాస్తోకూస్తో అందమూ ఆకర్షగా ఉన్న సావిత్రికి అనుకూలుడైన



భర్త లభించటం అసంభవమేమీ కాదు. ఆమె కులానికి చెందిన స్నేహితులు తన కెందరో వున్నారు. అందులో ఎవర్నైనా అడిగితే?

అదేమాట అంటే "వద్దులే! నీ కెందుకు అనవసర శ్రమ?" అని సావిత్రి నవ్వేసింది.

"ఏం?...కొంపదీసి ఆ శ్రమ నువ్వే తీసుకోలేదు గదా?" అన్నాడు రాజా.

"అలాంటిదే వుంటే నీకు చెప్పకుండా ఉంటానా?"

ఆక్షణాన రాజా చాలా గర్వపడ్డాడు. చదువూ సంస్కారమూ, వివేకమూ వున్న సావిత్రికి, తనంటే ఎంత గౌరవమో ఆపిల్ల నోట వెంటే అతను చాలా సార్లు విన్నాడు. తాను నిత్యమూ పూజించే ఇల వేల్పుకీ, రాజాకీ తేడా లేదని ఆపిల్ల అన్నప్పుడు అతను ఉబ్బిపోయాడు. కన్నతల్లి దగ్గిర, తోడబుట్టిన వారి దగ్గిర చెప్పుకోలేని బాధలు ఆపిల్ల తనతో చెప్పుకున్నది (?) అతనికి చిన్నమెత్తు బాధ కలిగితే ఆపిల్ల కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది. అలాంటి సావిత్రిని, నవ్వులాటకైనా అనుమానించినందుకు, అతను బాధపడ్డాడు.

"నవ్వులాటకు అన్నాను చెల్లీ! కష్టపెట్టుకోకు" అన్నాడు.

"నువ్వు నన్ను కొట్టినా నేను బాధపడను. సరేనా?" అన్నది సావిత్రి.

ఆతర్వాత రెండురోజులు రాజా సావిత్రిని గురించిన ఆలోచనల్లోనే గడిపేశాడు. ఆమెకు తగిన భర్త కోసం ఆలోచిస్తూ, తన ఉద్యోగ బాధ్యతను కూడా విస్మరించాడు. మూడవరోజున ......

ఆరోజున ఏం జరిగిందో తల్చుకుంటే రాజాకి ఒళ్ళు జలదరిస్తున్నది! తనతో కూడ ఆమెకు రహస్యాలుండగలవన్న నిజం అతనికి భరించరానిదైంది. స్వంతానికి తనకి అన్నయ్య అంటూ ఉంటే, అది రాజేనని అందరి దగ్గిరా ఢంకాలు బజాయించి ప్రచారం చేసిన సావిత్రి, తనకు నచ్చిన వాణ్ణి ఎన్నుకున్నాననీ, ఇద్దరమూ ఒకరికొకరు ప్రమాణాలు చేసుకున్నామనీ ఎందుకు చెప్పలేకపోయింది? తాను అందరితోనూ చెబుతాడన్న భయమా? లేక స్వార్థమా? ప్రలోభమా? ఏమో? జీవిత రాజకీయాల సుడిగుండాలు, మనసుల్లో దాగి వుండే అగాధాలు, అతనికి ఆశ్చర్యకరంగా, కోప కారణంగా ఉండటం, అతని స్వయంకృతాపరాధం కాదేమో? రహస్యాలు దాచుకునే స్నేహితులు అతనికి లేరు. మనసులో ఒకటి పెట్టుకుని, పైకి ఒకటి మాట్లాడే తత్వానికి అతని తల్లిదండ్రులు అతనికి అలవాటు చెయ్యలేదు. సావిత్రి యిలా ఎందుకు చెయ్యాలి? తాను అడిగినా ఎందుకు అబద్ధం ఆడాలి?

ఆతర్వాత జరిగిన సంఘటనలు కూడా రాజా బాధను పెంచాయి. తాను ఏదో దాచుకుని చెప్పటం లేదని గ్రహించి, అతను పడిన, పడుతున్న మనోవేదన అర్థం చేసుకున్న తర్వాత కూడా, అతని అనుమానాలూ వూహలూ అన్నీ నిరాధారాలని ఒట్లూ పత్యాలూ పెట్టుకోవటం మోసం కాదా?

రాజాకి కచ్చ రేగింది....

వంటింట్లోంచి నరస మాట వినిపించింది. "బాబాయిగా రేమిటత్తయ్యా? ఎప్పుడూ ఏదో ఆలోచనలో ఉంటారేం?" అని. ఆ స్వరంలో తొణికిన చిన్నమెత్తు పరిహాసాన్ని పసిగట్టిన కాత్యాయని "జాగ్రత్తే కోడలా! వాడు నీ మామగారి లాగ పెద్దమనిషి కాదు. రౌడీ!" అన్నది.

"ముఖాలు చూస్తే తెలియదా?"

'ఏం తెలిసిందమ్మా నీకూ?' అని అడగాలని పించింది రాజాకి. నిముషం తర్వాత టిఫెన్ పళ్ళెంతో కాత్యాయని రాగా "ఏమిటే నన్ను గురించి చెప్పుకుంటున్నారు?" అన్నాడు రాజా. "ఏదోలే! నువ్వు ముందు టిఫెన్ తిను" అన్న చెల్లెలితో "ఆపిల్లకు కూడా ఏమన్నా పెట్టావా? కోడంట్రికం పెట్టడ మేనా?" అన్నాడు. కాత్యాయని నవ్వి లోపలికి వెళ్ళిపోయింది.

మరోక పావుగంటకి నరస వెళ్ళిపోయింది. కాఫీ గ్లాసుతో వచ్చిన కాత్యాయని తన అన్నగారు టిఫెన్ తినటం విస్మరించి, గది కిటికీ గుండా ఏదో దీక్షగా చూడటం గమనించి తానూ అటుచూసింది. ఎదురింటి ముందు ఆవరణలో, మంచం మీద పడుకుని వున్న అన్నపూర్ణపై వయ్యారంగా వాలి, ఏదో కబుర్లు చెబుతున్నది నరస. అన్నగారి దృష్టి ఎవరి మీద ఉందో అని ఒకక్షణం ఆలోచించి నిజం తెల్సుకున్నది!

రాజా మొహక్క తిరిగి చిన్నగా నవ్వాడు. ఒక్కక్షణం ఆగి "నిజంగా నీకు వదిన కావాలని ఉందిటే?" అన్నాడు అతను.

"ఎందుకొచ్చిందా అనుమానం?"

"నిజంగానే నీకా కోరిక వుంటే వదినగార్ని వెదక లేకపోయావా?"

అతని భావం గ్రహించిన కాత్యాయని "నేను నీ చెల్లెల్ని. భగవంతుడ్నయినా లెక్కచెయ్యనంతటి ఆత్మవిశ్వాసం, అహంకారం ఉన్న తండ్రి కూతుర్ని. నేను ప్రయత్నిస్తాననే అనుకుంటున్నావా?" అన్నది.

కాఫీ తాగటం ముగించి గ్లాసు కిందపెట్టిన రాజా, చెల్లెలు అందించిన వక్కపొడి వేసుకున్నాడు. కాత్యాయని ఒక్కక్షణం ఆగి "నేను అడిగితే ఏమీ లేదన్నావు? నరసకి కూడా అలాంటి అనుమానమే వచ్చింది చూశావా?" అన్నది.

"దానికి నేనేం చెయ్యను?" అన్నాడు రాజా.

"ఏమీ చెయ్యొద్దు! నిజం చెప్పు."

రాజా 'ఏమీ లేదన్నట్లు' తలూపాడు.

"పోనీ, నాకొక అనుమానం వుంది. అడగనా?" అన్నది కాత్యాయని.

"ఊఁ" అన్నాడు రాజా.

"సావిత్రితో దెబ్బలాడావా?"

రాజా ప్రమాన్పడిపోయాడు. శోభనంనాటి ఉదయం కూడా, ఆటాకు బొమ్మల పెళ్ళిళ్ళు చేసిన కాత్యాయని అతని దృష్టిలో ఎప్పుడూ పసిపిల్లగానే వుండేది. ఆపిల్ల అలాంటి ప్రశ్న వెయ్యగలదన్న విషయం అతనికి నమ్మరానిదిగా ఉంది. అయినా ఓటమి అంగీకరించలేక "ఎందుకలా అనుకుంటున్నావు?" అన్నాడు.

"అంతకన్నా నీ దిగులుకి కారణం కనిపించటం లేదు గనుక" అన్నది కాత్యాయని.

"దాని మీద నాకెంత ప్రేమో తెలుసును గదా? దానితో దెబ్బలాడతానా?"

"అబద్ధాలాడుతున్నావు కదూ?"

రాజా వెళ్ళాలేమిటి

కాత్యాయని మెల్లిగా అన్నది: "నీకు కోపం వస్తుందేమోగాని అన్నయ్యా! సావిత్రికి నీ మీద ఎంత ప్రేమ వున్నా, ఆ పిల్లకి నువ్వు స్వంత అన్న గారివి కాలేవు. నేనూ అక్కయ్య నీతో ఉన్నంత సన్నిహితంగా ఆపిల్ల వుండదు. ఆ సంగతి మనస్సు ఒప్పుకోలేవు. కదూ?"

"కాని...."

"అవున్నా! నీకు స్నేహితుడైనంతమాత్రాన నీతో అన్నిసంగతులూ చెప్పుకోవాలని వుందా? ఎవరి మనసులో ఏముందో ఎవరికి తెలుసు? ఆపిల్ల మనసులోని మాట తెలిసిన తర్వాత నువ్వామెకి దూరం కావచ్చు. నువ్వు దుర్మార్గుడివి కావు. నీలాంటి వాడిని పోగొట్టుకోవాలనుకున్న ఆడపిల్ల వుండదు. అదీగాక, స్వంత చెల్లెల్లయిన నాతోనే నీ బాధ చెప్పుకోవటానికి నువ్వు సందేహించావే, పరాయి పిల్ల తన మనసులో మాట ఎలా చెబుతుం దనుకున్నావు?"

"అంత దాచుకోవలసిన అవసరం ఏమొచ్చింది?"

కాత్యాయని చిరాకుపడింది. "నీ కది అర్థం కాదులే" అని అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయింది.

చెల్లెలి మాటలతో మనసు మరింత చీకాకు కాగా రాజా వరండాలోకి వచ్చాడు. ఎదురింటి ముందు అరుగుమీద అన్నపూర్ణ కనిపించింది. అతనొక్కక్షణం ఆపిల్ల వంక తేరిపార చూశాడు. అతనికి కొద్దిగా నవ్వొచ్చింది. తనిక్కడున్న నాలుగురోజుల్లోను, ఆపిల్ల గొంతు తను వినలేదు. అలాంటి ముద్దరాలికి సరస ప్రాణస్నేహితురాలు. ఆపిల్ల గొంతు ఎలా వుంటుందో తెలుసుకోవాలన్న కోరిక కలిగిందతనికి.

రాజా మెల్లిగా రోడ్డు మీదికి వచ్చాడు అడుగులు వేస్తూ అతను ఆలోచనలో పడ్డాడు. కాత్యాయని మాటల్లో ఉన్నదంతా నిజమేనేమో? ఆ సంగతి తాను ఒప్పుకోలేకుండా వున్నాడు. సావిత్రి మీద తనకున్న మమకారం తగ్గటానికి, కాత్యాయని చెప్పింది విశ్వసించటం మినహా గత్యంతరం లేదేమోనన్న శంక అతనికి పరమభయంకరంగా తోచింది.

సావిత్రిని యికమీదట కలుసుకోరాదని రాజా నిశ్చయించుకున్నాడు. తాను కనిపించకపోతే, కని పించినా పలకరించకపోతే ఆపిల్ల బాధ పడుతుంది. తను బాధపడటం తన కిష్టంలేదు. కాని, మరకపడ్డ పట్టుబట్ట కన్నా, శుభ్రమైన మామూలు గుడ్డ నయం కదా?

రాజా, రోడ్డు చివరిదాకా వెళ్ళి యింటివేపు తిరిగాడు. అతను వరండాలోకి వొచ్చేసరికి లోప ల్నుంచి సరస గొంతు వినిపించింది: "బాబాయి గారికి పూలంటే చాలా యిష్టమా అత్తయ్యా?" అని ఆపిల్ల అడుగుతోంది. రాజా అక్కడ ఆగాడు.

"ఏం?" అన్నది కాత్యాయని.

"ఇందాక అన్నపూర్ణ చెప్పింది. పొద్దున ఆయన మందార చెట్టు దగ్గిర చాలాసేపు నించున్నాడు ఆ పువ్వులు చూస్తూను. పువ్వు కోశారుట కూడాను. అదీగాక....."

"సందేహిస్తా వెందుకూ? మిగతాది కూడా చెప్పు."

"ప్రొద్దున నానిగాడి చేతికిచ్చి మీకు చామంతి పువ్వు పంపాను. అది ఆయన తీసుకుని చొక్కాకి పెట్టుకున్నారు."

కాత్యాయని నవ్వి "వాడిదో పిచ్చిలే!" అన్నది.

రాజా నవ్వుకుంటూ లోపలికి వచ్చేసరికి, ఆపిల్ల సిగ్గుతో లేచి వెళ్ళిపోయింది. కాత్యాయని అతన్ని చూసి నవ్వి "నీ పెర్రి దానికూడా తెలిసింది చూశావా?" అన్నది. రాజా చెల్లెలి వంక ఒక్కసారి ప్రేమగా చూసి తిరిగి ముందు గదిలోకి వచ్చాడు. అల్మరాలో నుంచి డ్రాయింగ్ పుస్తకము, పెన్సిలూ తీసుకుని కుర్చీలో కూచున్నాడు.

అదే క్షణాన పక్క యింట్లోని రేడియోలో నుంచి వినిపించిన పాట, వొక్కసారి అతన్ని అన్నవరం పోయే దోవలో చూసిన దృశ్యాల వేపు తీసుకు పోయింది. 'నేటి రేయి ఈ జగమంతా నవవధువులా శోభిస్తున్నద'ని ఎవరో హిందీ కవిచేసిన వూహను, వీణలాంటి కంఠం వున్న అమ్మాయి మధుర మధురంగా పాడుతోంది. తూర్పు యింకా తెల్లవారక ముందు, నిర్మలమైన చల్లటి గాలి వీస్తూన్నప్పుడు, అతను అన్నవరం బయలుదేరాడు. తోవ అంతా మనో హరంగా ఉంది. అందమైన కన్నెపిల్లలూ, వారిని తలదన్నే ప్రకృతి సౌందర్యమూ అంతటా గోచరిం చింది. బస్సు ఆగింది. దిగి, తోవ అంతా నడవాలని పించిందతనికి. ఆ దృశ్యాలను తాను కాయితం మీద పెట్టగలిగితే?....

"ఓ అన్నపూర్ణాదేవీ! నీ కిష్టమైన పాటవొస్తోంది తొందరగా రా" అని సరస కేక పెట్టటంతో, అతను ఒక్కసారి వరండాలోకి తొంగి చూశాడు. ఒక్క క్షణం తర్వాత వరండాలోనుంచి గాజుల చప్పుడు వినిపించింది. మరుక్షణాన మెరుపు తీగలా అన్న పూర్ణ నడిచి వెళ్ళిపోయింది.

నిముషం తర్వాత రేడియోలో పాట అయి పోయింది. "ఈ హిందీ పాటలు నాకు అర్థం అయి చావు! హిందీ వచ్చిన దానివి అర్థం ఏమిటో చెప్ప గాదుటమ్మా?" అన్న సరస మాట ఆ వెంటనే వినిపించింది. ఆమాటలు అంటున్నప్పుడు ఆ పిల్ల బుంగమూతి పెట్టి వుంటుంది. కరవీరపుటాకుల్లాగా వుండే ఆమె పెదవులు ముడుచుకొని వుంటాయి.

రాజా చిత్ర రచనకు ఉపక్రమించాడు.

బొమ్మ గీస్తూన్నంత సేపూ అతను సరసని గురించి ఆలోచిస్తూనే వున్నాడు. కళ్ళు చెదరగొట్టే సౌందర్యం లేకపోయినా, కమనీయమైన అందం ఏదో ఆపిల్లలో వుంది. వీణ మీటినట్లుగా ఆపిల్ల గొంతుకరేదేమో? కాని ఆ గొంతులో ఒక విచిత్రమైన మార్దవం ఉంది. ఆపిల్లను పెళ్ళి చేసుకున్నవాడు చాలా సుఖపడుతాడు, తనంత తాను కష్టాలు కొని తెచ్చుకుంటే తప్ప!

ఒక అలౌకికమైన భావనకూ, మధురమైన లోకానుభూతికీ మధ్య సరిహద్దు వంటి విచిత్రమైన పరిస్థితిలో మనసు వూగుతుంటే, రాజా తదేకదీక్షతో చిత్ర రచన సాగించాడు. అరగంట తర్వాత చేతిలో పెన్సిలు అతని యిచ్ఛ లేకుండానే ఆగిపోయింది!

'సెభాష్!' అన్నాడు పక్కనున్న శర్మ.

రాజా, గభాలున పుస్తకం మూసి "ఎంతసేపైంది మీరు వచ్చి?" అన్నాడు. శర్మ అతని పక్కనే కూచుని "రెండుమూడు సంవత్సరాలై వుంటుంది? కాని, రాజా, నువ్వు అసాధ్యుడివోయ్" అన్నాడు.

రాజా నవ్వి ఊరుకున్నాడు.

టిఫెన్ పళ్ళెంతో లోపల్నుంచి వచ్చిన కాత్యా యని "వాడు రాత్రికి వెళ్ళిపోతాడన్న సంగతి గుర్తు న్నదా?" అన్నది. శర్మ నాలుక కొరుక్కుని "నిజమే సుమా!...త్వరగా తెమలవయ్య మహానుభావా! అలా ఒకసారి బజారుకి పోయొద్దాం." అన్నాడు.

రాజా చెల్లెలి వంకా, బావగారి వంకా చూసి, విషయం అర్థం చేసుకుని "మర్యాదలు మర్చి పోతేదన్నమాట!" అన్నాడు.

"మేం చాలామర్యాదస్తులమయ్యోయ్! నీలాగా..."

"ఏమన్నావ్? వాడి కేంవచ్చింది?" అన్నది కాత్యాయని విసురుగా.

"ఏమొచ్చిందో చెబుతాగా!" అని "ముందు ముఖ ప్రక్షాళన కానియ్యి స్వామీ!" అన్నాడు శర్మ రాజా తోటి.

స్నానాలగది నుంచి రాజా తిరిగి వచ్చేసరికి, కాత్యా యనీ, శర్మా ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. అది గమనించనట్టుగా, బట్టలు తొడుక్కుని రాజా వీధిలోకి దారితీశాడు. బావగారు తనని ఎక్కడికి తీసుకుపోతున్నాడో ఎరిగివుండు ఎల్లా, తన అసమ్మతిని ప్రకటించటం వల్ల ప్రయోజన మేమీలేదని తెలిసినందువల్లా, రాజా, గుడ్డల కొట్టు ముంచి బయటపడిందాకా మౌనంగానే వున్నాడు. తిరిగి యిద్దరూ యింటి దగ్గిర కొచ్చేసరికి వరండాలో అన్నపూర్ణ ఒంటరిగా నిలబడి వుంది. వాళ్ళిద్దర్నీ చూడంగానే చెంగున లోపలికి వెళ్ళిపోయింది.

రాజా నవ్వుకున్నాడు. ఇంట్లోకి రాంగానే "ఎంట కూడా అయిపోయింది. భోజనం చేసి బయల్దేర్దాం. ఏం?" అన్నది కాత్యాయని. రాజా తలవూపాడు

"పెలవు నాలుగురోజుల పాటు పొడిగించరాదూ టయ్యా? మరికాస్త......" శర్మ ఆతర్వాత మాట అనకుండా నవ్వేశాడు.

కాత్యాయని కూడా నవ్వి "అయినా...మాఅన్నయ్య అంతటి లూకాయి లూకాయి అనుకున్నారా?" అన్నది.

"ఎందు కనుకుంటాం వేడమ్! గొప్ప ఆర్టిస్టు!" అన్నాడు శర్మ.

రాజా నవ్వుకుంటూ, వాళ్ళ మాటలు వింటూ ఆలోచనలో పడ్డాడు. తాను వేసిన సరస బొమ్మ వాళ్ళకి నచ్చినందుకు కలుగుతూన్న గర్వం ఓ పక్కన వున్నా, వూరు విడిచి వెళుతున్నామే అన్న దిగులు కూడా అతనికి కలుగుతున్నది. బెజవాడ వెళ్ళాక.... అతనికి ఆ వూహ బాధాకరంగా ఉండటానికి మరో కారణం కూడా లేకపోలేదు. ఇకపైన తాను సావిత్రిని చూడడు. చూడకుండా ఉండలేని మానసిక స్థితి తనను పూర్తిగా వదిలిపోయింది. కాని, వుండు తాలూకు మచ్చలాగా ఏదో మిగిలిపోయింది. ప్చ్!

భోజనం చేసి, చెల్లెలితో చెప్పి, బావగారితో బయలుదేరిన రాజా, అంతా కలయజూశాడు. సరస జాడా జవాబూ ఎక్కడా కనిపించలేదు. ఆ పిల్లని చూసి, తాను వెళుతున్నానని చెప్పాలని వుందని బావ గారితో అంటే? ఆయన తాటాకులు కట్టేస్తాడు! బస్టాండు దాకా వచ్చాక యిక వుండబట్టలేక బావగారితో అన్నాడు: "సరస కనిపించలేదండీ" అని.

"నే చెబుతాలే" అన్నాడు శర్మ.

రాజా అన్నాడు: "నాలుగురోజుల క్రిందటివరకూ ఆపిల్ల ఎవరో నాకు తెలీదు. ఈ రోజున, కాత్యా యని అంత ఆత్మీయురాలైపోయింది...ఒక్క టడుగుతాను, చేస్తారా బావగారూ?"

"అడుగు."

"మీకు వూళ్ళోనూ, చుట్టుపక్కలు కూడా పలుకుబడి వుంది. ఆపిల్లకి యోగ్యుడైన భర్త లభించేటట్లు చూడండి."

"ఉన్న బాధ్యతలు చాలకనా?"

రాజా నవ్వాడు.

శర్మ బావమరిది భుజం తట్టి "ఒకందుకు

(55 వ పేజీ చూడండి)

# విద్యార్థినాయకుడు శ్రీ శ్రీనివాసన్



శాసనసభ్యుడు శ్రీ శ్రీనివాసన్

విరుధ్‌నగర్ రామనాడ్ జిల్లా లోని ఒక చిన్నపట్టణం చుట్టు ప్రక్కల 170 గ్రామాలకూ అదే పట్టణం. అక్కడ 83 000 మంది వోటర్ల వరకు ఉన్నారు. ఆపట్టణానికి ఇదివరలో ఒక చరిత్ర అంటూ లేదు. సర్వ సామాన్యంగానే ఉండేది శ్రీ కామరాజ్ ఒకప్పుడు అక్కడి వారికి ఆరాధ్య దైవంగా ఉంటుండే వారు. శ్రీ శ్రీనివాసన్ విద్యార్థి నాయకుడుగా ఉంటూ అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులయిన శ్రీ కామరాజ్‌ను ఓడించి చరిత్రనొక మలుపు త్రిప్పించారు. విరుధ్‌నగర్‌కు ఒక ప్రాముఖ్యాన్ని కలగజేశారు

మద్రాసు మవుంట్‌రోడ్ చేరువగా ఉన్న గవర్నమెంట్ ఎస్టేట్ ఎంతో కోలాహలంగా ఉంది కార్లు జీపులు, టాక్సీలు కాంపవుండ్‌లో హడావిడిగా తిరుగుతున్నాయి వాటిమీద డి యమ్ కె జెండాలు ఎగురుతున్నాయి ఎరుపు నలుపు అంచుల పంచెలతోను కండువాలతోను ఉన్న లెజిస్లేటర్లు ఆ ఎస్టేటుకు వింత సొబగును కూర్చారు.

యమ్మెల్యే హాస్టలు ఎనిమిదవ నంబరుగది లోనుంచి 28 ఏళ్ల యువకుడొకరు బయటికి వచ్చారు. చామన చాయ, అంతలావూ సన్నమూ కాని పర్సనాలిటీ. చాలా సామాన్యంగా ఉన్నారు అలసటగా కన్పించారు. నిర్విరామంగా పని చేస్తున్నట్టు తెలుస్తూనే ఉంది ఆయన ఎమ్ యె, బి.యల్., విద్యార్థి నాయకుడు

నన్ను సాదరంగా లోనికి ఆహ్వానించారు ఆయన అఖండ విజయానికి అభినందనలు తెలుపుతూ కూర్చున్నాను.

"అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుణ్ని ఓడించిన విద్యార్థి నాయకుడికి నా అభినందనలు" అన్నాను సంభాషణకు ఉపక్రమిస్తూ.

"ఓడించింది విద్యార్థి నాయకుడు కాదు. అతని రూపంలో ఉన్న హిందీ వ్యతిరేక ఉద్యమం" అన్నారాయన చటుక్కున

ఆయన పేరు శ్రీనివాసన్ కాదట, పి శ్రీనివాసన్ అని సరిదిద్దుకో మన్నారు శ్రీమతి రంగమ్మ, శ్రీయుత ఎ ఎన్ పెరుమాళ్లస్వామి దంపతుల ఏకైక మగసంతానం శ్రీ శ్రీనివాసన్ శ్రీ పెరుమాళ్లస్వామి గ్రామ మునసబు ఆయనకు తెలుగు రాయనూ చదవనూ వచ్చు శ్రీ శ్రీనివాసన్‌కు నలుగురు అక్కయ్యలున్నారు వారిలో పెద్దామె వీరి సంరక్షకు రాలుగా తెలియజేశారు శ్రీ శ్రీనివాసన్ ఇంకా బ్రహ్మచారిగానే ఉంటున్నారు వారిది అతి శ్రీ యమైన సదాచారమైన నాయుడుకుటుంబంగా తెలియజేశారు

పుణ్య క్షేత్రమయిన శ్రీ విల్లిపుత్తూరు వీరి జన్మస్థలం ప్రాథమిక విద్యాభ్యాసం జన్మస్థలం లోను, మధుర త్యాగిరాయ కళాశాలలోను, మద్రాసు అమెరికన్ కళాశాలలోను ఉన్నత విద్యాభ్యాసం జరిగింది శ్రీ శ్రీనివాసన్ మిత్రులతో తెలుగు మాట్లాడుతుండగా నేను గమనించాను తమ మాతృభాష అరవం అని చెప్పారు నాతో పూర్తిగా ఇంగ్లీషులోనే మాట్లాడారు!

## రికార్డుప్లేయర్ సృష్టించిన రికార్డు

"మీవిద్యార్థి జీవితంలో నాయకత్వం వహించిన విశేషాలు చెప్పండి" అన్న నా ప్రశ్నకు ఆయన ఉత్సాహంగ ఇలా అన్నారు

"అని నేను అమెరికన్ కాలేజీలో చదువుకునే రోజులు ఒకసారి ఆగస్టు 15 స్వతంత్ర దినోత్సవం సరిగ్గా ఆదివారంరోజున వచ్చింది మేము హాస్టలు పరిసరాలు అన్నిబాగా అలంకరించాం అయితే, రికార్డుప్లేయరుంటేగాని ఉత్సవం ఉత్సాహంగా ఉండదనుకున్నాం నాకోరికను అధికారులకు తెలియపరచాను అది ఆదివారంకావడం వల్ల, చర్చిలో ప్రార్థనలకు అంతరాయం కలుగుతుందని, అందుకు అధికార్లు సమ్మతించలేదు దానితో బోలెడంత గొడవ జరిగింది విద్యార్థులు రెచ్చిపోయారు తత్ఫలితంగా నాయకత్వం వహించిన నన్ను డిస్మిస్ చేశారు. నాఇంటర్‌మీడియేట్ చదవు అంతటితో స్వస్తి చెప్పేద్దామనుకొన్నాను కాని, మా అక్కయ్య పట్టుదలతో, మళ్లీ చదవడం ప్రారంభించాను నావిద్యార్థి జీవితమంతటిలోను నేను ఏదో ఒక పదవిని, నాయకత్వాన్ని వహిస్తూ వస్తున్నాను ధరల పెరుగుదలకు నిరసన తెలియ పరచినందుకు 1962 లో జెయిలుకు వెళ్లాను ఆసమయంలోనే నేను ప్రజల దృష్టిని ఆకర్షించాను"

## విచిత్రవ్యక్తి

అదేసమయానికి ఎవరో గదిలోకి వచ్చారు, గదిలో వున్నకొత్త వ్యక్తుల్ని అనుమానంగా చూసి తృప్తిగా వెళ్లి పోయాడు

నాసందేహాన్ని శ్రీ శ్రీనివాసన్ తీర్చేశారు

"ఆయన మఫ్టీలో ఉన్న పోలీస్ హెడ్‌కానిస్టేబుల్ నారక్షణ కోసం నియోగించారు ఈ హెడ్ కానిస్టేబుల్ గారు నన్ను మూడుసార్లు శ్రీకృష్ణ జన్మస్థానానికి పంపారు నాకు బాగా పరిచయం లెండి నన్నూ ఆయన బాగా గుర్తు పట్టగలరు నా భద్రతకు ఆయన్ను నియోగించడానికిగల కారణం కూడా అదే" అన్నారు నవ్వుతూ

## హత్యా ప్రయోగం

"ఎవరికీ అటువంటి రక్షణ లేదనుకుంటాను. మీకే ప్రత్యేకంగా"

"అవును నాకే ప్రత్యేకంగా రక్షణఏర్పాటు చేశారు నేను శ్రీ కామరాజుకు ప్రత్యర్థిగా నిలబడి నప్పటినుంచి, నామీద మూడు హత్యా ప్రయత్నాలు జరిగాయి"

"వివరంగా చెప్పండి ..?"

"ఎన్నికల ప్రచారం కోసం వూరూరా తిరుగుతున్నాం మేము ఒకరోజు ప్రచారానికివెళ్లి వస్తుండగా దార్లో మమ్మల్ని కొందరు దుండగులు అడ్డగించారు నన్ను, నాసభ్యత్వాన్ని, విరమించుకో మన్నారు నేను ఒప్పుకోలేదు ఆ ముఠాలోని ఒకవ్యక్తి నామీద కత్తి విసిరాడు భగవంతుడి దయవల్ల చావుతప్పింది ఆకత్తిని మా మీటింగులో వేలం వేశాం సరిగ్గా నూటపదకొండు రూపాయిలు వచ్చాయి ఆ 'నూటపదకొండు కామరాజు గారికి నామాలు' అనే నినాదంతో ప్రచారం మొదలు పెట్టారు ప్రజలు!"

## అండదండలు

"మీ విజయానికి ముఖ్యంగా తోడ్పడింది ఎవరు?

"సోదర విద్యార్థులు నా కెంతగానో సహాయ సహకారాల నందజేశారు సుమారు నాలుగువేల మంది నాకు అండగా నిలిచారు వారందరికీ నే నెప్పుడూ కృతజ్ఞుడనై ఉంటాను రాష్ట్రంలోని ఎక్కడెక్కడి విద్యార్థులో విరుధ్‌నగర్ వచ్చి ప్రచారం చేశారు వాళ్ల స్వంత డబ్బును ఖర్చుపెట్టారు. అంతేకాదు, ఆంధ్రప్రదేశ్ లగాయితు దేశపు నలుమూలల విద్యార్థుల నుంచి నాకు మనియార్డర్లు వచ్చాయి. కలకత్తాలోని హోటల్ సర్వర్లు [illegible]

కూడా మనియార్డర్లు పంపిస్తారంటే మీకు ఆశ్చర్యంగా వుంటుంది." అంటూ వారందరికీ ఎంతో ఋణపడి వున్నట్లు, వారి కోసం తన శక్తి మేరకు ప్రయత్నించవలసి వున్నట్లు వ్యక్తం చేశారు. విద్యార్థులే కాకుండా, అక్కడి మునిసిపల్ కౌన్సిల్ సభ్యులు, తదితర కార్యకర్తలు తన విజయానికి దోహదం చేసినట్లు తెలియపరిచారు. విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొనడం అంత శ్రేయస్కరం కాదని దీర్ఘంగా ఉపన్యాసం ఇచ్చారు.

## అభిరుచులు

"మీ ఇతర వ్యాసంగాలు ఏవిటి?"

"స్పోర్ట్సు అంటే నాకు చాలా ఇష్టం. ఎమ్మే వరకు లిటరేచర్ తీసుకు చదవడానికి కారణం సాహిత్యం మీద ఉన్న అభిరుచి. కథలు, వ్యాసాలు రాశాను. పద్యాల మీద ఆసక్తి వుంది. నాటకాలు నా అభిరుచుల్లో ఒకటి."

తెలుగు రాసేందుకు రాదని, స్పష్టంగా తెలుగు వారిలా మాట్లాడలేనని చెప్పారు. వేమన పద్యాలంటే అమితమైన భక్తి వున్నట్లు, ఆ రకం సాహిత్యంపై మమకారం వున్నట్లు తెలియజేశారు.

"మీరు డి. యమ్. కె.లో ప్రవేశించే ముందు మరి ఏ యితర పార్టీ గురించయినా ఆలోచించారా?"

"ఈ ప్రశ్నకు నేను వెంటనే సూటిగా సమాధానం ఇవ్వలేను. ఇక్కడ నా మిత్రులు చాలమంది ఉన్నారు. బహుశా వారికిది నచ్చదు. అయినా చెప్తాను. నాకు కమ్యూనిజం అంటే చాల యిష్టం. ముఖ్యంగా కార్ల్ మార్క్స్ సిద్ధాంతమంటే వేసు చెవి కోసుకుంటాను."

## భవిష్యత్ కార్యక్రమం

వారి భవిష్యత్ కార్యక్రమం గురించి అడుగుతూ మీరేం పదవి ఆశిస్తున్నారని ప్రశ్నించాను. అందు కాయన జవాబివ్వడానికి నిరాకరించారు. అయినా, 'అన్నా' ఏ పదవినిస్తే దానిని ఆనందంగా స్వీకరిస్తాను, ఇవ్వకపోయినా బాధపడను, అన్నారు.

వారి ఎన్నుకున్న నియోజకవర్గంలోని ప్రజల కోర్కెలు తీర్చడానికి, గ్రామాల్ని అభివృద్ధి చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ముఖ్యంగా విద్యా విధానంలో కలగజేసుకొని, విద్యార్థులకు తగిన వసతులు చేకూర్చేందుకు ప్రభుత్వాన్ని అర్థిస్తామన్నారు. హరిజనుల దుస్థితి తలచి విచారాన్ని వ్యక్తం చేశారు. "విరుదునగర్ ప్రజలు, విద్యార్థులు నాకు అన్ని విధాలుగా సాయం చేసినందుకు వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతల్ని మీ పత్రిక ద్వారా అందజేయండి." అన్నారు.

సెలవు తీసుకుంటూ—

"మీరు మంత్రి అయిన తర్వాత మళ్ళీ కలుసుకుంటా..." అన్నాను.

దానికి శ్రీ శీనివాసన్ చిరునవ్వు నవ్వారు.

నేను గది దాటి బయటికి రాగానే అక్కడున్న జనసమూహాన్ని చూసి ఆశ్చర్యపోయాను. ఎంతోమంది ఆయన్ను కలుసుకోడానికి వేచివున్నారు! శ్రీ శీనివాసన్ విలువకు, మిగతా శాసనసభ్యుల విలువకు బడికి చాల భేదం కన్పించింది!

సి. కనకాంబరరాజు

# అవీ - ఇవీ...

## 'అల్పన కళాకేంద్రం' మహారాష్ట్ర జానపద నృత్యాలు

ఆంధ్రప్రదేశ్ ముఖ్య కేంద్రాలలో, 'అల్పన కళాకేంద్రం' (బొంబాయి) వారు మహారాష్ట్ర జానపద, సాంస్కృతిక, కళా ప్రదర్శనములు ఇచ్చారు.

బందరు హిందూ కళాశాల ఆడిటోరియంలో కార్యక్రమానికి, రాష్ట్ర సమాచార శాఖ డైరెక్టరు శ్రీ బి. ఆర్. కె. శాస్త్రి అధ్యక్షత వహించారు. కృష్ణాజిల్లా కలెక్టరు అసిస్టెంటు శ్రీ యం. రాంసింగ్ 'అల్పనకళాకేంద్ర' బృందానికి స్వాగతం చెప్పారు. శ్రీయుతులు కె. నాగభూషణరెడ్డి, ఎస్. దొరస్వామి రెడ్డి ప్రదర్శనలను తెలుగులో సుబోధకం చేశారు.

అల్పనకళాకేంద్రానికి సంబంధించిన 30 మంది కళాకారులకు నాయకురాలు శ్రీమతి సుధాకర్మార్కర్. నాయకురాలు బృందంలో వారందరినీ పరిచయం చేయగా, జిల్లా కలెక్టరు సతీమణి శ్రీమతి కేథరిన్ జాన్సన్ కళాకారులను పూలమాలలతో సత్కరించారు.

లయన్సుక్లబ్, రోటరీక్లబ్‌ల వారు బహూకరించిన వెండి షీల్డులు, సమాచారశాఖవారి నిర్మలానట రాజ చిత్రాన్ని బృందం నాయకురాలికి శ్రీమతి కేథరిన్ జాన్సన్ అందజేశారు.

'మహారాష్ట్రదర్శన్' అనే పేరుతో మహారాష్ట్రుల జీవనానికి ప్రతిబింబితాలైన తమాషా, మంగళగౌరి కొలువు, బహురూపి, బెస్తలనృత్యం, పోవాడ, భూపాళి, వాసుదేవ, గోంధాల, కర్షక నృత్యాల్ని చూసి ప్రేక్షకులు మంత్రముగ్ధులైనారు. మహారాష్ట్ర సంస్కృతిని ఆంధ్ర ప్రజలకు కరతలామలకం చేసిన 'అల్పన కళాకేంద్రం' కృషి ప్రశంసనీయమయింది.

(స్వ. వి.)

## శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ అభినందన గ్రంథము

చేనేత పారిశ్రామికోద్యమ జనకుడు, జాతీయ సేవకుడు అయిన శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ సేవల సంస్మరణార్థం, ఆయన 52వ జన్మదినాన్ని పురస్కరించుకొని, 'కొండా లక్ష్మణ్ బాపూజీ వజ్రోత్సవ సంఘం' వెలువరించిన అభినందన గ్రంథం మా కార్యాలయం చేరింది. పలువురి ప్రముఖుల సందేశాలు, శుభాకాంక్షలతో శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ పవిత్ర జీవిత సంగ్రహం ఈ గ్రంథంలో ప్రచురించబడింది.

## వైజయంతి

(53 వ పేజీ తరువాయి)

సంతోషంగా ఉందోయ్!.. పిచ్చి దిగులుతో బాధపడు తూవూరు వచ్చావు. అది వదిలించుకు పోతున్నావు. చూడు రాజా! స్నేహాన్ని తేలిగ్గా తీసుకోవటం చేయ్యకో. ఇద్దరు మనుష్యులు ఒక్కమనిషి కావటం అసాధ్యం. తెలియనివాడివి కాదు." అన్నాడు.

"థాంక్స్" అన్నాడు రాజా.

"అదిప్పుడు కాదు. నువ్వు వెంటబెట్టుకు వెళుతున్న దిగుల్ని కూడా తీర్చాక చెబుదువుగాని"

"నిజంగా తీరుస్తారా?" అన్నాడు రాజా ఆత్రంగా.

"తప్పకుండా."

రాజా సంతృప్తితో "అలోజాప మీరు దేవుడే అనుకుంటాను." అన్నాడు.

బస్సు కదలనుండటంతో, శర్మ కిందికి దిగాడు. "వెళ్ళంగానే ఉత్తరం రాయటం మర్చిపోకు" అన్నాడు. రాజా తలవూపి "బెజవాడ వెళ్ళంగానే సరస బొమ్మ కలర్ చేసి పంపిస్తాను. ఆపిల్లకి అందజేస్తారా?" అన్నాడు.

"సరస బొమ్మ కూడా వేశావా?" అన్నాడు శర్మ ఆశ్చర్యంగా.

"అదేమిటి? మీరు చూసింది." రాజా మాట పూర్తి కాకుండా బస్సు బయల్దేరింది.

అయోమయంగా నిలబడి పోయిన బావగారి ముఖం కళ్ళ ముందాడుతూండగా రాజా సీట్లో చేరగిలబడ్డాడు. ఆయన చివర్న అన్న మాటల అర్థం తాననుకుంటున్నది కాదా? చటుక్కున మరేదో అనుమానం తోచటం, అతను సూట్‌కేస్ లోంచి డ్రాయింగ్ పుస్తకం తీసి చూశాడు.

అందులో వున్న బొమ్మలో అన్నపూర్ణ పోలికలు స్పష్టంగా కనిపించాయి!



'అల్పన కళాకేంద్రం' మహారాష్ట్ర ప్రసిద్ధ జానపద నృత్యం 'తమాషా'

# కొత్తనటి

## శ్రీదేవి

ఈ సంవత్సరం కొత్తవారికి ఎంతో ఆశా జన కంగా, ప్రోత్సాహకరంగా కనిపిస్తున్నది. వచ్చిన కొత్తవారినల్లా పరిశ్రమ ఆహ్వానిస్తూనే ఉన్నది. మంచి వేషాలుయిచ్చి ప్రోత్సాహం అందజేస్తున్నది.

ఈ శీర్షికద్వారా మీకు మరొక కొత్త తార పరిచయం అవుతున్నది. ఈ అమ్మాయి పేరు శ్రీదేవి. 1945 డిసెంబరు 5 వ జన్మించింది. బాల్యం నుంచీ సంగీతమన్నా, నృత్యాలన్నా అభిలాష మెండు. రేడియోలో వచ్చేపాటల్ని వింటూ— ఆ సంగీతానికి అనుగుణ్యంగా అభినయం చేస్తూ ఉండేది. విద్యాభ్యాసం పూర్తి అయింతర్వాత నృత్యాల్లోను, నాటకాల్లోను ఎంతో శిక్షణ పొందింది. కథక్ ఈజిప్షియన్, మలయన్, స్పానిష్ నృత్యాలు చేయటంలో ఈ అమ్మాయి తనకు తానే సాటి. ఆమె ప్రదర్శనలను రెండుసార్లు తిలకించాను. ఆ యా నాట్య ప్రదర్శన సందర్భంలో అనేక బహుమతు



శిక్షణ వేళల్లో



అందము—ఆకర్షణ

లను గెలుచుకున్నది.

కథక్‌లో యీమెకు గురువు కృష్ణకుమార్. ఈజిప్షియన్, మలయన్, స్పానిష్ నృత్యాలను సిలోన్‌కు చెందిన రూఫిన్ సాల్‌డిన్ దగ్గర నేర్చుకున్నది. ఆయనకు 'కింగ్ ఆఫ్ లింబో' అనే బిరుదు ఉన్నది. పశ్చిమ దేశంలో వివిధ నృత్య ప్రదర్శనలుయిచ్చి పేరుగాంచిన ప్రసిద్ధ నర్తకుడు శ్రీ సాల్‌డిన్ మన దేశం టూర్ వచ్చినప్పుడు శ్రీదేవి ఆయనకు శిష్యరికం వహించి ఎంతో శ్రద్ధగా ఆ విదేశీ నృత్యాలను నేర్చుకున్నది.

అంద చందాల్లో కూడ శ్రీదేవి ఏం తక్కువ కాదు. ఆకర్షణీయమైన పెద్ద పెద్ద కళ్ళు, కొన దేలిన నాసిక, చక్కని శరీర సౌష్టవంతో చూపరులను ఆకట్టుకుంటుంది. తెలుగు, తమిళ, హిందీ, కన్నడ భాషల్లో ప్రవేశం ఉన్నది. ఉచ్చారణ కూడా ఎంతో స్పష్టంగా ఉంటుంది.

మధుశాలిని పేరుతో "సాలమన్ అండ్ షిబా" అనే హింగి చిత్రంలో ముఖ్య భూమిక పోషిస్తున్నది. శ్రీదేవి, తెలుగు చిత్రాల్లోనూ నటించాలని, నటించి రాణించాలనీ యీమె దృఢ సంకల్పం. చక్కటి వేషాలిచ్చి ప్రోత్సహిస్తే, వచ్చిన అవకాశాన్ని వినియోగించుకుని న్యాయం చేకూర్చగల సమర్థత శ్రీ దేవిలో ఉన్నది. 'వీర విక్రమ' కన్నడ చిత్రంలో యీ అమ్మాయి అద్భుతమయిన నృత్యం ఒకటిచేసి మంచి నర్తకిగ పేరు తెచ్చుకున్నది.

నాట్యాల్లోను, నటనలోను చక్కటి శిక్షణ పొందిన శ్రీదేవికి కూడా మన నిర్మాతలు మంచి అవకాశాలిచ్చి ప్రోత్సహించడం యీ తరుణంలో ఆవశ్యకం!

—మోహన్ కుమార్

# చిత్రలహరి

సురేష్ కంబైన్స్ వారి తొలి సాంఘిక చిత్రానికి యీనెల మొదటి తేదీన వాహినీలోని ఆరవ ఫ్లోర్‌లో ప్రారంభం జరిగింది. ఉదయం పదకొండున్నర ప్రాంతాల శ్రీ యన్. త్రివిక్రమరావు పూజచేసి కొబ్బరికాయ కొట్టారు. విజయా ప్రొడక్షన్స్ అధినేతలు శ్రీ నాగిరెడ్డి క్లాప్ కొట్టగా, శ్రీ చక్రపాణి కెమెరా స్విచ్ ఆన్ చేశారు. మొదటి షాట్ నాయికా నాయకులు కృష్ణకుమారి, యన్. టి. రామారావుల మీద తీశారు. జమిందారు భవంతి ఉపరి భాగం—పడకగది, ఓపెన్ టెర్రేస్ సెట్టును సుందరంగా రూపొందించారు, కళాదర్శకుడు రాజేంద్రకుమార్. ఈ చిత్రం ప్రారంభానికి వచ్చిన వారిలో శ్రీయు



ఇటీవల వధూవరులైన శ్రీమతి సరోజాదేవి, శ్రీ శ్రీహర్ష
—ఫొటో: యమ్. ఎ. మోహనరావు, విజయవాడ



''కంచుకోట''లో దేవిక

తులు బి. యన్. రెడ్డి, ఎల్. వి. ప్రసాద్, ఏ. వి. సుబ్బారావు, వి. రాజేంద్రప్రసాద్, ఆనంద్‌బాబు, సత్యం (విజయా డిస్ట్రిబ్యూటర్స్), యు. విశ్వేశ్వరరావు, వి. పుండరీకాక్షయ్య, పి. మల్లికార్జునరావు, డి. వి. యస్. రాజు, కొసరాజు, భానుప్రసాద్, కొండారెడ్డి, పద్మనాభం, హేమమాలిని రమాప్రభ మున్నగువారు ఉన్నారు.

యన్. టి. రామారావు, కృష్ణకుమారి, కృష్ణ, ఎల్. విజయలక్ష్మి, అంజలీదేవి, పద్మనాభం, గీతాంజలి, ప్రభాకరరెడ్డి, రాజ్‌బాబు, రమాప్రభ ముఖ్యభూమికలు పోషిస్తున్న యీ చిత్రానికిగాను గత నెల 22 న రెండు పాటలు రికార్డు చేశారు. వాటిలో ఒకటి ఆరుద్ర, మరొకటి దాశరథి రాశారు. ఈ రెండూ యుగళ గీతాలు. సుశీల, ఘంటసాల ఆలపించారు. ఒకటి రామారావు, కృష్ణకుమారిల మీదా, ఇంకొకటి కృష్ణ, ఎల్. విజయలక్ష్మిల పైనా చిత్రీకరణ జరుపుతారు. సంగీతం ఘంటసాల సమకూర్చారు. సంభాషణలు: సముద్రాల (జూనియర్), కెమెరా: పి. నాగేశ్వరరావు, కూర్పు: మార్తాండ్, నృత్యాలు: కె. యస్. రెడ్డి, సహకార దర్శకులు: జి. వి. ఆర్. శేషగిరిరావు, కె. రాఘవేంద్రరావు, కె. బాపయ్య, దర్శకుడు: కె. యస్. ప్రకాశరావు. నిర్మాత: డి. రామానాయుడు. విజయా పిక్చర్స్ వారు యీ చిత్రానికి పంపిణీదారులు.

* * *

''మా తమ్ముడికి కొడుకు పుట్టాడండీ!'' అన్నది ఆనందంగా జమున. తమ్ముడంటే గిరిధర్. కాకినాడలో ఎం. బి. బి. యస్. ఫైనల్ ఇయర్ చదువుతున్నారాయన........'' వీనస్ స్టూడియోలో యస్. వి. ఆర్. ఫిలిమ్స్ ''చదరంగం'' సెట్ బయట విరామ సమయంలో యీ మాట చెప్పింది. ''అంతా నా రిజంబ్లెన్సే! ఆ పెదవులు, గెడ్డం అచ్చు అన్నీ నా పోలికలే!...... పిల్లలకు మేనత్త మేనమామల పోలికలు రావటం విచిత్రమే!'' అన్నదామె తిరిగి. ఈ మాటలంటున్నపుడు ఆమె దృష్టి యిక్కడ లేదు, ఆవడిలో వున్న మేనల్లుడి దగ్గిరకి వెళ్లింది.

* * *

''ఏమిటి?'' అంటూ సెట్ లోపల్నుంచి రంగారావుగారు యివతలికి వచ్చారు. ''ఆ! ఏముందీ!'' అంటూ నావేపు తిరిగి ''పిక్చరు అంతా బాగా వచ్చిందంటున్నారని దానికి గర్వం వచ్చేసిందండీ!'' అన్నది జమున. ''ఎవరికీ, నాకా?'' అన్నారు, రంగారావుగారు కాస్త కంగారుపడి. ''ఆ! దాంతో అంతకు ముందు రెండు మాసాల పొట్టవుంటే యిప్పుడు తొమ్మిది మాసాల గర్భిణీలా వచ్చేసింది!'' అంటూ



''భక్త ప్రహ్లాద''లో రేలంగి, పద్మనాభం.



# చిత్రలహరి



"భువనసుందరి కథ"లో యన్. టి. రామారావు



"నువ్వే"లో జయలలిత

అందంగా నవ్వింది జమున. "సిస్టీ!" అన్నారు, రంగారావుగారు తనూ సరదాలోకి దిగుతూ. ఇంతలో సహకార దర్శకుడు కె. వి. నందన్‌రావు పిలిచారు. తర్వాత షాట్ ఏర్పాట్లకోసం రంగారావుగారు లోపలికి వెళ్లారు.

* * *

"మంచి ఎక్స్‌పర్ట్ డైరెక్టర్‌లా తీస్తున్నారండీ డాడీ! చదరంగం విడుదలయిం తర్వాత డాడీకి



"కంచుకోట"లో సావిత్రి

డైరెక్టర్‌గా మంచి పేరు వస్తుంది!" అన్నది మళ్ళీ జమున. ఆమెకు రంగారావుగార్ని డాడీ అని పిలవటం అలవాటు....... నిజానికి జమున చెప్పినట్లు— రంగారావుగారికి దర్శకత్వంలో "చదరంగం" మొదటి చిత్రమే అయినా, ఆయన షాట్స్ డివిజనూ టేకింగూ చూస్తున్నపుడు అనుభవజ్ఞుడయిన దర్శకుడు తీస్తున్నట్లే నాకూ అనిపించింది. చలన చిత్ర పరిశ్రమలో రెండు దశాబ్దాల అనుభవం వున్న వ్యక్తి. తెలుగు వారంతా గర్వించదగ్గ నటుడు. అలాంటి రంగారావుగారి దర్శకత్వంలో తయారవు



'వసంతసేన'లో నాగేశ్వరరావు, పద్మిని



"నువ్వే"లో జయలలిత

తున్న "చదరంగం" మే నెలలో మీ ముందుకు వస్తున్నది.

*　　*　　*

ఈ చిత్రంలో జమున సీత పాత్ర ధరిస్తున్నది. ముందు నటించిన పాటన్నిటికన్నా భిన్నమయినది. క్లిష్టమయిన భూమిక. హరనాథ్ పక్కన నాయిక. స్వాభిమానంతో, మాట పట్టింపుల మధ్య చీలి పోయిన కుటుంబాన్ని— కష్టాల స్రవంతినీ చిరు నవ్వుతో అరుదయిన సహనంతో సాధించి నెగ్గు కొచ్చిన పడతి సీత. ఆమె కథే "చదరంగం."

*　　*　　*

శ్రీ లక్ష్మీనారాయణ ప్రొడక్షన్స్ అనే కొత్త సంస్థ "చిక్కడు— దొరకడు" పేరుతో ఒక జానపద చిత్రాన్ని నిర్మించ నున్నది. ఈ చిత్రానికి గాను సి. నారాయణరెడ్డి రాసిన రెండు పాటలను సుశీల పాడగా రికార్డు చేశారు. యన్. టి. రామా రావు, జయలలిత, కాంతారావు, కృష్ణకుమారి, బాల కృష్ణ యింతవరకు ముఖ్య భూమికలు పోషిం చేందుకు ఎన్నుకోబడినారు. రచన: వీటూరి. సంగీతం: టి. వి. రాజు, కళ: నాగరాజన్, కెమెరా: హెచ్. ఎస్. వేణు, అసోసియేట్ డైరెక్టర్: వైకుంఠ రామ శర్మ, దర్శకుడు: బి. విఠలా చార్య. మార్చి 13 నుంచి యీ చిత్రం తాలూకు రెగ్యులర్ షూటింగ్ ప్రారంభమవుతుంది.

*　　*　　*

ప్రసిద్ధ సినీనటి బి. సరోజాదేవి వివాహం యీ నెల మొదటి తేదీన బెంగుళూర్‌లో జరిగింది. వరుడు శ్రీ బి. కె. శ్రీహర్ష. ఈయన బెంగుళూర్‌లోని భారత్ ఎలక్ట్రానిక్స్‌లో సీనియర్ యింజనీర్‌గా వుంటున్నారు. వీరి వివాహం ఉడ్‌లాండ్స్ హోటల్ కళ్యాణ మంటపంలో ఉదయం పదిన్నర, పదకొండున్నర గంటల మధ్య వృషభలగ్న మందు జరిగింది.

*　　*　　*

సినీనటుడు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారి ప్రథమ, ద్వితీయ పుత్రికల వివాహం యీ నెల 2 వ తేదీ తెల్లవారు జామున తెనాలి తాలూకా మొసలిపాడులోని వారి గృహంలో ఘనంగా జరి గింది. పెద్దమ్మాయి చి. సౌ. విజయశ్రీని, మొసలి పాడు వాస్తవ్యులైన గొట్టుముక్కల అబ్బయ్య గారి జ్యేష్ఠ పుత్రుడు చి. వెంకట అప్పారావుకీ, రెండవ అమ్మాయి చి. సౌ. సామ్రాజ్య లక్ష్మిని, దావులూరు వాస్తవ్యులు ఉప్పల వీరయ్యగారి జ్యేష్ఠ పుత్రుడు చి. బసవ పున్నయ్యకీ యిచ్చి శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారు వివాహం జరిపించారు. చి. వెంకట అప్పారావు బి. ఇ. ఫైనల్ ఇయరూ, చి. బసవ పున్నయ్య బి. టెక్. నాలుగో సంవత్సరమూ చదువు తున్నారు.



"నిశరాత్రి 12 గంటలు"లో పద్మిని

*　　*　　*

శ్రీ ప్రొడక్షన్స్ వారి సాంఘిక చిత్రానికి మొదటి షూటింగ్ షెడ్యూల్‌లో 20 రోజులపాటు పని జరిగింది. మాధవరావు (నాగయ్య) యింటి సెట్టు, వరహాలు (నాగభూషణం) డెన్ లాయరు (రావి కొండలరావు) యింటిసెట్టు మీదా, కొంత అవుట్ డోర్‌లోనూ ముఖ్యమయిన దృశ్యాలను చిత్రీక రించారు. ఇంతవరకు నాలుగు రీళ్లు తయారయిన యీ చిత్రంలో కృష్ణ, వాణిశ్రీ, కాంచన, చంద్ర మోహన్, సంధ్యారాణి యితర ముఖ్య పాత్రధారులు. రచన: భమిడిపాటి రాధాకృష్ణ, సంగీతం: టి. చలపతి రావు, కెమెరా: యస్. వెంకటరత్నం, కళ: యస్. కృష్ణారావు, సహాయదర్శకులు: ఓ. యస్. ఆర్. ఆంజనేయులు, సి. బ్రహ్మానందరావు. దర్శకుడు:



"అర్ధరాత్రి"లో భారతి



"అన్వేషి"లో దేవి కాంతికళ


"శాంతకుని వాళ్ళ"లో యస్. వి. రంగారావు


"కంచుకోట"లో సావిత్రి, దేవిక

# చిత్రలహరి

వి. రామచంద్రరావు బి. ఏ. (ఆనర్సు), నిర్మాతలు: సుందర్‌లాల్ నహతా, డూండీ.

*　　*　　*

"ఈ చిచ్చు ఏం చేసిందో తెలుసునా?" అన్నారు పద్మనాభం, పక్కనే వున్న బేబి పద్మినిని చూపిస్తూ. ఆవాళ వాహినిలోని 'బి' థియేటర్‌లో "శ్రీశ్రీశ్రీ మర్యాద రామన్న" రషెస్ చూసేందుకు వెళ్ళాను. రావలసిన వాళ్ళు ఇంకా ఉండటం చేత— థియేటర్‌కి ఎదురుగా వున్న లాన్‌లో పద్మనాభంగారూ, బేబీ పద్మిని, దర్శకుడు కె. హేమాంబరధరరావు గారూ, నేనూ కూచుని వున్నాం. "ఏం చేసిందేమిటి" అంటూ అడిగాను కుతూహలంగా. "మొన్న గుంటకల్లు" "లేతమనసులు" సెలబ్రేషన్‌కి వెళ్ళాం కదూ, అక్కడ స్టేజిమీద పిక్చర్‌లో తన డైలాగులు చదివేసింది, యాక్షన్‌తో సహా. బాగా కంఠస్థము చేసేసినట్టుంది, ఎక్కడా ఒక్క మాట కూడా పొల్లుపోకుండా చదివేసింది" అన్నారు. పద్మిని చటుక్కున అందుకుని "ఏం చెయ్యను మరి, ఏదో ఒకటి అక్కడ ఏలాగూ మాట్లాడమంటారు గదా అని చెప్పి ముందుగా గ్రహించి యీ పని చేశాను!" అన్నది నవ్వుతూ.

*　　*　　*

మర్యాద రామన్న రషెస్ చూశాను. పద్మనాభం గారు ఆ చిత్రంలో రెండు కొత్త తరహా గెటప్స్‌లో కనిపిస్తారు. ఒకటి గొర్రెల కాపరి మరొకటి వృద్ధరాజు. ఈ రెండు తరహాల భూమికలూ పోషించటంలో ఎంతో నేర్పు కనపరిచారు. మేకప్ ఆర్టిస్టు కృష్ణ ఆయన్ని తీర్చి దిద్దడంలో చాలా ప్రతిభ చూపించాడనిపించింది. కథలో కొత్తదనం, బిగువు ఉన్న చిత్రం మర్యాద రామన్న. మామూలు జానపద చిత్రాల ధోరణిలో కాకుండా కొత్త పద్ధతిలో హాస్య ధోరణిలో సాగే యీ చిత్రానికి కె. హేమాంబరధరరావు దర్శకత్వమూ, కోదండపాణి సంగీత దర్శకత్వమూ నెరపుతున్నారు. ఇందులో రాజశ్రీ, నాగనాథ్, కృష్ణ, శోభన్‌బాబు, రామకృష్ణ అతిథి నటులుగా పాల్గొన్నారు.

—మోహన్‌కుమార్





# శ్రీ శే. సదాశివ్ గోవింద్ బార్వే

[ఒక సుప్రసిద్ధ ఆంగ్లపత్రిక సంపాదకుడు అన్నట్లు శ్రీ వి. కె. కృష్ణమీనన్ కొన్ని సిద్ధాంతాల ప్రచారకుడు. ఆ సిద్ధాంతాల ప్రచారానికి కాంగ్రెసులో తనకి అవకాశం ఉన్నంతకాలమే ఆయనకి ఆ సంస్థతో పొసగుతుంది. ఆ అవకాశం పోయినప్పుడు ఇక ఆ సంస్థలో ఉండి ప్రయోజనంలేదని ఆయనకి అనిపించి ఉండవచ్చు. కాని బొంబాయిలో సీటుకి టిక్కెట్టు నిరాకరించేదాకా ఈ విషయం ఆయన గమనించకపోవటం వింతగానే ఉంటుంది! శ్రీకృష్ణమీనన్‌కి ఎదురుగా ఒక మాజీ ఐ. సి. ఎస్. అధికారిని నిలబెట్టారు. వామపక్షవర్గాలన్నీ ఏకమయి శ్రీ కృష్ణమీనన్‌ని బలపరిచాయి. జనసంఘం ప్రతినిధి శ్రీ అగాస్కర్ కూడా శ్రీ బార్వే ఓడిపోవటమే తమ ఉద్దేశమని ఒక పెద్ద బొంబాయి ఆంగ్లపత్రికలో ప్రకటించారు! దేశంలోని 'వామపక్ష పత్రికలేకాక' విదేశీ పత్రికలు కూడా బార్వే—కృష్ణమీనన్‌ల పోటీ తిరోగమనానికీ పురోగమనానికీ మధ్య యుద్ధం అని రాశాయి. ద్రా. ము. క. బొంబాయిలోని దక్షిణ భారతీయులని శ్రీ మీనన్‌నే బలపరచమని ఉద్బోధించింది. మద్రాసులో 'ద్రావిడ కజగం' కాంగ్రెసులో కొందరిని బలపరిచినట్లే మహారాష్ట్ర దురభిమానంకల 'శివసేన' బార్వే పక్షం వహించింది. చివరికి కాంగ్రెసు అభ్యర్థి శ్రీ బార్వే గెలిచారు. శ్రీయుతులు బార్వే, మీనన్‌లని ఇద్దరినీ ఓడించాలని జనసంఘం పత్రికలు ప్రచారం చేసిన అగాస్కర్‌కి సుమారు 70,000 ఓట్లు మాత్రమే వచ్చాయి! ఈ ఎన్నిక ఫలితం గురించి ఇంకా కొంతకాలం తీవ్రవాద వివాదాలు జరుగుతూనే ఉంటాయి. శ్రీ బార్వేతో కొంతకాలం క్రితం పరిచయం ఉన్న శ్రీ వి. ఎన్. ముక్తాంకర్ ఆయన మీద చిన్న 'వ్యాసం' ఒకటి రాశారు. —సం.]

గోవింద్ సదాశివ్ బార్వే ఏప్రిల్ 27, 1914లో జన్మించారు. బొంబాయి, కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయాలలో పట్టభద్రులయ్యారు. 1935 లో ఇండియన్ సివిల్ సర్వీస్‌లో చేరి, పూనా కలెక్టర్ ఉద్యోగంతో ప్రారంభించి 1966 లో ప్లానింగ్ కమిషన్ సభ్యులయ్యారు. 1967 లో ఈశాన్య బొంబాయి లోక్‌సభ నియోజకవర్గానికి కాంగ్రెసు అభ్యర్థిగా ఎన్నికయ్యారు. ఇది అందరికీ తెలిసిన వివరాలే. కాని, "బార్వే కృష్ణమీనన్‌ని ఓడించారు!" అన్న వార్త విన్నప్పుడు ముప్ఫయ్యేళ్లకింది జ్ఞాపకాలు నాలో మెదిలాయి.

నేను 1928 లోనే పూనాలోని ఫెర్గుసన్ కాలేజిని వదిలి బొంబాయికి వెళ్లిపోయాను. అయినా పూనా నగరానికి వెళ్ళినప్పుడల్లా మా పాత కాలేజీ చూసిరాకుండా ఉండలేకపోయేవాడిని.....

1932లో అనుకుంటాను. చివరి ఏడు చదువుకుంటున్న ఒక స్నేహితుడితో కాలేజి ఆవరణలో షికార్లు చేస్తున్నాను. మా పక్కనుంచి ఒక ఎర్రటి అబ్బాయి వేగంగా సయికిలు తొక్కుకుంటూ వెళ్లాడు.

"హలో!" అన్నాడు నా స్నేహితుడు చూసి. అతను 'హలో' అన్నాడు.

"అతనెవరో తెలుసా?" అని నా మిత్రుడు నన్నడిగాడు. "నా క్లాస్‌మేట్ బార్వే! మన కాలేజికంతా అన్నిటిలోనూ ఫస్ట్! ఇంటర్‌లో ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాడు. ఈసారి 'ఎల్లిస్ ప్రయిస్' కొట్టెయ్యడమేకాక యూనివర్శిటీ గోల్డ్‌మెడల్ కూడా కొట్టేస్తాడని మా ప్రొఫెసర్లంతా అనుకుంటున్నారు......వాళ్ల నాన్నగారెవరో తెలుసా? సాంగ్లీ సంస్థానం దివాన్! ఎంతో ఆచారపరుడు. కొంకణస్థ బ్రాహ్మణులు వాళ్లు......అసలే డబ్బున్న కుటుంబంలో పుట్టాడేమో బార్వే తప్పకుండా ఇంగ్లండ్‌వెళ్ళి ఐ. సి. ఎస్. పరీక్షకి కూర్చుంటాడు......చూస్తూ ఉండు......" అని వివరించాడు నా మిత్రుడు.

అంతటితో ఆపుతాడేమో అనుకున్నానుగాని అతను ముసి ముసినవ్వులతో మళ్లీ ఇలా చెప్పుకుపోయాడు. "బార్వే నాతో చాలా చనువుగా ఉంటాడు, మేమిద్దరం ఒకే హాస్టల్ 'మెస్' లో భోంచేస్తూ ఉండేవాళ్లము. నే చెప్పిందంతా విని అతనేదో 'పుస్తకాల పురుగు' అనుకుంటావేమో! ఇతను బాగా చదువుతాడు, మంచి రసికుడు కూడా......"

నా కౌతుకాన్ని ఇలా రెచ్చగొట్టి నా స్నేహితుడు ఆగిపోయాడు. ఒక చిన్న నవ్వునవ్వి, "నమ్ముతావో నమ్మవోగాని ఇతనొక పెద్ద ప్రేమ వ్యవహారంలో పడిపోయాడు! ఆ అమ్మాయి కూడా ఇదే కాలేజి—రెండేళ్ళు జూనియర్—ఎంతో అందంగా ఉంటుంది. అయితే ఆమె కులంవేరు...కాయస్థులు"...

తన కథ ముగించి మళ్లీ నవ్వాడు. అంతటితో ఆ విషయం గురించి చెప్పటం ఆపివేశాడు.

మూడేళ్లతర్వాత ఈ స్నేహితుడినే పూనాలో మళ్లీ కలుసుకోవటం జరిగింది. అప్పటికి అతను లాయర్ ప్రాక్టీసు పెట్టాడు.

"బార్వే ఇంగ్లండునుంచి తిరిగి వచ్చేశాట్ట తెలుసా? కేంబ్రిడ్జిలోనూ బాగా పాసయ్యాట్ట. ఐ. సి. ఎస్ లో చేరాట్ట.... కాని వీటన్నిటికన్నా పెద్ద హడావుడి చేసేశాడు! చెప్తా విను......"

"బార్వే ఐ. సి. ఎస్ పాసయ్యాడని వినగానే రాజగారు" (ఈయన దక్షిణ మహారాష్ట్రలో ఆస్థానాధిపతి అయిన ఒక కొంకణస్థ బ్రాహ్మణ కులం వాడు) తన కుమార్తెని ఇస్తానని బార్వే తండ్రికి కబురుపెట్టాట్ట! అమ్మాయి అందకత్తె, గ్రాడ్యుయేట్ కూడాను! రాజరికంతో సంబంధానికి దివాన్‌గారు వెంటనే ఒప్పేసుకున్నారుగాని మనవాడు వింటేనా? కాలేజిలో ప్రేమించిన ఆ కాయస్థుల పిల్లనే చేసుకుంటానని కూర్చున్నాడు! నిజంగా బార్వే పెద్ద రోమియో అయిపోయాడు. ఏమంటావు?"

"నిజంగా రోమియో అనతగినవాడే" అని అంగీకరించాను.

శ్రీ బార్వే జీవితంలో ఈ ప్రేమ వ్యవహారమే అతనిపట్ల నాకు సదభిప్రాయం కలిగించిందేమో అనిపిస్తుంది నాకు. అతని క్రమాభివృద్ధిని, పురోగమనాన్ని ఆసక్తితో గమనిస్తూనే వచ్చాను.

1948 లో శ్రీ ఎస్. జి. బార్వే పూనా కలెక్టర్ అయ్యాడు. ఆ ఏడే మహాత్ముడిని హత్యచేశారు. ఈ హత్యని కొందరు తమ కిష్టం వచ్చినట్లు వాడుకున్నారు. మహారాష్ట్రలో బ్రాహ్మణ ద్వేషం ఒక్కసారిగా పెల్లుబికింది, హంతకుడు గాడ్సె బ్రాహ్మణుడు కాబట్టి అక్కడి బ్రాహ్మణులందరూ ఎన్నో బాధలకి లోనయ్యారు. ఎందరో బ్రాహ్మణుల ఇళ్లని దోచుకున్నారు. ఈ క్లిష్ట పరిస్థితులలో కలెక్టరుగా బార్వే ఎంతో సాహసంతో, నిబ్బరంతో ప్రవర్తించాడు. అందరూ అతని పరిపాలనా దక్షతని కొనియాడారు.

మరునాటి సంవత్సరం బార్వే పూనా నగరం మునిసిపల్ కమిషనర్ అయ్యాడు. ఈ ఉద్యోగం చేసిన మూడు సంవత్సరాలూ అందరి ప్రశంసలనూ పొందాడు.

1962 దాకా అతని అభివృద్ధి, ప్రజా బాహుళ్యానికి తెలిసినంతదాకా సాఫీగా జరిగిపోయింది. ఆ సంవత్సరం మాత్రం బార్వే వ్యక్తిగత జీవితానికి సంబంధించిన విషయాలు కొన్ని రచ్చకెక్కాయి. 19 2 లో శ్రీ బార్వే కాంగ్రెసుపార్టీలో చేరి మహారాష్ట్ర శాసనసభ అభ్యర్థిగా నుంచున్నాడు.

ఆ సందర్భంలో శ్రీమతి బార్వే—తను ప్రేమించి పెళ్లిచేసుకున్న మనిషి—జనసంఘం అభ్యర్థిని బలపరచటం ప్రారంభించింది! అందరూ ఆశ్చర్యపోయారు. శ్రీమతి బార్వే కేవలం వాక్ప్రచారంతో ఆగక తన భర్త నడవడి మంచిది కాదనే ఆరోపణలు చేస్తూ ఒక చిన్న పుస్తకం కూడా ప్రచురించింది. 1958 లో బార్వే దంపతులు ఇద్దరూ విడిపోయారుట!

బార్వే ప్రతిపక్షంవారు ఈ విషయాన్ని అతని మీద ప్రయోగించటానికి వెనుకాడలేదు.

బార్వే ఎన్నిక నెగ్గాడు. మహారాష్ట్ర ఆర్థిక మంత్రి అయ్యాడు. కాని 1930 ప్రాంతాలలో ప్రేమికుడుగా నాకు పరిచయం అయిన వ్యక్తికి 1960 ప్రాంతాలలో తను ప్రేమించి పెళ్లి చేసుకున్న భార్య ఎదురు తిరగటం ఎంత విచిత్రంగా ఉంది అని ఇప్పటికీ నాకు అనిపిస్తూ ఉంటుంది.

"జూదంలో అదృష్టం ఉండేవారికి ప్రేమ వ్యవహారాల్లో అదృష్టం వరించ" దంటారు కొందరు. రాజకీయాలు ఒక రకం జూదమేకదా!

పై వ్యాసం శ్రీ ముక్తాంకర్ రాసినతర్వాత శ్రీ బార్వే మరణవార్త అందింది— సం॥

# విశ్వనాధ, గణపతి, సత్యనారాయణశాస్త్రులు

దాసోని సుదర్శన్ రెడ్డి

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కొన్ని ప్రాచీన కావ్యాలను ఈ సంవత్సరం ప్రచురించింది. సామాన్యుడికి సైతం అందుబాటులోవుండే విధంగా అతి సరసమైన ధరకు వేమన పద్యాలు, మనుచరిత్ర, పాండురంగమాహాత్మ్యము, వసుచరిత్ర, విజయవిలాసమువంటి 14 కావ్యాలను వెలువరించినది. ఉద్దండులైన పండితులు, కవులు వీటికి సంపాదకత్వం వహించి, సాధికారికమైన పీఠికను రచించారు. అకాడమీ దశమ వార్షికోత్సవంనాటికైనా ఇలాంటి ఉత్తమ కృషికి వీలు కలగడం ఆశ్చర్యం. పదేళ్లకోసారైనా, అకాడమీ ఇలాంటి మంచిపని చేయాలని ఒక సీనియర్ రచయిత వ్యాఖ్యానించారు.

తెలుగుభాషకు, తెలుగు సాహిత్యానికి ఈ శతాబ్దిలో అమూల్యమైన సేవ చేసిన సాహిత్య ద్రష్టలను విశిష్ట సభ్యులుగా సత్కరించే సంప్రదాయాన్ని అకాడమీ గత సంవత్సరం నెలకొల్పినది. గత సంవత్సరమే విశిష్ట సభ్యుడుగా సన్మానితుడైన శ్రీ గిడుగు సీతాపతి దశమ వార్షికోత్సవం నాడు అకాడమీ తరపున 15 మందిని సన్మానించారు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, గుండేరావు హర్కారే, విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు మొదలగువారు విశిష్ట సభ్యులుగా సన్మానించబడ్డారు. అస్వస్థులుగా ఉన్నందున శ్రీ వేలూరి శివరామశాస్త్రి, శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి సన్మానోత్సవానికి హాజరు కాలేదు.

ఆధునిక వాఙ్మయానికి 1966–67 సంవత్సరపు ఉత్తమ బహుమతులు ప్రకటించారు. 1961 నుండి 1966 వరకు గడచిన ఐదు సంవత్సరాల్లో వచ్చిన ఉత్తమ గ్రంథాలకు ఈ బహుమతులు అందజేసారు. పద్య కావ్యం 'ఆంధ్ర పురాణము' (ద్వితీయభాగము) కర్త శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రికి, నవల 'విశాల నేత్రాలు' రచయిత శ్రీ పిలకా గణపతిశాస్త్రికి, కథానికల సంపుటము 'రాచకొండ విశ్వనాథశాస్త్రి కథలు' వ్రాసిన ఆ రచయితకూ, వెయ్యినూటపదహార్లు చొప్పున బహుమతులు అందజేశారు. వచ్చే సంవత్సరం సాహిత్య విమర్శకు కూడా బహుమతి ఇవ్వడానికి అకాడమీ నిర్ణయించినది. ప్రముఖ రచయిత్రి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మను, 1966 సంవత్సరమునకు హిందీలో సృజనాత్మక సాహిత్యమున ఉత్తములుగా నిర్ణయింపబడిన శ్రీ బాల శౌరిరెడ్డిని అకాడమీ సన్మానించినది.



శ్రీ రాచకొండ విశ్వనాధశాస్త్రి — శ్రీ పిలకా గణపతిశాస్త్రి — శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

సమకాలికులైన రచయితలను ప్రోత్సహించడానికి ఆధునిక వాఙ్మయం ప్రణాళిక ఉద్దేశించబడినది. మూడేళ్ళక్రితం అకాడమీ, ఈ ప్రణాళికను ప్రారంభించినది. గత రెండేళ్లలోనూ అకాడమీ బహుమతులు విమర్శకు గురిఅయ్యాయి. ఉత్తమ గ్రంథాలను ఎంపిక చేయడానికి అకాడమీ నియమించే న్యాయ నిర్ణేతల పేర్లను బహుమతులు ప్రకటించిన తర్వాత కూడా తెలియజేయకపోవడం విచారకరం—అవార్డుల బాగోగులు అకాడమీకి ఎంత ప్రాధాన్యమో, సాహిత్యపిపాసకులకూ అంతే. న్యాయ నిర్ణేతల పేర్లను మర్మంగా ఉంచడంలో సహేతుకత లేదు. ఏ ఏ పోటీకి ఎన్ని గ్రంథాలు వచ్చాయో కూడా అకాడమీ కార్యదర్శి ఈ రచయితకు తెలియజేయలేకపోయారు. న్యాయ నిర్ణేతల పేర్ల ప్రకటన వల్ల బహుమతులకు ఉదాత్తత చేకూరుతుంది. పోటీలో పాల్గొన్న మరో రచయిత అన్నమాటలో నిజం లేకపోలేదు.

## శ్రీ రాచకొండ విశ్వనాధశాస్త్రి

ఆధునిక రచయితలకు రచయితగా, మాస్టర్ ఆఫ్ స్టోరీస్‌గా మన్నన పొందుతున్న 45 ఏళ్ల శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రిని అకాడమీ ఆదరించడంలో తెలుగు కథానికా ప్రక్రియకు పరిగణన లభించినది. రచనల్లో తీవ్రత, ఉద్వేగం కనిపిస్తుంది. మనిషిలో మెన్మది, గంభీరమూ, ఆవేదనాత్మకమైన ఘర్షణ ద్యోతకమవుతుంది. అతన్ని డికెన్సు అన్న స్ఫురణ ఆయనకు రచనలు చదివినవారికి కలుగుతుంది. ఒకమారు నేను రాచకొండ విశ్వనాథశాస్త్రిగారితో దాదాపు గంటన్నరసేపు సాహిత్య విషయాలు ముచ్చటించడం జరిగింది. కథానిక రచనలో శాస్త్రిగారు వస్తువుకే ప్రాధాన్యమిస్తారు. "వస్తువు ముఖ్యం. ఆతర్వాత కథను ఎంత బాగా సమర్పించాలన్నదే నా తహతహ. వస్తువు ఉన్నప్పుడే నేను కథ వ్రాస్తాను. కథను తెలివిగా చెప్పాలి. పాఠకుడిని ఆద్యంతమూ చదివించాలి" అని ఆయన ఒకమారు నాతో చెప్పారు.

తొమ్మిదవ ఏటనుండి విశ్వనాథశాస్త్రి రచన చేయడం ప్రారంభించారు. 1931 లో ఆయనకు రాయాలన్న సరదా కలిగింది. ఇంట్లో తల్లి, నాయనమ్మ, పురాణాలు, రామాయణ భారతాది గ్రంథాలూ, సాహిత్య పత్రికలూ చదివేవారు. ఆ కథలన్నీ శాస్త్రికి చెప్పేవారు. పౌరాణిక సాహసిక గాథలంటే అందుకే చిన్ననాటినుండే ఇష్టం. 15 వ ఏట ఆయన వ్రాసిన కథ 'వినోదిని' పత్రికలో ప్రచురితమైనది. ఆ తర్వాత పెక్కు కథలూ, వివిధ పత్రికల్లో వచ్చాయి. డికెన్సు, వుడ్‌హౌస్, ఓ. హెన్రీవంటి రచయితలను రాచకొండ విరివిగా చదివారు. చెకోవ్ తనపై ప్రభావం వేసాడని శాస్త్రిగారు చెప్పారు. డికెన్సు ఆయనకు అభిమాన రచయిత.

కథ గురించి రాచకొండ చెపుతూ, "నిజాన్ని బాగా కనిపెట్టి అందులోనుంచి అబద్ధం లాగగలగడం వంటిదే కథ చెప్పడం అనిపించింది నాకు. వాస్తవంగా జీవితంలో ఎన్నో సంఘటనలు జరుగుతుంటాయి. వాటిని గురించి ఆలోచిస్తుంటే నా వూహ రక రకాలుగా పరుగెత్తుతుంది. అలా పరుగెత్తడంలో నాకు కథలు పుడుతుంటాయి" అన్నారు. ఇంతవరకు ఆయన 80 కథలకుపైగా వ్రాశారు. వాటిలో 50 కథలు సంపుటాలుగా వచ్చాయి. విశ్వనాథశాస్త్రి వ్రాసిన 'అల్పజీవి' నవల తెలు

టిలో వచ్చిన ఉత్తమ నవలల్లో ఒకటని విమర్శకుల భావన. ఆయన వ్రాసిన 'విజం' ఈ దశాబ్దిలో వెలువడిన ఉత్తమ నాటకాల్లో ఒకటి. న్యాయ వాదవృత్తిని నిర్వహిస్తూనే ఆయన మరోవంక రచనలు చేస్తున్నారు. ఈ రోజుల్లో మంచి రచనలు అరుదుగా వస్తున్నాయని నేను అడిగిన మరో ప్రశ్నకు చక్కని సమాధాన మిచ్చారు.

## శ్రీ పిలకా గణపతిశాస్త్రి

56 ఏళ్ల గణపతిశాస్త్రిగారు ఉభయ భాషా ప్రవీణులు. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో విద్యాభ్యాసం పూర్తి అయిన తర్వాత ఉపాధ్యాయ వృత్తి కొంతకాలం చేశారు. ఆ తర్వాత పత్రికా రచనా వృత్తిలో ప్రవేశించారు. దాదాపు 9 గ్రంధాలు ప్రచురించారు. శరత్, అనాటోల్, ఫ్రాన్స్ గ్రంథాలను తెలుగులోనికి ఆయన అనువాదితం చేశారు. ఆంధ్రపత్రికలో పనిచేస్తూ మహా భారతం అనువదించారు. ఆరోజుల్లో ఆయన రచించిన 'ప్రమద్వర' కావ్యం సాహితీప్రియా భావుకులను ఎంతగానో ఆకర్షించింది. సంప్రదాయసిద్ధంగా సంస్కృతం అభ్యసించిన శ్రీ శాస్త్రి వ్రాసిన 'విశాల నేత్రాలు' నవల పత్రికలో ధారావాహికంగా ప్రచురితమైనప్పుడు విశేష ప్రాచుర్యాన్ని పొందినది. త్వరలో ప్రముఖ తెలుగు చలన చిత్ర దర్శకులు ఈ నవలను చిత్రీకరించనున్నారు.

## శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి

47 ఏళ్ల ఆంధ్రపురాణ కావ్య రచయిత శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గురుముఖతః సంస్కృతం అధ్యయనం చేశారు. జన్మస్థానం తూర్పు గోదావరిజిల్లాలోని పల్లిపాలెం. అటు మాతామహులు ఆకుండి రామమూర్తిగారు, ఇటు మేనమామ వెంకట రామశాస్త్రిగారూ, ఉభయులూ విద్వాంసులూ, కవులు కూడా. 'ఆంధ్రి' సాహిత్య పత్రిక ఆ రోజుల్లోనే వెలకొల్పి, చక్కని సంప్రదాయంలో నడిపారు. అనంతరం డిగ్రీలులేని పాండిత్యం, పన్నెకు రాదని, ఓరియంటల్ డిగ్రీ పొందారు. ఈమధ్యలో సూర్య రాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో పని చేస్తుండగా, 'ఆంధ్ర రచయితలు' (19 వ శతాబ్దంలోని కవుల, రచయితల జీవిత విశేషాలు) రచించారు.

అయిదారు సంవత్సరాలక్రితం 'ఆంధ్ర పురాణం' (కీర్తి శేషులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారితో మన ఇతిహాసాన్ని గురించి చర్చించి, ఆయన ఆమోదంతో రాయడం మొదలుపెట్టారు.) ప్రథమ భాగం వెలువడినప్పుడు ఆధునికుల్లో చక్కని కవితా సంప్రదాయాన్ని నిలబెట్టేకవి ఆవిర్భవించారని పలువురు భావించారు. సంప్రదాయాన్ని విడువకుండా, ఆధునికతను మేళవించుకుని వ్రాసే అగ్రశ్రేణి కవులు విశ్వనాథ, పింగళి, గడియారం, మొదలగువారి కోవకు చెందినవారు శ్రీ మధునాపంతులవారు.

ఆంధ్ర పురాణం ద్వితీయభాగం ఇటీవలనే వెలువడడంతో ఆంధ్రుల ఇతిహాసం కావ్యబద్ధమై అక్షరమయినది. నన్నయ్యదారిలో నడిచి, రసబంధురంగా, ఔచిత్యాన్ని పాటిస్తూ, వర్ణనల్లో నాటకీయత్వాన్ని చూపడం శ్రీ సత్యనారాయణశాస్త్రి ప్రత్యేకత. ●




(శ) బంధుత్వం :

టెలిఫోను గణగణా మోగింది.

సరళ (స్పీ)కరు అందుకుంది. "హలో!"

"ఇది 274376 నెంబరేనా?" అని అడిగింది ఒక ఆడగొంతు.

"అవును. ఎవరా మాట్లాడేది?" అంది సరళ.

"నా గొంతు ఆనమాలే పట్టలేకపోయావా? మా అమ్మ మీ అమ్మకి అత్తగారు అవుతుంది. ఇప్పుడేనా గుర్తుకొచ్చిందా?"

ఊహూ. సరళకి గుర్తు రాలేదు. అసలు ఆ బాంధవ్యం ఏమిటో అర్థమే కాలేదు. మీకు తెలిస్తే చెప్పండి సరళకీ, ఆ వ్యక్తికీ ఏ రకమైన సంబంధం ఉందో?




(ష) ఠంగ్ ఠంగ్!

ఒక గోడ గడియారం 5 సెకనులలో ఆరు గంటలు కొడుతుంది. 12 గంటలు కొట్టడానికి ఎంత కాలము పడుతుంది?




(ట) తగ్గింపు ధరలు:

"కిందటి ఏడాది మిగిలిపోయిన బనీన్లు చాలా భాగం అమ్మకాం ఎల్లా అయిపోయేవేనా?" అన్నాడొక వ్యాపారస్థుడు సంతృప్తిగా భార్యతో.

"ఏం చేశారేం?" అని అడిగింది భార్యామణి.

"బనీను ధర రెండు రూపాయలంటే అమ్మకాలు జరగ్గలేదు. ధరలు తగ్గించాను. అంతే జనం విరగబడి కొన్నారు."




"లాభం ఏపాటికి వచ్చింది?"

"ఇంకా లెక్క చూడలేదు. అమ్మకంవల్ల రూ. 603.77 పై వచ్చింది. అని జ్ఞాపకం."

"మొత్తం ఎన్ని బనీన్లు అమ్ముడుపోయాయి"

"అదీ లెక్క చూడలేదు" అన్నాడు వ్యాపారస్థుడు. ఎన్ని బనీనులు అమ్ముడుపోయాయో మీకేమైనా తెలుస్తుందా?




(త) ఎలుకలవేట

5 పిల్లులు 5 నిమిషాలలో 5 ఎలుకలను చంపగలవు. 100 నిమిషాలలో 100 ఎలుకలను చంపడానికి ఎన్ని పిల్లులు కావాలి? సమాధానం చటుక్కున చెప్పాలి......అబ్బ! ఇంతసేపా?




(ప) కప్పగంతులు

ఒక సరస్సులో రెండు తెల్లని కప్పలు, రెండు నల్లని కప్పలు వర్ణ విభేదాలు మరిచి చాలా కలిసి కట్టుగా ఉంటున్నాయి. చక్కగా ఎండకాస్తున్న ఒకరోజున ఆ నాలుగు కప్పలకూ ఆటలాడుకుందామని బుద్ధిపుట్టింది. నీళ్లమీద తేలియాడుతూ ఎనిమిది తామరఆకులు (బొమ్మలో చూపినట్లు) కనిపించాయి. సౌలభ్యంకోసం వాటిని 1, 2 3....8 అని అంకెలతో సూచిస్తాం. 1, 3 అనే ఆకులమీద తెల్లకప్పలు రెండూ కూర్చున్నాయి. 6, 8 అనే ఆకులమీద నల్లని కప్పలు కూర్చున్నాయి. అవి ఒక ఆకుమీదనుంచి గీతతో కలుపబడిన మరో ఆకుమీదకు దూకగలవు. ఆ కప్పలు సరదాకి తమ స్థానాలను మార్చుకుందామనుకున్నాయి. అంటే నల్ల కప్పలు 1, 3 అనే ఆకులమీదికి, తెల్లకప్పలు 6, 8 నే ఆకులమీదికి చేరుకోవాలి. ఒకే ఆకుమీద ఏక కాలంలో ఒకటికన్న ఎక్కువ కప్పలు కూర్చోవడం సాధ్యంకాదు. ఒక కప్ప ఒక ఆకుమీదినుంచి గీతతో కలుపబడిన మరో ఆకుమీదికి ఎన్నిసార్లు అయినా



దూకవచ్చు. అది అంతా ఒక "ఎత్తు" కిందే లెక్క. తెలివైన ఆ కప్పలు సరిగ్గా ఏడు ఎత్తులలో తమ స్థానాలు మార్చుకోగలిగాయి! అవి ఏవిధంగాగంతులు వేశాయో మీరు వూహించగలరా? కప్పలకు బదులుగా రెండు చింతగింజలు, రెండు గులకరాళ్లు ఉపయోగించి, ఈ సమస్యను 7 ఎత్తులలో సాధించండి చూద్దాం!

### జ వా బు లు

(శ) టెలిఫోను చేసిన వ్యక్తి సరళకి మేనత్త అయి ఉండాలి.

(ష) 12 గంటలు కొట్టడానికి 10 సెకనులు పడుతుందని మీ జవాబైతే, అది తప్పు. గడియారం టంగుమని గంట కొట్టడానికి పట్టే కాలము లెక్కింపదగ్గదికాదు. గంటకీ గంటకీ మధ్య వ్యవధే ముఖ్యమైనది. 6 గంటలు కొట్టిందంటే మధ్యని 5 వ్యవధులున్నాయి. వీటికి 5 సెకనులు పట్టింది. అంటే గంటకీ గంటకీ మధ్యని ఒక్క సెకను వ్యవధి ఉంది. 12 గంటలు కొట్టాలంటే అటువంటి వ్యవధులు 11 ఉన్నాయి. కనుక 11 సెకనులు పడుతుంది.

(ట) 60377 అనే సంఖ్యని 173 × 349 అని వ్రాయవచ్చు. ఇందులో ఒకటి బనీనుల సంఖ్య, మరొకటి వాటి ఖరీదు (పైసలలో) అయి ఉండాలి. బనీను ధర రెండు రూపాయలనుంచి తగ్గించినట్లు తెలుసుకున్నాం కనుక బనీను ఒకటికి రు. 1.73 చొప్పున 349 బనీనులు అమ్మిఉండాలి.

(త) ఐదు పిల్లులే చాలును (వాటికి విసుగెత్తి మధ్యలో ఎలుకల వేట మానెయ్యకుండా ఉంటే)

(ప) ఏడు ఎత్తులలో ఈ క్రిందివిధంగా సమస్యను సాధించవచ్చు. (1—5): (3—7, 7—1): (8—4, 4—3, 3—7): (6—2, 2—8, 8—4, 4—3): (5—6, 6—2, 2—8): (1—5, 5—6): (7—1.) ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S.Sambhu Prasad.

